# చతుర

సెప్టెంబరు 2006 రూ. 7/-



సుంకోజి దేవేంద్రాచారి నవల నీరు నేల మనిషి



## గుడ్డుకో గువ్వ

నేల మీద రెల్లు పడక....
పడక మీదో గుడ్డు...
గుడ్డు మీదో గువ్వ....
చూపానినంత మేర
గువ్వల బారులు.
నిర్ణీత దూరంలో
క్రమపద్ధతిలో ఎవరో
మంత్రించినట్లు
నిశ్చలంగా కూర్చున్న
ఈ పక్షులు యమా
బిజీగా గుడ్లను
పొదిగేస్తున్నాయి.
హిందూ మహా సముద్ర
తీర ప్రాంతం సిషెల్స్‌లోని
ఓ పక్షుల దీవిలో వర్ష
ఋతువుకు ముందు
కనిపించే దృశ్యమిది.
ఇవి లక్షలాదిగా
గుమిగూడి ఇలా
సంతానోత్పత్తిని
చేస్తాయి.

సంపుటి : 29 | సంచిక : 8
సెప్టెంబరు : 2006 | 344వ సంచిక

నవ నవలా వేదిక

# చతుర



---

హెల్త్ బిట్స్:
ఎం. వెంకటేశ్వరరావు

ఈ నెల నవల

సగటు రైతు కుటుంబం
కడగండ్లకు అక్షర చిత్రం
సుంకోజి దేవేంద్రాచారి నవల

## నీరు నేల మనిషి

10వ పేజీలో

---

బొమ్మలు: పినిశెట్టి





# అనుభవం ఆవిష్కృతమైనదే ఉత్తమ సృజన


ఆస్కార్ వైల్డ్

'శాశ్వత దుఃఖం' అనే కొండను తొలిచి 'క్షణికానంద'మనే కళా ఖండాన్ని సృష్టిస్తాడు శిల్పి" అంటాడు ఆస్కార్ వైల్డ్. ఆనంద విషాదాలు వైయక్తికం. సృజనానుభవాన్ని గురించి కవులు, కళాకారులు, లాక్షణికులు చిరకాలంగా చర్చిస్తూనే ఉన్నారు.

జీవితమంటేనే అనుభవం. ఆద్యంతాలు లేని కాలంలో ఓ క్షణం. మనం అంతగా గమనించని శారీరకానుభవమైనా, ఉద్వేగపరిచే బౌద్ధికానుభవమైనా అది మన ప్రతిస్పందన మాత్రమే అని అంగీకరించక తప్పదు. నిర్విరామంగా కలిగే ఈ స్పందనల్లో మనం గుర్తుంచుకో గలిగినవి బహు కొద్ది. ఈ స్పందన తీవ్రతను, మన చైతన్య స్థాయిని పెంచుతుంది కళ. ('జీవితమే ఒక కళ' అనటం బాగానే ఉంటుంది గాని, అది ఎందరికి అనుభవంలోకి వస్తుంది? )

జీవితమంతా ఏకానుభవంగా గాక, అందులోని వివిధ పార్శ్వాలను తన సృజనకు ఎంపిక చేసుకుంటాడు కళాకారుడు. కాని అనుభవానికి ఆకారం లేదు. మెరుపు క్షణంలో కను మరుగవుతుంది. చెవులున్న వాళ్ళందరూ సెలయేటి పాట వినలేరు. లోకానికి తనకు తోచిన రూపం, అర్థం కల్పిస్తాడు కళాకారుడు.

"కళను నిర్వచించేది రూపమే- ముడి సరుకుకు కల్పించిన ఒక నిర్దిష్ట పరిమితి. మనందరిలో కొంత జడత్వం ఉంటుంది. కళాస్వాదన కదలిక కలుగజేస్తుంది. అనుభవాలు జంతువులకు కూడా ఉంటాయి. శత్రువుల నుండి రక్షించుకుని, తన ఉనికిని భద్రం చేసుకునే క్రమంలోనే జీవికి గ్రహణ శక్తులు ఏర్పడ్డాయి. పరిణామ వాదాన్ని అంగీకరిస్తే యిదే నిజం" అంటాడు ఇర్విన్ ఎడ్మాన్. ఒక కళా తాత్వికుడు. అంటే వీటి ప్రధాన ప్రయోజనం ఆత్మరక్షణ మాత్రమే. కళా సృష్టి కాదు.

మొత్తం మీద దృశ్య, శ్రవణ శక్తుల వల్ల ఆవిర్భవించినన్ని కళలు రుచి, వాసన, స్పర్శల వల్ల రాలేదు. జీవన సమరం కోసం అవసరమైన సామర్థ్యాన్ని మనం వినోదం కోసం వాడుకుంటున్నాం. ఇదే నాగరికత. నిత్యానుభవంలో లేని తీవ్రత కళ ద్వారా పొందుతాం. హామ్లెట్ మనస్తత్వాన్ని గొప్పగా చిత్రించాడు షేక్స్పియర్ అని ఆశ్చర్యపడతాం. నిజానికి ఆ మనస్తత్వం అందర్లోనూ కొద్దో గొప్పో ఉంది. ప్రత్యేకమైన అనుభవాలను అస్తిత్వ జ్ఞానం నుండి వేరు చేసి మరో మనిషితో పంచుకోగలగటం మనిషికే సాధ్యం.

* * *

'అనుభవాన్ని ఆవిష్కరణగా చూసిన క్షణమే సృజన' అంటారు లాక్షణికులు. రోజూ

చేసే పనులు కూడా కొన్నిసార్లు కొత్తగా కనిపిస్తాయి. ఆవిష్కరణలో ఆశ్చర్యం ఉంటుంది. బహుశా అదే ప్రేరణ. మోనె (Monet-ఫ్రెంచి చిత్రకారుడు) బాల్యమంతా పొలాల్లోనే గడిచింది. అయినా ఒకనాడు అతడికి ఆ పచ్చదనం కొత్తగా కనిపించింది. ఇదివరకెన్నడూ వాటిని అలా చూడలేదు. ఆకుపచ్చలో అన్ని షేడ్స్ ఉంటాయని తెలియదు. పట్టలేని ఆనందం. ఒక కొత్త సత్యం ఆవిష్కృతమైంది.



సృజన గురించి మాట్లాడే వాళ్లందరూ చంటి పిల్లల్ని చూసి నేర్చుకొమ్మంటారు. ఏ వస్తువునైనా వాళ్లెంత దీక్షగా చూస్తారో! దాన్ని పట్టుకుంటారు. నోట్లో పెట్టుకుంటారు. కొడతారు. కింద పడవేస్తారు. అనుభవాన్ని గ్రహించే పద్ధతది. 'అంతర్దృష్టి (Intuition) దృష్టి ఫలితమే కళ' అంటాడు క్రోస్. వ్యక్తీకరించుకునే తనంలో ఈ అంతర్దృష్టి తన భాష (రంగుల భాష, సంగీతం వగైరా) తనే తయారు చేసుకుంటుంది.

కళాఖండాల్ని ఇంగ్లీషులో వర్క్ ఆఫ్ ఆర్ట్ అంటారు. రాయని భాస్కరులకు మొట్టికాయ వేసినట్టుగా, 'వర్క్'లోనే 'ఆర్ట్' ఉన్నదని అర్థం. ఆలోచన, నేర్పు, అనుభవం కలిసిందే కళారూపం. వచన రచయితలకు, ముఖ్యంగా నవలలు రాయాలనుకునే వాళ్లకు, 'శ్రమ' కొత్త కాదు. ప్రేరణ వస్తుంది. పోతుంది. ఐడియాలు కుప్పలు తెప్పలుగా తడుతూనే ఉంటాయి. కాని రాయటానికి కూర్చుంటే ఎప్పటికి తెమిలేను!

**'కథలతో సహా కళా రూపాలన్నింటినీ నిర్వచించేది చట్రం. అపరిమితమైన బాహిర ప్రపంచానికీ, కళాకారుడి సృష్టికీ మధ్య గీత అది. 'నిత్యానుభవం కన్న భిన్నమైనది కళ'**

**- ఇటాలో కాల్వినో**

జోసెఫ్ కోన్రాడ్ (అసలు పేరు: జోసెఫ్ థియోడర్ కోన్రాడ్ నాలెజ్ కోర్జీ నిమోవ్‌స్కీ) ఒక నౌకాదళ అధికారికి శిక్ష పడటం చూశాడు. సైనిక జీవితంలో అది గొప్ప అవమానం. హృదయం ద్రవించింది. ఆ తర్వాత రెండేళ్ళు రాత్రింబవళ్ళు పదాలు పేర్చుకుంటూ 'లార్డ్ జిం' రాశాడు.

– ముక్తవరం పార్థసారథి

(వచ్చే నెలలో మరిన్ని విశేషాలు) ✦

ప్రపంచ ప్రసిద్ధ నవలల
పరిచయ వేదిక

# కాలాతీతం

1862

# లె మిజరాబ్

“ఈ లోకంలో అన్యాయం, అక్రమం, పేదరికం, దోపిడీ ఉన్నంత కాలం, అలకాపురుల లోని కుబేరుల పక్కనే నరక కూపాలలో నరులు నివసించినంత కాలం, అజ్ఞానాంధ కారంలో మనుషులు దివాంధులులా కొట్టు మిట్టాడినంత కాలం ఇలాంటి పుస్తకాల అవసరం ఉంటుంది” ఇది హ్యూగో నవలకు రాసిన ఉపోద్ఘాతం.

బ్రెడ్ దొంగిలించినందుకు గాను పంథొమ్మిదేళ్ళు శిక్ష పడుతుంది జాం వాల్జీన్‌కు. జైలు నుండి పారిపోవటానికి అనేకసార్లు ప్రయత్నించినా ఫలితం ఉండదు. చివరికి విడుదలవుతాడు. అయినా సంఘం దృష్టిలో అతడు ఇంకా నేరస్థుడే. ఎవరూ ఆశ్రయమివ్వరు.

చివరికి ఒక సజ్జనుడు, బిషప్ మాన్ సైనర్ మిరియెల్ తన ఇంటికి ఆహ్వానిస్తాడు. అయితే వాల్జీన్‌ది వింత మనస్తత్వం. తనను ఆదరించిన ఆ గృహస్థు ఇంటిలోని వెండి వస్తువులను అపహరిస్తాడు. పోలీసులు అరెస్టు చేస్తే, బిషప్ అవన్నీ తనే స్వయంగా యిచ్చానని చెప్పి రక్షిస్తాడు. (చలంగారి రంగదాసు నాటకంలోని ఇతివృత్తం యిదే) వాల్జీన్ పశ్చాత్తాప పడతాడు. తన పేరు ఎమ్. మాడెలీన్‌గా మార్చుకుని మాంట్రీల్ నగరంలో కాస్ట్యూమ్ జ్యువెలరీ ఫ్యాక్టరీ స్థాపించి అనేక మందికి ఉపాధి కల్పిస్తాడు.

ఈ సందర్భంలో ఫ్రాన్సులోని పేదరికాన్ని గణాంక వివరాలతో చిత్రిస్తాడు హ్యూగో.



విక్టర్ హ్యూగో

సమాజంలోని దారిద్ర్యాన్ని ప్రతిబింబిస్తూ ఓ కొత్త స్త్రీ పాత్ర ప్రవేశిస్తుంది. ఆమె పేరు ఫాంటైన్. అమాయకురాలు. ఒక పిల్లకు తల్లి. ఆ పిల్లకు తండ్రి ఎవరో తెలియదు. ఉద్యోగం కోసం మాంట్రీల్‌కు ప్రయాణమవుతుంది. దారిలో ఒక సత్రం కనిపిస్తుంది. దాని యజమాని తెనార్డ్. పిసినారి. అతడి భార్య ఇంకా ఎక్కువ పిసినారి. పిల్లనెత్తుకుని పని చెయ్యలేదు గనక తన కూతుర్ని సాకితే కొంత డబ్బు ఇస్తానని చెప్పి వాళ్ళ కప్పజెబుతుంది ఫాంటైన్.

ఫాంటైన్‌కు మాడలీన్ ఫ్యాక్టరీలో ఉద్యోగం దొరుకుతుంది. కూతురి కోసం పొదుపు చెయ్యాలనుకుంటుంది. తను కూడా సమాజంలో గౌరవ మర్యాదలు సంపాదించుకోవాలి. కాని యివన్నీ పగటికలలు గానే మిగిలిపోతాయి. ఉద్యోగం పూడుతుంది. తెనార్డ్ నుండి డబ్బులకోసం డిమాండ్ పెరుగుతుంది. గత్యంతరం లేక ఫాంటైన్ వ్యభిచార కూపంలో కూరుకుపోతుంది. ఇన్‌స్పెక్టర్ జావెర్ట్ ఆమెను అరెస్టు చేస్తాడు. మాడెలీన్ జోక్యంతో శిక్ష తప్పుతుంది. కాని అనారోగ్యం పాలవుతుంది. రోగాలతో ఒళ్లు పుచ్చిపోతుంది. కూతురు కాసెట్ భవిష్యత్తును గురించిన బెంగ పట్టుకుంటుంది. దేవుడిలా మాడెలైన్ ప్రత్యక్షమై పిల్లను పెంచి పెద్దదాన్ని చేస్తానని అభయమిస్తాడు.

మాడెలైన్ ఘరానా వ్యక్తి. ఆ వూరికి మేయర్‌గా ఎన్నికయ్యాడు. ఒకనాడు అనూహ్యంగా కొత్త సమస్యలు వస్తాయి. ‘జాం

వాల్జీన్' అనబడే నేర స్తుణ్ణి అరెస్టు చేస్తారు పోలీసులు. అంటే ఎక్కడో పొరబాటు జరిగింది. తనకు బదులు అమాయకుణ్ణి శిక్షిస్తారన్నమాట. అరాస్‌లోని కోర్టు కెళ్లి ఆ నిరపరాధిని వదలమని ప్రార్థిస్తాడు మాడెలైన్. తనే అసలైన జాంవాల్జీన్ అని జడ్జి ముందర అంగీకరిస్తాడు. ఇన్‌స్పెక్టర్ జావెర్ట్ అతణ్ణి అరెస్టు చేస్తాడు. ఈ షాక్ తట్టుకోలేక ఫాంటైన్ గుండె పగిలి మరణిస్తుంది. వాల్జీన్‌కు బందిఖానా కొత్త కాదు. తప్పించుకోవటానికి మళ్లీ ప్రయత్నిస్తాడు. ఒకసారి ఒక నావికుడు మునిగిపోతుంటే ప్రాణాలకొడ్డి రక్షించినట్టుగా నటిస్తాడు. ఆ ప్రయత్నంలో వాల్జీన్ జలసమాధి అయ్యాడనుకుంటారందరూ. నిజానికి అది తప్పించుకోవటానికి వేసిన ఎత్తు.

తెనార్డ్ దంపతులు కూడా పేదవాళ్లే. కానీ జలగలు. ఫాంటైన్ కూతురు కాసెట్ వాళ్ల రక్షణలో ఉంటుంది. ఆ పిల్ల మీద ఖర్చు పెట్టిందంతా వడ్డీతో సహా చెల్లిస్తే గాని వదలరు. ఫాంటైన్‌కు ఇచ్చిన వాగ్దానం నిలబెట్టుకోవటానికి వాల్జీన్ వాళ్లు అడిగినంత డబ్బిచ్చి కాసెట్‌ను తీసుకుని పారిస్‌కు వెళతాడు.

వాల్జీన్‌కు అప్పటిదాకా ప్రేమంటే ఏమిటో తెలియదు. ఊహ తెలిసినప్పటి నుండీ ఒంటరి జీవితం. ఈ చిన్నపిల్లను తన రక్షణలోకి తీసుకున్నప్పుడు హృదయం స్పందించింది. మరో మనిషిని ఆదుకోవటంలో ఇంత ఆనందం ఉంటుందా? కాని ఇద్దరి మధ్యా పూరించలేని అఖాతం. తనకు యాభై అయిదు. కాసెట్‌కు ఎనిమిదేళ్లు. జీవిత చరమాకంలోనైనా ఒక వెలుగురేఖ కనిపించిందంటే అదంతా బిషప్‌గారి కరుణా ప్రసాదం.

వాల్జీన్ ఆ పిల్లకు విద్యాబుద్ధులు నేర్పించాడు. తను జైల్లో నేర్చుకున్న చదువు ఇలా ఉపయోగపడింది. సొసైటీ లేడికి అవసరమైన దుస్తులూ, అలంకారాలు అమర్చాడు. తన దగ్గర ఉన్న చివరి ఫ్రాంకు కూడా

**న**వలలోని ప్రతి సందర్భంలోనూ రచయిత పేదరికాన్ని గురించే చర్చిస్తాడు.

అప్పుడప్పుడే ఆవిర్భవిస్తున్న పెట్టుబడిదారీ వ్యవస్థ స్వభావాన్ని అధ్యయనం చేసిన విక్టర్‌హ్యూగో, ఈ సమాజంలోని సమస్యలన్నింటికీ మూలం డబ్బే అనే నిర్ధారణకు వచ్చాడు. "పేదవాళ్లకే ఎందుకిన్ని కష్టాలు? వాళ్ల బతుకులింత నికృష్టంగా ఎందుకున్నాయి? ఎందుకింత మిజరీ? ఈ 'మిజరబుల్' జనజీవితం బాగుపడేదెప్పుడు?" విక్టర్ హ్యూగో నూటయాభై ఏళ్లక్రితం లేవనెత్తిన ఈ ప్రశ్నకు ఇప్పటికీ సమాధానం లేదు. పేదవాళ్లు నేరాలు చేస్తారనటం సబబు కాదు. అసలు నేరప్రవృత్తి సంపన్నుల జీవిత పద్ధతిలోనే ఉంది. ఆ మేడలు, మిద్దెలు, విలాస హర్మ్యాలు ఎన్ని నేరాల ఫలితమో! తోడేళ్ల నుండి రక్షించుకునే క్రమంలో చిన్న జంతువులు చేసే ప్రయత్నం నేరమవుతుందా? ప్రభుత్వం దోచుకుంటుంది. ధనవంతులు దోచుకుంటారు. తోటి మనుషులు దోచుకుంటారు. పేదలకు బతుకంతా దోపిడీయే అంటూ ఆక్రోశిస్తాడు హ్యూగో.



కాసెట్ కోసమే ఖర్చుపెట్టాడు. నగరం వెలుపల గార్బ్యూ హౌజ్ అనబడే పాడుపడిన ఇంట్లో ఉన్న వాల్జీన్ పోలీసుల కంటబడతాడు. జావెర్ట్ అతణ్ణి అరెస్టు చెయ్యటానికి సిబ్బందితో వస్తాడు. చివరి క్షణంలో వాల్జీన్ తప్పించుకుంటాడు. అతడి సహాయం పొందిన వాళ్లెవరూ కూడా అతడికి సహాయం చెయ్యరు. చివరికి ఒక కాన్వెంట్‌లో ఆశ్రయం

పొందుతాడు. అక్కడి తోటమాలిని ఒకప్పుడు వాల్జీన్ రక్షించాడు. ఇప్పుడు అతడి సహాయకుడిగా ఉద్యోగం సంపాదిస్తాడు. కాని కాసెట్‌ను విడిచి ఉండలేక, ఆమెను కూడా అక్కడే చేరుస్తాడు.

అప్పుడు మరో పాత్ర ప్రవేశిస్తుంది. పేరు మారియస్. పదిహేడేళ్లు. రాజభక్తుడైన తాత పోషణలో బతుకుతుంటాడు. తండ్రి జార్జెస్ పొంట్‌మెర్సీ. ఆ వృద్ధుడికి మనవడంటే ప్రాణం. కొడుకు పట్ల కోపం. పొంట్‌మెర్సీ తన కొడుకు మీద హక్కు వదులుకుంటే కాని ఆస్తి దక్కదు. ఈ బాధతో అతడు మరణి

## విక్టర్ హ్యూగో (1802-1885)

విక్టర్ హ్యూగో ఫ్రాన్స్‌లోని తూర్పు ప్రాంత నగరం బెసాంకన్‌లో జన్మించాడు. తండ్రి నెపోలియన్ సైన్యంలో జనరల్‌గా పనిచేశాడు. ఆ తరువాత స్పెయిన్ రాజధాని మాడ్రిడ్‌కు గవర్నర్‌గా నియమితుడయ్యాడు. నెపోలియన్ ఓటమి, పతనం తర్వాత తండ్రి మరణించాడు. తల్లికి వచ్చిన పెన్షన్‌తో విక్టర్ పారిస్‌లో సెటిలయ్యాడు. 1821లో ఆమె కూడా కన్ను మూసింది. ఆదాయం లేదు. నిరుపేద జీవితం ఎలా ఉంటుందో తెలిసి వచ్చింది. అయితే అప్పటికే సాహిత్యంలో కొంత కృషి చేశాడు. సాంప్రదాయకమైన కవిత్వం రాసి పండితులను మెప్పించాడు. రాజభక్తికి అధికారులు సంతోషించారు. 18వ లూయీ చక్రవర్తి వెయ్యి ఫ్రాంకుల పెన్షన్ కూడా మంజూరు చేశాడు. ఇరవై మూడేళ్ల విక్టర్ హ్యూగోకు 'షెవాలియె ఆఫ్ ది లీజిన్ ఆఫ్ ఆనర్' సత్కారం కూడా లభించింది.

యువకవి అభిప్రాయాల్లో క్రమంగా మార్పు వచ్చింది. రాజరిక ప్రశంసలకు బదులు రిపబ్లికన్ (ప్రజాస్వామ్య) భావనలు ఆకర్షించాయి. అతడి 'క్రామ్వెల్,' 'హెర్నాని' నాటకాలు మారుతున్న రాజకీయ పరిస్థితుల్ని ప్రతిబింబించాయి. తన వైపుకు తిప్పుకునే ప్రయత్నంలో లూయీ ఫిలిఫ్ చక్రవర్తి, హ్యూగోను 1841లో హౌజ్ ఆఫ్ పేర్స్‌కు ఎంపిక చేశాడు. కాని ఈ గౌరవాన్ని కూడా తన అభిప్రాయాలు ప్రచారం చెయ్యటానికే వాడుకున్నాడు హ్యూగో.

1848 నాటి విప్లవంతో ఫ్రెంచ్ రాజకీయ వ్యవస్థ తలకిందులైంది. బ్రసెల్స్‌లో తల దాచుకుని ప్రభుత్వ వ్యతిరేక ప్రకటనలు చేశాడు. ఫలితంగా దేశ బహిష్కార శిక్ష విధించారు. అటునుండి జెర్సీ (ద్వీపం) జెర్న్సీలలో ఆశ్రయం తీసుకోక తప్పలేదు. 1831లో వెలువడిన హ్యూగో నవల 'నాట్రీడామ్ డి పారిస్' ఫ్రెంచి సాహిత్యంలో రొమాంటిక్ ధోరణికి శ్రీకారం చుట్టింది. 1866 నాటి మరో పెద్ద నవల 'టాయిలర్స్



ఆఫ్ ది సీ'కి కూడా ప్రపంచ సాహిత్యంలో శాశ్వత స్థానముంది. రాజరిక వ్యతిరేక ఉద్యమకారుడిగా అతడు అనేక కష్టాలననుభవించాడు. 'ది ఛాస్టైజ్‌మెంట్స్' అన్న కవితా సంకలనం ప్రచురించి అధికార వర్గానికి శత్రువుగా మారాడు. 1870లో ఫ్రాన్స్ రిపబ్లిక్‌గా ప్రకటించబడిన తర్వాత స్వదేశానికి తిరిగి వచ్చాడు హ్యూగో. 'సోషలిజం' లక్ష్యంగా అనేక రచనలు చేశాడు.

ప్రవాసంలో ఉన్నప్పుడు 1862లో వెలువడిన నవల 'లె మిజరాబ్' (les miserables) ఒకేసారి ఎనిమిది నగరాల్లో ప్రచురించబడింది. రచయితకు అశేషమైన ఖ్యాతీ, నాలుగు లక్షల ఫ్రాంకులూ సంపాదించి పెట్టింది. పదేళ్లపాటు ఫ్రాన్సు రాజకీయ, సాంఘిక, ఆర్థిక పరిస్థితుల్ని, వర్గ సంబంధాలను అధ్యయనం చేసి, తన పరిశోధనా ఫలితాన్ని ఒక రొమాంటిక్ మేలో డ్రమటిక్ కథా రూపంగా మలిచాడు హ్యూగో.

స్తాడు. తండ్రి తనను గాఢంగా ప్రేమించాడని తెలుసుకుని బాధతో యింట్లోంచి వెళ్లిపోతాడు మారియస్. ఒక విప్లవ సంస్థలో చేరతాడు. ఆర్థిక సమస్యలు తీవ్రతరమవుతాయి.

ఒకనాడు లక్సెంబర్గ్ గార్డెన్స్‌లో ఓ యువతి అతణ్నాకర్షిస్తుంది. ఆమె కాసెట్. అతణ్ణి చూసి భయపడి తన అడ్రసు మార్చుకుని ఎటో వెళ్లిపోతుంది.

మారియస్ పొరుగువాళ్లు నిరుపేదలు. వాళ్లకు సహాయం చెయ్యటానికి ఎమ్.లెబ్లాంక్ అనే ఓ అపరిచితుడూ (ఈసారి వాల్జీన్ లెబ్లాంక్‌గా పేరు మార్చుకున్నాడు.) అతడి కూతురూ వస్తారు. ఆ అమ్మాయి కాసెట్. ఇదే అదనుగా పొరుగువాళ్లు వలపన్ని లెబ్లాంక్ దగ్గర డబ్బు లాగాలని చూస్తారు. మారియస్ పోలీసులకు కబురందిస్తాడు. జావెర్ట్ వస్తాడు.

ఆ పొరుగువాళ్లు తెనార్డ్ దంపతులని తరువాత తెలుసుకుంటాడు మారియస్. పోలీసుల రాకతో లెబ్లాంక్ పారిపోతాడు. మరికొన్నాళ్లకు కాసెట్‌తో తన ప్రేమ ప్రకటిస్తాడు మారియస్. ఆ పిల్లను తన నుండి దూరం చేసే వాళ్లంటే వాల్జీన్‌కు జెలసీ.

పారిస్‌లో రాజకీయ వాతావరణం వేడెక్కుతుంది. అలజడి, తిరుగుబాట్లు, అధికారులు, సంపన్నుల మీద దాడులు ప్రారంభమౌతాయి. కాసెట్‌ను తీసుకుని ఇంగ్లాండ్ పారిపోతాడు వాల్జీన్.

విప్లవం ప్రారంభమౌతుంది. తొలి దశలో పారిస్ నగరం నిండా బారికేడ్లు నిర్మిస్తారు. అయితే విప్లవకారుల్లోనూ కొందరు ద్రోహులుంటారు. అలాంటి ఒక కోవర్ట్ ఇన్‌స్పెక్టర్ జావెర్ట్. విప్లవకారులల్లో తానూ ఒకడైనట్లు నటిస్తాడు. విప్లవంలో పాల్గొనటం ద్వారా నిష్కృతి పొందాలనుకుంటాడు మారియస్. పోరాటం తీవ్రతరమవుతుంది. వాల్జీన్ కూడా విప్లవకారులతో జత గడతాడు. అతడికి మారియస్, కాసెట్‌ల ప్రేమ గురించి తెలుస్తుంది. ఆ పిల్ల కోసమైనా మారియస్‌ను రక్షించాలనుకుంటాడు. విప్లవకారులకు పట్టుబడ్డ జావెర్ట్‌కు వారు మరణశిక్ష విధిస్తారు. దాన్ని అమలు పరచవలసిన బాధ్యత వాల్జీన్‌కు అప్పగిస్తారు. కాని జావెర్ట్ ప్రాణం రక్షించి, పారిపోవటానికి సహాయం చేస్తాడు వాల్జీన్. అదే సమయంలో క్షతగాత్రుడైన మారియస్‌ను చేరదీస్తాడు. యుద్ధక్రమంలో తనకు ప్రాణభయం ఉందనుకున్నప్పుడు మాన్‌హోల్స్‌లో దిగి మురికి గొట్టాల గుండా పయనించి ఆత్మరక్షణ చేసుకుంటాడు. చివరికి జావెర్ట్ మళ్లీ అతణ్ణి అరెస్టు చేస్తాడు. కాని విధి నిర్వహణలో తప్పులు చేశానని తెలుసుకుని జావెర్ట్ ఆత్మహత్య చేసుకుంటాడు.

మారియస్‌ను ఒప్పించి, అతడి తాత వద్దకు తీసికెడతాడు వాల్జీన్. మారియస్‌కు గాయాలు నయమవుతాయి. అతడి తాత మనవడి పెళ్లికి అంగీకరిస్తాడు. కాని కాసెట్ తనకు దూరం కావటం భరించలేడు వాల్జీన్. తన గతం గురించి చెబుతాడు. తన ప్రాణం రక్షించింది అతడేనని మారియస్‌కు తెలియదు. ఇటువంటి 'మిజరబుల్' వ్యక్తితో సంబంధం పెట్టుకోవద్దని కాసెట్‌ను ఒప్పిస్తాడు. పెళ్లికి ముందర మారియస్‌కు తెనార్డ్ ద్వారా తన ప్రాణదాత వాల్జీన్ తెలిసి పశ్చాత్తాపపడతాడు. కాని అప్పటికే వాల్జీన్ మరణశయ్య మీదుంటాడు. తమ జీవితాలలో వెలుగు నింపిన ఆ మహానీయుణ్ణి చూసి కన్నీరు మున్నీరుగా విలపిస్తారు. అదే వాళ్ల శ్రద్ధాంజలి.

'లె మిజరాబ్' చాలా పెద్ద నవల. ఇప్పుడు చదవటం కష్టమే. కొన్నిచోట్ల ఒక నామవాచకానికి పదిహేను, పదహారు విశేషణాలు కూడా ఉపయోగిస్తాడు రచయిత. అయితే ఈ 'క్లాసిక్' నవలకు అనేక సంక్షిప్తీకరణలు లభ్యమవుతున్నాయి. మూల కథలోని విసుగెత్తించే లక్షణం వీటిలో ఉండదు. ఆధునిక నవల లాగ చదువుకోవచ్చు.

–ఎం. వసంత

వాన చినుకు కోసం ఎదురు చూస్తూ
నిరాశగా నిట్టూర్చే కళ్ళు...
విత్తనాల కొనుగోలు కోసం చేసిన అప్పును
తలచుకొని ఆక్రందించి వ్రయ్యలైన హృదయం...
రేయింబగళ్ళు రెక్కలు ముక్కలు చేసుకున్నా
తిండి గింజలకూ కరువు రాగా
ఋణదాత కన్పిస్తాడేమోనని ఎదురుచూపు...
ఏ ప్రభుత్వమో, సహకార సంఘమో
ఆదుకుంటుందేమోననే ఆశ...
పెళ్ళయిన కూతురు అత్తింటి
పాత బాకీ చెల్లించమని అభ్యర్థన...
పెళ్ళికాని కూతురుకు వరాన్వేషణ...
ఎదిగిన కొడుకుకు ఉద్యోగం కావాలి!
అతడో ఇంటివాడు కావాలి...
అప్పులన్నీ తీరాలి! పంటలు దండిగా పండాలి!
ఇవన్నీ ఎప్పుడు నెరవేరేను?
అసలు నెరవేరేనా... నెరవేరకుంటే...
ఇక రైతుకు ఆత్మహత్యే శరణ్యమా? దీనికి
సమాధానంగా సగటు రైతుల సాధక
బాధకాలకు రాయలసీమ మాండలికంలో
అక్షర రూపం కల్పించిన
సుంకోజి దేవేంద్రాచారి నవల
**నీరు నేల మనిషి**
ఈ నెల 'చతుర' సమర్పణ





# నీరు నేల మనిషి

— సుంకోజి దేవేంద్రాచారి

"మొత్తం రెండు లక్షలా ముప్పై వేలు" అని రాసుకున్న అప్పుల లెక్కలు పైకి వినబడేట్టుగా చదువుకుని నిట్టూర్చాడు రామచంద్ర.

ఆ రోజు జనవరి ఒకటి.

ప్రతి సంవత్సరం జనవరి ఒకటిన కొత్త పాకెట్ క్యాలెండర్ లోకి, పాత క్యాలెండర్ లోని బాకీల లెక్కలన్నీ రాసిపెట్టుకోవడం రామచంద్ర అలవాటు.

లెక్కలో తప్పేమన్నా ఉందేమో అని మళ్లీ ఒకసారి కూడాడు.

అంతే వచ్చింది. 'అసలే' యింత ఉంటే వడ్డీ ఎంతుంటుంది? అనుకున్నాడు.

'మూడు రూపాయల వడ్డీయి, రెండున్నర రూపాయల వడ్డీయి ఉండాయి. కొందరిక యితే రెండు సంవత్సరాల నుంచీ వడ్డీ కూడా కట్టలేదు. ఎంత లేదన్నా డెబ్బై వేలన్నా వడ్డీ ఉంటాది. అసలు వడ్డీ కలిపి మూడు లక్షలు' అనుకోగానే ఒక్క క్షణం రామచంద్ర గుండె కొట్టుకోవడం ఆగినట్టనిపించింది.

'బేంకోల్లు అరస్తాండారు'

బంగారు నగలయి నోటీసులు వస్తాండాయి- యాలం వేస్తామని

సొసైటీ బేంకోల్లు జీపు లేసుకోని వస్తాండారు. యింట్లో టీయి ఎత్తుకోని పోతామని సుధాకర్ నాయుడు గొంతుమీద కూర్చోనుండాడు. కూతురు పెండ్లి చేయాలని చంద్రారెడ్డి పీలేరులో యింటి జాగా కొన్నేడంట. దుడ్డడగతాండాడు.

'నన్నేసాబ్ దుడ్డు యిచ్చిన దినంనించే అడగతాండాడు. ఏమి చేసేదిరా సామీ ఈళ్ళందరికీ' అనుకున్నాడు దిగులుగా.

గదంతా కలయజూశాడు.

వేరుశనగ కాయలు ఇరవై బస్తాల్లో ఉండాయి. ఐదెకరాల దిగుబడి అది.

ఎకరా నేలలో వరి నాటారు. వారం రోజుల్లో కోతలుండాయి.

వాటికి పెట్టిన ఖర్చు తలచుకోగానే రామచంద్ర వంట్లో వణుకు ప్రారంభమయింది.

ఐదేండ్లుగా పంట వేసిన ప్రతిసారీ నష్టమే వస్తాంటే ఎట్ల కడతేరేది అనుకున్నాడు.

'ఈసారన్నా పంటలు బాగొచ్చి అప్పులు తీరేటిగా చూడు 'ఏడు కొండల సామీ' అనుకుని క్యాలెండర్ మడచి జేబులో పెట్టుకున్నాడు. కళ్ళు మూసుకుని కుర్చీలో వెనక్కివాలి కూర్చున్నాడు.

బోరులో నీళ్లయి పోయినాయి. ఎట్లనో, రెండు వారాల ముందయిపోలా. వారమే అయింది. లేకుంటేనా వడ్లన్నీ జొల్లు పొయ్యిండు. యిప్పుడు గూడా బియ్యం నూక లయితాయేమో... ఏయో ఒకటిలే. తిండికి జరగతాంటే మిగతాయన్నీ ఎట్లోగట్లా చేయొచ్చు తిండికి జరగతాంటే చాలా...? అప్పులు తీరేది ఎట్ల...? పంటలు పండితే అప్పులెంత? పంటలు ఎట్ల పండతాయి? నీళ్ళుంటే బంగారు పంటే గదా. తన తాతలు, నాయన గింజకు గింజ కలిపి ఆస్తిని పెంచి నారు. వాళ్లెవరూ సెంటు భూమి కూడా పోగొట్టలా. నీళ్లుండద్దూ. మళ్ళీ బోరేస్తే... దానెమ్మా ఈసారి వెయ్యడుగుల లోతయినా సరే... బోరెయ్యాల్సిందే. నేలంతా సాగు చెయ్యాల్సిందే.

"బో... ఏంబా... ఆట్నుంచి రావా. ఏం చేస్తాండావాడ...? " హాలులో ఉన్న రోటిలో శీకాయలు నూరుతూ కేకేసింది రామచంద్ర భార్య రమణమ్మ.

యిప్పుడింగ వైశాఖం. మళ్ళా నడికారు. వైశాఖిలో ఎకరాకు ముప్పై మోటలు అయితాయి వడ్లు. నడి కారులో నలభై అయితాయి. మూడెకరాల్లో పంట బెట్టినా, మోటకు ఐదు నూర్లయినా, మూడెకరాలకు కలిపి రెండు కార్లకు లక్ష పైనే వస్తాది. అయినా అప్పంతా తీరదే. బోర్లో ఐదించిల నీళ్ళు పడతాయిలే. ఐదించిల నీళ్ళు పడితే ఐదెకరాలు సాగవుతాది.

"ఏందమ్మా ఈ మనిషి పద్దన్నే యింట్లో దూరుకోని పండగపూట నీళ్ళు గూడా పోసుకోకుంటే ఎట్లా? " అంది రమణమ్మ.

ఐదెకరాలు సాగయితే యింగో లక్షయినా మిగల్తాది. అప్పులు సగానికి సగం తెగ్గొట్టే యచ్చు మిగిలింది ఎంతుంటాదిలే. మల్ల వచ్చే సమచ్చరానికి తీర్చేస్తాం. అప్పులు తీర తానే కూతురుకు, కొడుక్కి పెండ్లి జేయాల. పెద్దమ్మ మొన్న దీపావళికి గూడా రాలా. పిలిస్తే గదా వచ్చేదానికి. ఎట్ల పిల్చేది. యింట్లో రూపాయి దుడ్డుంటే గదా! పిల్చి నాంక గుడ్డలు పెట్టి పంపించద్దా. సంకురాత్రి కన్నా పిల్లంపాలి.

"మ్మేయ్ శారదా. మీ నాయన్ను రమ్మని చెప్పు. వడ్ల రూంలో దూరుకోనుండాడు" అంది నీళ్ళ బిందెతో వచ్చిన కూతురితో రమణమ్మ.

తొట్టిలో నీళ్ళు కుమ్మరించి, బిందెను గడప దగ్గర పెట్టి లోపలికి వచ్చి "నాయనా... అమ్మ పిలస్తాంది రా..."అంది శారద గట్టిగా.

ఉలికి పాటుగా చూశాడు రామచంద్ర కూతురి వైపు. "ఆc... ఆc... వస్తాండా" అంటూ ఒడిలో ఉండే పైపంచె తీసుకుని భుజం మీద వేసుకుని హాల్లోకొచ్చినాడు.

ఆరడుగుల పొడవుంటాడు. చామన ఛాయ. బక్క పలచగా ఉన్నాడు. కాయ కష్టం చేసే శరీరం. వయసు యాభై ఐదు సంవత్సరాలు. వరుస కరువుతో వార్ధక్యం ముందుగానే ముంచుకొచ్చింది. పైకి తిప్పిన మీసాలు. నెత్తిన జుట్టు సగం రాలిపోయింది. ఉండే దాంట్లో సగానికి పైగా తెల్ల రంగుకు మారిపోయింది.

గాఢా గుడ్డతో కుట్టిన బనీను జేబిలోనించి బీడీని తీసి వెలిగించుకుంటా "ఏందే నీ నస... ఒకటే మోపన వదరతాండావే" అన్నాడు రామచంద్ర.

"ఆc... నా మాటలెప్పుడూ నసేలే. పండగ పూట పద్దన్నే నీళ్ళు పోసుకోని టెంకాయ కొడదామని లేకుండా రూంలో దూరుకోనుండావే" శీకాయ ముద్దను తీసి తట్టలో పెట్టి, నీళ్ళు గిన్నెలోకి తోడుతూ అంది రమణమ్మ.

నోటి నిండుకూ పొగ పీల్చి ముక్కుల్లోంచి, నోటిలోంచి పొగ వదిలి "పండగేం పండగే" అన్నాడు ఏమీ తెలీనట్టుగా.

"జనవరి పండగ కదా. ఒగసారి ఊదిలోకి పోయి చూడు. అందురూ మొబ్బుతోనే నీళ్ళు

## రచయిత పరిచయం

సుంకోజి దేవేంద్రాచారి విద్యార్హతలు తక్కువే అయినా సాహితీ రంగంలో చక్కటి ప్రతిభ కనబరుస్తున్నారు. ఇప్పటిదాకా ముప్పై అయిదు కథలు, రెండు నవలలు, అనేక కవితలు రాశారు. గ్రామీణ క్రీడలపై 28 కథనాలు వెలువరించారు. ఈ కథనాలు 'మా మంచి ఆటలు' పేరిట త్వరలో పుస్తక రూపంలో రానున్నాయి. కథలను కూడా 'అన్నంగుడ్డ' పేరిట సంపుటంగా వెలువరించనున్నారు. 2004లో ఆటా, 2005లో తానాల నుంచి రెండు నవలలకు బహుమతులందుకున్నారు. రాష్ట్రస్థాయి పోటీల్లో ఐదు కవితలకు, జాతీయ స్థాయి పోటీల్లో ఒక కవితకు బహుమతులు లభించాయి. 1998 నుంచి అనేక పత్రికలు నిర్వహించిన కథల పోటీల్లో దేవేంద్రాచారి పలు కథలకు బహుమతులందుకున్నారు. రాష్ట్ర యువజన సర్వీసుల శాఖ నుంచి 2005లో ఉత్తమ యువ రచయిత అవార్డు అందుకున్నారు.

చిరునామా:
**సుంకోజి దేవేంద్రాచారి**
కేరాఫ్ ఎ.నాగరాజరెడ్డి
6-6, మేడపైన, సాయినగర్,
తిరుచానూరు పోస్టు, తిరుపతి.



పోసుకోని కొత్త గుడ్డలేసుకోని దేవళం కాడికి పోతాండారు. నువ్వూ పదా నీళ్ళు పోసుకుందువు. వాడూ, ఆయమ్మ యిద్దరూ షాంపూతో తలకు పోసుకునేసినారు. మనమిద్దరమే ఉండేదింగ. అందుకే శీకాయ నూరినా. జలజాట్లోకి పా, నీళ్లు తెస్తా" అంటూ వంట గదిలోకి వెళ్ళింది రమణమ్మ.

రమణమ్మ ఐదడుగులకు మించి ఒక్క అంగుళం కూడా వుండదు. మంచి తెలుపు నలభై ఐదేళ్ళకు అటూయిటుగా వుంటుంది. అంత పొడవూ పొట్టీ వుండే ఆ యిద్దరికీ ఎలా జోడీ కుదిరిందో అని ఆశ్చర్యపోతుంటారందరూ. పధ్నాలుగేళ్ళకే పెళ్ళయి వెంట వెంటనే ముగ్గురు బిడ్డలు పుట్టినా ఆమె ఇంకా చలాకీగానే పనులు చేసుకుంటోంది. భర్తతో సమానంగా సేద్యం పనులూ చేస్తోంది.

బీడీ తాగుతూ యింటి ముందుకు వచ్చాడు రామచంద్ర. గుమ్మానికి కట్టిన మామిడాకుల తోరణాన్ని చూసి "ఓరి ఓరి ఓరి" అనుకున్నాడు.

మబ్బులు కమ్ముకోనుండాయి. పొద్దు కన్పించడం లేదు. ఒంగి లోపల హాల్లో వుండే గోడ గడియారం వైపు చూశాడు. స్పష్టంగా కన్పించలేదది.



ఒకసారి మడి కాడికి పొయ్యొస్తే బాగుండు అనుకున్నాడు.

"ఏంబా... జలజాట్లో నీళ్ళు పోసినా. శీకాయ అన్నే పెట్టిండా. ఆ నీళ్ళు చల్లారు దాకా పోవా పోసుకునే దానికి" అంది రమణమ్మ.

"పండ్లు తోమలేదే యింగా..."

"నువ్వు తోముకో. నేను పోసుకోనొస్తా. లేదంటే నీళ్ళు చల్లగా అయిపోతాయి" అంటా ఆమె బ్రష్‌కు పేస్ట్ వేసి తీసుకొచ్చి భర్తకు యిచ్చింది. తను స్నానం చేయడానికి బట్టలు తీసుకుని స్నానాల గదిలోకి వెళ్ళింది.

ఎవరివో రెండు లేగదూడలు ఒక దాని వెనక ఒకటి పరుగులు తీస్తాండాయి. యింటి ముందు పిల్లల కోడిని పుంజు తరుముకుంటాంది. కోడి పిల్లలంతా తలలు పైకెత్తి భయం భయంగా అరుస్తాండాయి. కొత్త బట్టలు వేసుకోనుండే పిల్లలు వీధుల్లో ఆ చివరకు, ఈ చివరకు పరుగులు తీస్తాండారు.

రామచంద్ర బ్రష్‌తో పళ్ళు తోముకోసాగాడు.

"అన్నా... వానేమన్నా వస్తాదా" పలకరించాడు పక్కింటి శివరాం.

"ఏమోప్పా శివరాం. మొత్తం మోడాలు, మొయిళ్ళు కమ్ముకోనుండాయి. వాన వచ్చినా వస్తాదేమో. ఆడాడ కొంచెం పంట చేతికొచ్చేటిగా వుండాది గదా. గొలకలన్నీ రాలి పోవద్దా" అన్నాడు రామచంద్ర.

"ఔన్నా... మీరు సగం మడన్నా కోసేసినారు. మేమింగా మొదులే పెట్టలేదే. యింగా వారం వుండాలంటాండాడు మా అన్న" అన్నాడు శివరాం.

"గింజ ముదరకపోతే వున్నీలే..."

"ఏంబా, పళ్ళు తోమేది యింగా కాలేదా? నీళ్ళు మసలకాగినాయి. వచ్చి పోసుకో. పిల్లోళ్ళు దేవళం కాడికి పోవాలంటారు" అరచింది రమణమ్మ

రామచంద్ర స్నానాల గదిలోకి వెళ్ళాడు. ఇరవై అంకణాల మిద్దెయిల్లు ఎడమవైపు పొడవుకు మూడంకణాలను రెండు గదులుగా

చేసి మొదటిదాన్ని వంటకు, రెండవదాన్ని సామాన్లు పెట్టుకోవడానికి వాడుతున్నారు. తొమ్మిది అంకణాల హాలు నాలుగు నాలుగు అంకణాలతో రెండు గదులు. వాటిల్లో ఒకటి దేవుని గది, మరొకటి ధాన్యపు గది. హాలుకు తూర్పువైపు రెండు ద్వారాలున్నాయి. హాలు లోనించి మిగిలిన అన్ని గదులకు ద్వారాలు ఏర్పాటు చేశారు. హాలు మధ్యలో ఫేను సీలింగ్‌కు బిగించారు. యింటి ముందు అంకణం వెడల్పుతో పొడవుకూ సిమెంట్ రేకులు వేసిన వరండా. ఆ యిల్లు రామచంద్ర నాన్నగారి హయాంలో కట్టింది. యింటి ముందు వరండాకున్న పందిరి తీసేసి, రేకులు వేయించడం ఒక్కటే రామచంద్ర చేసింది.

అది కామిరెడ్డిగారి పల్లె. ఆ పల్లెలో మొత్తం అరవైకి మించిలేవు యిండ్లు కమ్మ, కాపు, కంసాలి, మాదిగ కులాలున్నాయి. ముస్లిం కుటుంబాలు కూడా పదున్నాయి. పల్లెకు మూడు ఫర్లాంగుల దూరంలో మాలవాడ వుంది. పల్లె చుట్టూ ఆకాశాన్నంటుతున్నట్టున్న చింతచెట్లు జడలు విరబోసుకున్నట్టుంటాయి. రాములవారి గుడి వుంది. గదికి పది బారల దూరంలో వెనక పీర్లచావిడి వుంది. గుడికి, చావిడికి మధ్యలో రామచంద్ర యిల్లుంది. యింటికి ఎదురుగా నాలుగంకణాల పశువుల కొట్టం. ఒకప్పుడు అక్కడ పశువులు ఎక్కువగా వున్నందుకు గుర్తుగా లోపల గోడకు సుట్టకారం మోర వెడల్పుతో మోర ఎత్తుండే బండలు నాటించారు. బండలకు బయట అక్కడొకటి అక్కడొకటి భూమికి జానెడు ఎత్తులో వుండేటిగా పాతిపెట్టిన కర్రలుండాయి. ప్రస్తుతం ఆ పశువుల కొట్టంలో రెండు జెర్సీ ఆవులున్నాయి. వాటి ముందున్న ఎండు గడ్డిని యిష్టముండీ లేనట్టుగా ఒక్కో పాచి అందుకుని తింటున్నాయి.

స్నానాల గదిలోకి వెళ్లి "కూచ్చోబ్బా ఈపురుద్దతా" అంది రమణమ్మ.

"నిలబడుకోనే రుద్దు" నవ్వుతా అన్నాడు రామచంద్ర.

"తాటిమాను మాదిరిగా వుండావు. యింకొంచెం పొడుగు పెరిగిండేది కుచ్చో"

"జిట్టక్కాయ మాదిరిగా వుండావు. పొడుగు పెరగాల్సింది నువ్వు. నేను కాదు" అంటూ కూర్చున్నాడు రామచంద్ర.

ఆమె భర్తకు వీపు రుద్దను వెళ్ళినప్పుడంతా ఈ సంభాషణ మామూలే. స్నానం చేసి వచ్చి ఉతికి ఇస్త్రీ చేసి పెట్టిన తెల్లపంచె కట్టుకున్నాడు. తెల్ల చొక్కాయి వేసుకున్నాడు. అప్పటికే పూజ గదిలో దీపం వెలిగించి కొబ్బరికాయ, కర్పూరం సిద్ధంగా వుంచింది రమణమ్మ.

పూజ గదిలో ఎడమవైపు వాడకాగులున్నాయి. వాటిపైన పెద్దపెద్ద బానలుండాయి. గదిలో ఎడమ వైపు చివర చెక్క బీరువా వుంది. దానిపక్కన లక్ష్మీ, సరస్వతి, వినాయకుడు, శ్రీరాముడు, వెంకటేశ్వరుడు, బ్రహ్మంగారు. యిలా దేవతల ఫొటోలు పెద్దవి వేలాడదీశారు. వాటి పక్కనే ఒక చివర చిరుగుల బట్టలతో ఉన్న తిక్క శంకరయ్య ఫొటో వుంది.

"యిబ్బుడెందుకే యిదంతా. మనమేమన్నా యింగ్లీషోళ్లమా? " అంటూ అయిష్టంగా పూజ గదిలోకి అడుగుపెట్టాడు రామచంద్ర.

"పండగపూట గమ్మున రాబ్బా నువ్వు. వచ్చి దేవునికి టెంకాయ కొట్టు" అందామె. కడ్డీలు వెలిగించి తన చేతులు అందేంత దూరం పటాలకు మూడు చుట్లు తిప్పాడు. కడ్డీలను పటాలకున్న చెక్క ఫ్రేములలో చెక్కాడు. కొబ్బరికాయ కొట్టి, కర్పూరం వెలిగించి, రెండు చేతులు జోడించి, కళ్లు మూసుకుని 'స్వామీ... ఈ సంవత్సరమన్నా బాగా వానలు కురిపించి అప్పులు తీరేటిగా చూడు. మా బిడ్డలకు మంచి సంబంధాలు వచ్చి పెండ్లయ్యేటిగా చూడు. బాధలన్నీ తీరితే కొండకు ఇల్లి తీర్థం వస్తాం" అని మొక్కుకున్నాడు.

రమణమ్మ, పిల్లలూ వచ్చి దేవుని పటాలకు నమస్కరించి వెళ్లారు. వెలిగించిన కర్పూరం

అయిపోయాక గ్లాసులోని కొబ్బరి నీళ్ళు అన్ని గదుల్లోను, వరండాలో, నెత్తిన చల్లుకొని అర చేతిలో కొద్దిగా పోసుకుని కళ్లకు అద్దుకుని తాగిం తర్వాత చేతిని తలపైకి పోనిచ్చి వెనక్కు అనుకున్నాడు. అందరూ తీర్థం తీసు కున్నారు.

భోజనాలు అవుతూనే చేతి సంచిలో కర్పూరం, పసుపు, కుంకుమ, నాలుగు కడ్డీలు, ఆకూతక్కి, కొబ్బరికాయ పెట్టుకుని అందరూ బయల్దేరారు.

పల్లెకు తూర్పుగా రెండుమైళ్ళ దూరంలో వుండే ఎఱ్రగొండ వద్దకు నడక మొదలు పెట్టారు. ఎఱ్రగొండపైన వెంకటేశ్వరుని అడు గులున్నాయని అక్కడివాళ్ళ నమ్మకం.

విష్ణువు వక్షస్థలంపై భృగుమహర్షి తన్న డంతో లక్ష్మీదేవి వైకుంఠాన్ని వదిలి అలిగి వెళ్ళిపోయింది. భార్యను వెతుక్కుంటూ శ్రీని వాసుడు భూలోకం వచ్చాడు. ముందుగా ఎఱ్రగొండపైన అడుగు పెట్టాడు. ఆయన శక్తికి తట్టుకోలేక ఎఱ్రగొండ గడగడా వణికిపో యింది. కొండమీది పెద్ద గుండ్లన్నీ దొర్లు కుంటూ కిందకు వచ్చేశాయి. తన శక్తినే భరించలేని ఆ కొండమీద లక్ష్మీదేవి వుండద నుకుని అంతకంటే పెద్దగా వుండే తిరుమల కొండమీదకు వెళ్ళాడు శ్రీనివాసుడు. ఎఱ్ర గొండ యింకొంచం పెద్దగా వున్నింటేనా, వెంకటేశ్వరుడు అక్కడే వుండి పోయేవాడని ఆ చుట్టుపక్కల పల్లెల్లో చెప్పుకుంటుంటారు.

ఎఱ్రగొండ వెంకటేశ్వరుడుని దర్శించుకుని ఇంటికి చేరుకొగానే సంచుల్లో కుట్టిపెట్టిన తొంభైశేర్ల వడ్లు తీసి సాయంత్రం నీళ్ళ తొట్టిలో పోశాడు రామచంద్ర. సామీ ఈ సమచ్చరం పంటలు బాగా వచ్చేటిగా చూడు అని మొక్కుకున్నాడు.

"ఏమే... మాలపల్లెకి పోయి చెప్పేసి వస్తా రేపు రమ్మని" అన్నాడు భార్యతో.

"యింట్లో దుడ్డులేదు. పనయితానే వోళ్లకు కూలిదుడ్లు కావాలన్నేరు. పండక్కే అంతా కావాలన్నేరు. తలా కొంచెం యిచ్చొంపినా. రేపు కొందరికి యిస్తానన్నే. ఎట్ల చేద్దాం" అంది రమణమ్మ.

"ఎట్లోగట్ల చేద్దాం లేయ్యే. ఎంగటముని చెనిక్కాయలు అమ్మేసినాడంట. వాన్నన్నా రెండువేలడగతా, వడ్లమ్మితానే యిచ్చేస్తానని" అని మాలవాడకు బయల్దేరాడు.

పద్దన్నే తప్పకుండా కోతలకు రమ్మని కూలీ లకు చెప్పి నేరుగా వెంకటముని యింటికి వచ్చాడు. సమయానికి అతనూ యింటి దగ్గరే వున్నాడు.

"రాన్నా... పండగ బాగా జరిగిందా?" పలకరించాడు రామచంద్రను. వెంకటముని వ్యవసాయమే కాదు, వ్యాపారం కూడా చేస్తున్నాడు. మనిషి పొట్టిగా వున్నా దిట్టంగా వుంటా డు. ఎక్కువగా నలిగిన బట్టలు, మాసిన బట్టలే వేసుకోనుంటాడు. కనుబొ మ్మల మధ్య మాత్రం బొట్టు ఎప్పుడూ వుంటుంది. ఆ రోజు మాత్రం కొత్త బట్టలు వేసుకోనుండాడు.




"మాదేముండాదిలే. పండగంతా నీ దెగ్గిరే కనిపిస్తాండాదే" రామచంద్ర కుర్చీలో కూర్చుంటూ అన్నాడు.

"ఆс.. ఈ గుడ్డలు అత్తోళ్ళు తీసిచ్చి సమ చ్చరమయిందన్నా. యింట్లోనే వున్నేయి. టైలర్ షరీఫ్‌గాడు యిర్వై రూపాయలు తీసు కోని ఆర్నెలయితాండాది. యింతవరకు ఈలా అందుకని, ఈ చొక్కాయన్నా కుట్టీరా నువ్వేం దుడ్డీయద్దుగానీ అంటే వాడు కుట్టిచ్చినాడు. అది సరే మడి కోసిండావా"

"ఆ ఇసయం మీదే నీకాడికొచ్చినా. మడికో సేది సగం అయిండాలి. ఈ పొద్దు పండగని



కూలోల్లు రాలా. రేపొస్తారు. పనయితానే కూలి దుడ్లు యియ్యాలన్నేరు. యింట్లో లేదు. అందుకని వచ్చినా" అన్నాడు మెల్లగా వచ్చిన విషయాన్ని చెబుతూ.

"ఎంతయితాండాదన్నా"

"ఎంత నీళ్ళుండాయని రెండెకరాలూ నాటే సిన్నేంగదా. కోతలకే రెండువేల దాంకా అయి తాండాది. యింగ కుప్ప కొట్టిందానికీ ఈసారి మిషన్ పిల్లింపతాండా. దానికి వెయ్యన్న కాదా? "

"అంతయితాందా కూలీలకు!" ఆశ్చర్యపో యాడు వెంకటముని.

"కాదప్పా. యిప్పుడు పదికీ, యిరవైకీ వస్తాండారా. కూలోల్లు. ముందు మాదిరిగా పద్దన్నే వచ్చి సందేళదాంకా వుంటాండారా. నలభై యాభై యియ్యాల్సిందే మనిషికి. వడ్ల మిషన్‌కు కుప్పగొట్టిందానికి మోటకు ఇరవై లెక్కన యియ్యాల్సిందే"

"ఔనులే. ఏం చేద్దాం. యిప్పుడు దుడ్డు లేదు గదాన్నా"

"ఎట్లన్నా గానీ, కనీసం మూడువేలన్నా చూడప్పా. వడ్లమ్ముతానే యిచ్చేస్తా"

శ్రీదేవి యింట్లో లైటు వేసింది. మసక చీక ట్లను వెలుగు మింగేసింది.

"నిజంగా లేదన్నా! అసలు సందేళపూట నీ కబద్ధం చెప్తానా? వున్నేగూడా ఈ పొద్దు యిచ్చిండనులే. పండగ కదా. ఈ పొద్దు అప్పిస్తే సమచ్చరం పొడుక్కూ అప్పులు యిస్తా వుండాల్సిందే గదా. రెండు మూడు రోజుల్లో ఎట్లోగట్లా చేస్తాలే"

"రేపన్నా ఈప్పా, లేకుంటే కూలోల్ల దెగ్గిర పరువు పోతాది" వేడుకోలుగా అడిగాడు రామచంద్ర.

"రేపా... కష్టమేన్నా. నేను గూడా యక్క డో ఒకతావన పెరక్కచ్చి యియ్యాల్సిందే. నా దెగ్గర లేదు. ఈ పొద్దు ఎవుర్నన్నా అడిగితే రేపిస్తారు. పండగపూట పోయి ఒకర్ని ఎట్లా డగతాం అప్పిమ్మని. రెండు మూడు రోజుల్లో చూస్తాలే. బోరేస్తాండవంట. చెప్పుకుంటాం డారు. దుడ్డెట్ల చేస్తాండావున్నా? "

"యింట్లో దుడ్డుండి బోరేస్తాండానా? నీయట్లా వోళ్లను ఎవుర్నన్నా అడగాల"

"నా దెగ్గిర మాత్రం యాడుందిన్నా. పత్రాలు పెడితే ఎవురి దెగ్గిరన్నో తెచ్చిస్తా. ఏం చేస్తాం తప్పుతాదా. వుండూరోళ్ళం కదా."

"యిప్పటికే చేను మూడెకరాలు పెట్టే సిండా. యాడా అప్పుదొరక్కపోతే ఆ పనే చే యాల్సిందే, బోరేయాల్సిందే. ఈ సారి మాత్రం దానంతు తేలుస్తా" అంటూ లేచినాడు.

"ఈ సారి తప్పకుండా పడతాయిలేన్నా నీళ్ళు.. బోరేయి" అన్నాడు వెంకటముని.

"నీ నోటి చలవ.. నీళ్ళు పడితేచాలు. అంతకన్నానా. వీలయినకాడికి దుడ్డు రేపే యిచ్చేటిగా చూడప్పా" అని చెప్పి యింటి దారి పట్టాడు రామచంద్ర.

వెంకటముని పొలం, రామచంద్ర పొలం పక్కపక్కనే వున్నాయి.

## 2

అప్పుడే స్నానం చేసి వచ్చినట్టు తేటగా వున్నాడు సూర్యుడు.

పల్లెనుంచి నాలుగు ఫర్లాంగుల దూరంలో వుంది మడి. పక్కన్నే ఇరవై బారల దూరం లో పెద్దబండ. అప్పటికే కొందరు కోతలు కోసి, కుప్పలు గొట్టి, బండ మీద వాములేసిం డారు. వాళ్ళ మాదిరిగా అయ్యేటి ఏసు కోనున్నే బాగుండు. జిలకర మసూర ఏసు కోని యిబ్బంది పడతాండా... ఆc... ఏం లాభంలే. ఆ బియ్యం ఎవురు తింటాండారి ప్పుడు... రేటు కూడా తక్కువే. టౌండ్లల్లో కూలీకి బొయ్యేటోళ్లు గూడా జిలకర, మసూరే తింటాండారంట. అందుకే అయ్యంత రేటు. రెండు నెల్లు ఎక్కువయినా బాధలేదు. పంట బాగొస్తే చాలు" అనుకున్నాడు.

ఎండ చురుగ్గా వుండటంతో, గెనం మీదుండే కానగ చెట్టు కిందకు వచ్చి బీడీ వెలి గించాడు. నోటి నిండుకు పొగలాగి వదిలా డు. ఒక్కసారిగా ఊపిరాడకుండా దగ్గు వచ్చింది. కండ్లలో నీళ్ళు గిర్రున తిరిగాయి. అక్కడే గెనం మీద కూర్చున్నాడు. దగ్గు తగ్గాక ఆరిపోయిన బీడీని తిరిగి ముట్టించి తాగతా తమ పల్లె దారివైపు చూశాడు. సద్ది తీసుకుని కూతురుగానీ... కోతలకు కూలీలు గానీ రాలేదు...

వీడు యాడ తిరుగులాడ తాండాడో... బాగా ఓగు పట్టిపోతాండాడు అని కొడుకును తిట్టుకున్నాడు. దూరంగా లీలగా మనిషి



ఆకారం కనిపించింది. ఎవరని పరిశీలనగా చూశాడు.

కూతురా... కూతురే... నా బంగారు కూతురు శారద...

యిర్వై ఆరేండ్లయితాన్నే పెండ్లిగాలా...

కూతురు మానమయింది గాబట్టి సరిపో యింది. గోడలు దుంకే రకమయింటే అగుడు పట్టి పోయిందుము. ఆ వయసు మొగోళ్ళ కంతా పెండ్లిండ్లయి పోయిండాయి. ఆడోళ్ళక యితే ఆరేడేండ్ల బిడ్డలుండారు. ఎపుడు పెండ్ల యింతాదో ఏమో. ఈ సారన్నా పంటలు బాగా వస్తే, అప్పో సప్పో చేసయినా పెండ్లి చేసేయాల. దినదినానికి ఎండుకంపయి పోతాండాది. వయసులో వుండే బిడ్డ ఎట్లుం డాలి. ఏ వయసుకా ముచ్చట వుంటే గదా ఎవురయినా ఆరోగ్యంగా వుండేది. మడిగ్గూడా అంతే గదా... ఎప్పుడు పడాల్సిన తడి అప్పుడు పడితేనే పంట బాగొచ్చేది.

"నాయనా... సద్ది తాగుదువురా" అంటా కూతురు పిలవడంతో రామచంద్ర ఆలోచ నలు ఆగిపోయాయి. చేతివేళ్ళ మధ్యన్న ఆరి పోయిన బీడీని ఒకసారి అటూ యిటూ తిప్పి చూసి విసిరి పారేశాడు.

కింద కూర్చుని "మీ అమ్మ ఏం చేస్తా న్నింది" అన్నాడు సద్ది పోసిన గ్లాసును చేతికి తీసుకుంటా.

"మధ్యాన్నం సంగటికి రాగిపిండి లేదంట. రాగులు యిసురుకుంటాన్నింది" అంది క్యారేజీ మూతలో వూరగాయను పెడుతూ శారద.

జానపద గీతం పొలాలను దాటుకుంటూ వచ్చింది చెవులను తాకింది.

"అద్దో... వాళ్లొస్తాండారమ్మా... ఈ పొద్దూ రేపు పడతాదేమో కోసేది" అంటా గబుగబా సద్ది తాగాడు రామచంద్ర.

ఎనిమిది మంది ఆడవాళ్లు, నలుగురు మగవాళ్ళు వచ్చారు కోతలకు. వాళ్ళతో బాటు కొడుకు బాలకృష్ణ కూడా వచ్చాడు. కొడుకును చూడగానే కోపం వచ్చింది రామ చంద్రకు.

"ఈ యరవదాంకా యాడికి పోయిన్నే వురా...? " గదమాయింపుగా అడిగాడు.

"మా పల్లె కొచ్చిన్నాడున్నే. ఆయప్ప వస్తేనే ఈమరవయింది, మావోళ్ళు వచ్చేలకు" అన్నాడు రామయ్య.

"సరే సరే... గబుగబా వంగండి... సహదే వోళ్లకు కోతలకు పోయి గంటయితాండాది"

"వాళ్ళమడి దూరం గదా. యిబ్బుటికింగా ఆడికి పోయిండదు" అంటా దగ్గికింద పెట్టిండే కక్కుల కొడవండ్లు తలా ఒకటి తీసు కుని మడిలోకి దిగారు.

మగవాళ్ళు పంచెలు ఎగకట్టి, పైపంచెలు తలకు చుట్టుకోనుండారు.

ఆడవాళ్ళు పైట చెంగును నడుం దగ్గర దోపుకుని, చీరను కొంచెం ఎగకట్టుకుని, దేవు నికి దండం పెట్టుకుని కోయడం మొదలు పెట్టినారు.

"మామా... మిషను గావాలంటే రెండు దినాలముందే చెప్తే మేలు. పనుల కాలం గదా. గిరాకీలు దండిగా వుంటాయి. ఒగో సారి గుండ్రోల్ల పల్లి అట్ల పోతాంటింది. మళ్ళీ నెలదాంకా ఈ తిక్కురాదు" అన్నాడు లక్ష్మయ్య.

"ఔనౌను... మళ్ళా మేమే రావాల కుప్ప కొట్టేదానికి" అన్నారు మరో యిద్దరు.

"మీతో పెట్టుకుంటే యాడవుతుందప్పా నాకు. పండగలంటారు, వేవర్లంటారు, సంత లంటారు. కుప్పగొట్టే మొగోళ్లు ఎందరుండారు మీ వాళ్ళల్లో. వున్నే కూలికి యాడొస్తాం డారు? అంతా సేద్ది గాళ్ళయిపోయినారు. నువ్వు పోరా... పొయ్యసి సుబ్బారెడ్డికి చెప్పే సి రాపో... ఈ పొద్దు శుక్కురారం కదా... ఆదివారం రావాలని చెప్పు పో" అన్నాడు కొడుకుతో రామచంద్ర.

"నేనూ పోతాండాను నాయనా" అంది శారద.

"సంగటి అయితానే గొడ్ల తోలుకోని మీ అమ్మను గూడా ఈడికే రమ్మను... నువ్వు

గూడా బిన్నే వచ్చేయరా... పిల్లోల్లతో చేరి కిరికెట్టు ఆడతాండద్దు"

ఎండ - చిటపట లాడతాండాది. ఫర్లాంగు దూరంలో కొండకుండే బాటంటీ మేతకు ఎల్ల దోలిన పశువులు పోతాండాయి. వాటి మెడ ల్లోని గంటల చప్పుడు లయబద్ధంగా వినిపి స్తాంది. పక్కన బీడు కయ్యల్లో మొలిచిన గూగూచ్ చెట్లల్లో జెల్లవాయిలు అరస్తాం డాయి. మడి గట్టున ఉండే ముష్టి చెట్టును పైకీ కిందకూ తిరుగుతూ పొడవు కొలుస్తు న్నాయి. కానుగ చెట్టులో వాలిండే కాకులు ఉండుండి ఒక్కోసారి కావ్ కావ్ మని అర స్తాండాయి.

బోరు దగ్గరకు పోయి కంప్రెజర్ మోటార్ వేశాడు రామచంద్ర. పైపులో నించి నీళ్ళు ఆగాగి కొన్ని వస్తున్నాయి. అవన్నీ ఒక కయ్యలో నిల్వ ఉంటున్నాయి.

కొంచెం సేపట్లోనే కరెంటు పోయింది.

"ఈ ముండమోపి కరెంటు సావనీదు, బత కనీదు అనుకుంటా పోయి స్విచ్ ఆపినాడు రామచంద్ర. కయ్యలో నీళ్ళు రెండేళ్ళ లోతు కూడా లేవు.

ఇరవై కుంటల నేలలో నాటిండే మిరప తోటను చూశాడు. తోటలో ఆకులకన్నా మిర పకాయలు ఎక్కువ పచ్చగా కనిపిస్తాండాయి. చెట్లన్నీ వాడు మొగం పట్టిండాయి. చివరి కాలువలో పది వరసలు ఎండి పోయిం డాయి. నీళ్ళు చాలక వాటిని పూర్తిగా వదిలేసిండారు. మిగిలిన తోటనన్నా దక్కిం చుకుందామని రామచంద్ర ఎంతగానో ప్రయత్నిస్తు న్నాడు. కానీ నీళ్లతో పాటు, కరెంటు కూడా సహకరిం చడం లేదు. బీడీ వెలిగించి తాగతా తోటంతా ఒకసారి తిరిగి చూశాడు. అక్కడ క్కడా కాయలు ఎర్రబడుం డాయి. యింగో ఐదారు తడులు వస్తే చాలు. పంట వచ్చేస్తాది అను కున్నాడు. ఎండ ఎక్కువగా అన్పించి అక్కడి నుంచి వచ్చి కానుగ చెట్టుకింద కూర్చున్నాడు.

మరో గంటకంతా సంగటి ఎత్తుకుని, జెర్సీ ఆవులు తోలుకోని వచ్చినారు రమణమ్మ, శారద.

వస్తానే రమణమ్మ కూడా ఒక కక్కల కొడవలి తీసుకోని కోతకు వంగింది.

"నువ్వూ రావాలేమ్మా"

"ఏం... నేను మనిషిని కాదా... ఒగ మనిషి కూలి తగ్గినా తగ్గినట్టేకదా" అంది రమణమ్మ.

"ఔనౌనులే"...

కూలీలతో పాటు పని చేస్తున్న భార్యను చూస్తుంటే రామచంద్రకు దిగులుగా ఉంది. మెడలో పసుపు దారమూ, నాసిరకం ముతక చీర, రాగి రంగుకి తిరిగిన జుత్తు... చూడ గానే బాధ యింకా ఎక్కువయింది. ఒకప్పుడు ఎట్లున్నింది... మెడ నిండుకు నగలేసుకోని... తల నిండుకు పూలు పెట్టుకోని... పట్టుచీర కట్టుకుంటే... బంగారు బొమ్మ మాదిరి ఉండేది. గొడ్డు మాదిరిగా యింట్లో, పొలంలో కష్ట పడతాంటే... ఎండు చేప మాదిరిగా అయిపోతాంటే... ఎప్పుడు సుఖమొస్తాదో ఏమో పేరుకు పెద్ద రైతునే గానీ... పెండ్లాన్ని గూడా సుఖ పెట్టలా. బిడ్డలకు వయసులో పెండ్లిండ్లు గూడా చేయలా... అనుకున్నాడు రామచంద్ర.

నెత్తిన పైట చెంగు కప్పుకోని ఆవుల్ని మేపతాండే కూతుర్ని చూసి ఆ బాధ యింకా ఎక్కువయింది. చెట్టు కింద కూర్చుని బీడీ మీద బీడీ తాగుతాండాడు. ఆలోచన్ల తీవ్రత పెరిగే కొద్దీ తాగే బీడీల సంఖ్యా పెరిగి పోతా ఉంది. మధ్యలో యిద్దరు కూలీలు వచ్చి బీడీలు అడిగి తీసుకుని తాగి

ఒకప్పుడు ఎట్లున్నింది...
మెడ నిండుకు
నగలేసుకోని...
తల నిండుకు పూలు
పెట్టుకోని...
పట్టుచీర కట్టుకుంటే...
బంగారు బొమ్మ
మాదిరి ఉండేది

## వాసనతో వైద్యం

"**వా**సనతో వైద్యమా? !"... అలా ఆశ్చర్య పోకండి... నిజమే... పదేళ్ళపాటు వాసనల మీద పరిశోధనలు జరిపిన అమెరికన్ శాస్త్రవేత్తలు రిచర్డ్ ఆక్సెల్, లిండా బక్‌లకు నోబెల్ ప్రైజు కూడా వచ్చింది. వెయ్యి జన్యువుల వలన పదివేల రకాల వాసనల్ని మనం గుర్తిస్తున్నట్టు వీరు కనుగొన్నారు.

వాసనతో వైద్యం (ఆరోమా థెరఫీ)లో సెంటెడ్ ఆయిల్స్ ఉపయోగిస్తారు. కొన్ని రకాల సెంటెడ్ ఆయిల్స్‌ని... కొన్ని రోగాల కోసం ప్రత్యేకంగా వాడతారు. వీటిని రోగి పీల్చడం, వంటికి రాసుకోవడం, మసాజ్ చెయ్యడం ద్వారా రోగి రిలీఫ్ పొందుతాడు.




వెనిల్లా... మానసిక వత్తిడి నుండి ఉపశమనం కోసం.
లావెండర్... విశ్రాంతి, సుఖ నిద్రకోసం
కేమోమైల్... నెప్పుల నివారణ కోసం
రోజ్‌మేరీ... అలర్ట్‌నెస్, వత్తిడి తగ్గడానికి.
లెమన్ బామ్ ఆయిల్... వృద్ధుల దీర్ఘ నెప్పుల కోసం... బాగానే వుంది కానీ... ఈ నూనెల వాడకం నిపుణులైన ఆరోమా థెరఫిస్టుల సమక్షంలోనే జరగాలి. తెలిసీ తెలియని అధిక మోతాదులు వాడితే మంటలు, అలర్జీలు, తలనొప్పి, వాంతులు వచ్చే అవకాశం ఉంటుంది.

వైద్యం పేరు చెబితే వెయ్యి మైళ్లైనా వెళ్లే అలవాటున్న వాళ్ళకి ఇది శుభవార్తే కదూ!

వెళ్లారు.

సాయంత్రం ఐదు గంటలకంతా కోతలు ఆపేసినారు. కోసి వాదిలుగా వేసిందే వరి కర్రలను మోటగడ్డితో పెద్ద పెద్ద కట్టలుగా కట్టారు. ఆ కట్టలను ఆరేడు వేసి మోపుగా కట్టుకోని నెత్తిన పెట్టుకోని తీసుకొచ్చి బండ మీద కల్లం కాడ వేయడం మొదలు పెట్టినారు. కోసిన కర్రల వరకు కల్లం చేరేటప్పటికి చీకటయింది.

వాళ్లు వెళ్లిపోయాక కల్లం దగ్గర మంచం మీద వెల్లకిలా పడుకున్నాడు. పౌర్ణమి మరో వారం రోజుల్లో వుందేమో... అర్ధచంద్రుడు నడి నెత్తిన ఆకాశంలో చేరి నవ్వులు చిందిస్తోండాడు. చంద్రుని వెలుగుకు నక్షత్రాలు పలచబడ్డాయి. ఆగ్నేయం నుంచి వాయువ్యం దిక్కుకు పోతాంటే విమానం లైట్లు మిణుకు మిణుకు మంటున్నాయి. విమానం వెళ్ళిన కాసేపటికి మోర్పు వినిపించింది. బండ పక్కనున్న చెట్లల్లో గుడ్ల గూబల జత ఒకటి మార్చి ఒకటి అరస్తా ఉండాది. మిణుగుర్లు అక్కడొకటి అక్కడొకటి వెలుగు నింపడానికి విశ్వప్రయత్నం చేస్తున్నాయి.

ఈ మధ్య రామచంద్రలో మునుపటి హుషారు లేదు

ఏదన్నా పని చేయాలని మనస్సు బలంగా సంకల్పించినా శరీరం సహకరించడం లేదు.

పగలు కొంతసేపు ఎండలో మడికోసిందానికే బాగా అలిసిపోయాడు. మంచం మీద అలానే కొంతసేపు పడుకోనుండి పోయాడు.

ఆకాశంలో నక్షత్రాలను, తన జీవితంలో కష్టాలను లెక్కబెట్టడానికి ప్రయత్నించి సాధ్యంకాక, లేచి కూర్చుని బీడీ వెలిగించాడు. వర్తమానాన్ని, భవిష్యత్‌ను తలచుకుంటాంటే రామచంద్రకు నిస్సత్తువుగా అన్పిస్తాంది. ఏ రోజుకారోజు తనలో ఉత్సాహాన్ని నింపుకుని బతుకుబండిని లాగిస్తున్నాడు.

కల్లం దగ్గర నుంచి రామచంద్ర యింటికి చేరేప్పటికి ఎనిమిది గంటలు దాటింది. స్నానం చేసి, భోంచేసి పడుకున్నాడు.

మరుసటి రోజు సాయంకాలం ఏడుగంట లకు కోతలు కోయడం, మోపులన్నీ బండ్లమీద కల్లం వద్దకు చేర్చడం అయిపోయింది. ఆ రోజు రాత్రి పదిగంటల దాకా కల్లం దగ్గరే వుండి యింటికి పోయి తిరిగి తెల్లవారుజా మున్నే నాలుగు గంటలకే అక్కడకు చేరుకు న్నాడు రామచంద్ర.

తూర్పున ఎర్ర పటమెగరక ముందు నుంచే ఎదురు చూస్తాండాడు మిషను కోసరం. బుర్రుమనే ట్రాక్టర్ శబ్దం కోసం చెవులు రిక్కించి వింటున్నాడు. ఎవరిదో దూరంగా ఎద్దులబండి పోతావుంది. గణగ ణమనే ఎద్దుల మువ్వల చప్పుడు, బండి చక్రాల శబ్దం కలిసి శ్రావ్యంగా వినిపి స్తాంది. ముష్టి చెట్టులో పుల్లాయి చెదుళ్ళు కువకువలాతాండాయి.

సూర్యుని వెలుతురుతో పాటు ఒళ్ళు విరు చుకున్న ప్రకృతిలోని సమస్త జీవుల కదలి కలు తమ ఉనికిని తెలుపుకుంటున్నాయి. దూరం గా చెరువు గట్టునుండే కానుగచెట్టు కొమ్మలకు జీనువాయిల గూళ్ళ వేలాడతాం డాయి. అవి గాలి వీచినప్పడంతా పూతతో లేత ఎరుపు రంగులో వుంది. చుట్టుపక్కల పొలాల్లో ఎక్కువభాగం బీడుగానే వుండాయి. బండమీద యింకా చాలా వరకు ఖాళీగానే వుంది. అదంతా పరిశీలనగా చూసి దీర్ఘంగా నిట్టూర్చాడు రామచంద్ర.

ఏందో మాకాలమంతా ఎర్రికాలం అంటాం టారు.

ఎర్రికాలం అయినా బాధలేదు. చేతినిండా పని, కడుపునిండా తిండి వుంటాన్నింది. కంటారా నిద్రా వుంటాన్నింది. యిప్పుడు అయ్యే మీ లేకుండా పోయినాయే. ఎందుకు సేద్దం చేస్తాండారు?

సేద్దిగాన్ని నమ్ముకున్నోళ్ళు మాత్రం ఎందురు బాగుపన్నేరు? ఎంతెంత అప్పు లయి పోతాండారు? సమచ్చర సమచ్చరా నికీ ఈ అప్పు పెరగతాందే గానీ తరగ తాందా? సేద్దిం చేయకుంటేనేం? తాతల కాలం నించీ సేద్దిమే గదా చేస్తోండేది. సేద్దిం చేయకపోతే యింగేం చేస్తాం? యిప్పుడు అప్పులెట్ల తీర్చేది. బిడ్డల పెండ్లిండ్లు ఎట్ల చేసేది?

ఆ ముసల్ది సచ్చి గుంతలో సుకంగా వుండాది.

యిద్దరు బిడ్డలకే ఆపరేషన్ చేయించేస్తా నంటి. ఒప్పుకోలా. యింగో మనవడు కావా లని కడాన ఆడపిల్ల పుట్టె. ఆ బిడ్డకు పెండ్లి చేయ్యలేక అల్లాడతాండాం. ఏదో ఒగటి చేయాల. ఏదో ఏముండాది. బోరేయాల. ఎంత లోతన్నాగానీ నీళ్ళు పడేదాకా ఎయ్యా ల. పంటబెట్టాల. దుడ్డుకండ్ల జూడాల...' అనుకున్నాడు రామచంద్ర.

ట్రాక్టర్ శబ్దం కోసం చెవులు రిక్కించి విన్నాడు. అలాంటి శబ్దం విన్పించలా. బండ చివర వుండే రాతి గుట్టపైకి ఎక్కి దారివైపు చూశాడు. ట్రాక్టర్ జాడయితే లేదుగానీ మాల వాడ నుంచి కొందరు, కామిరెడ్డిగారి పల్లె నుంచి కొందరు వస్తా కనిపించారు.

కూలోల్లు వస్తాండారేమో... ట్రాక్టర్ రాలేదే అనుకుంటా అక్కడే కూర్చుని బీడీ ముట్టిం చాడు. పది నిముషాలకంతా వాళ్ళంతా కల్లం దగ్గరకు వచ్చి దిక్కులు చూస్తాండారు.

"నేనీడ వుండానురోయ్..." అంటా గుట్ట దిగుతాండాడు రామచంద్ర.

అందరూ మాటలు చెప్పకుంటా, బీడీలు తాక్కుంటా కూచ్చోనుండారు.

అతను సద్ది తాగేలకు మిషన్‌ను ట్రాలీలో వేసుకుని ట్రాక్టర్ వచ్చింది. వాటితో పాటు బాలకృష్ణ కూడా వచ్చాడు.

"ఏం మామా... ఈసారి బాగయినట్టుందే పంట" పలకరించినాడు మిషను ఓనరు సుబ్బారెడ్డి.

"ఏముంది వాయ్... ఐదెకరాలుంటే రెండె కరాలే గదా సాగయింది. పది బోర్లు ఫెయి లయి పాయ. రెండెకరాలు చేనమ్మి అప్పులో ల్లకు కట్టినాం. ఉండే బోర్లో పిల్లోని ఉచ్చ మాదిర్తో వస్తాండాయి నీళ్ళు. ఈ రెండెక

రాలు గూడా సరిగా కడులు పారలా" తన బాధలన్నింటిని ఏకరువు పెట్టాడు రామ చంద్ర.

"ఆడికి నీపనే మేలు మామా. రెండెకరాలే అమ్మినావు. కొందురయితే వుండే ఆస్తంతా అమ్మినా అప్పులకు పూరొదిలిండారు. ఈ వరుపులో రెండెకరాలు మనపక్క ఎవురికి సాగయింది చెప్పు. నీ యట్లావోళ్ళకు యిద్దరి ముగ్గురికే" అన్నాడు సుబ్బారెడ్డి.

అందరూ కలిసి ట్రాక్టర్ ట్రాలీలోనించి కుప్పగొట్టే మిషన్‌ను కిందకు దించారు.

"మిషన్ పెట్టుకున్న కాన్నించి నువ్వు మాటలు బాగా నేర్చినావులేవాయ్... నీ కోసరమే మేమంతా కాసుకోనుండేదీడ. కానీం డి బిన్నే. మళ్ళా ఎంత" తొందర తొందర చేశాడు రామచంద్ర.

మధ్యాహ్నానికి వరి నూర్పుడు అయిపో యింది.

"మొత్తం యాభయిరెండు మోటలు మామా" అన్నాడు సుబ్బారెడ్డి.

"ఏం యాభయిరెండో లేప్పా. నేనింగా డెబ్బయన్నా అయితాయనుకోనుంటి. యింత అద్మాన్నంగా ఒదుగుబడి వుంటాదనుకోలా" అన్నాడు దిగులుగా రామచంద్ర.

"ఆడికీ మేలే గదా మామా. ఈ కరువులో యింత పంట ఎవురు తీసినారు. భగమం తుడు యిచ్చింది చూసి సంతోషించాల్నేగానీ బాధ పడగూడదు" సలహాయిచ్చాడు సుబ్బా రెడ్డి.

"దీంట్లో జాల్లెంత పోతాదో..." గొణిగి నాడు.

"బొక్కినమ్మకు బొక్కినంత" అన్నేట్టుగా, ఎవురికెంత దక్కాలో అంతే దక్కోలిలే. రాండి తిందురు" అంది రమణమ్మ, అంతకు ముందే తెచ్చి మంచం కింద నీడలో పెట్టిండే సంగటి గంపను పక్కకు లాగతా.

అందరూ ఆ మాట ఈ మాట చెప్పుకుం టూ సంగటి ముద్దలూ మింగేశారు.

సుబ్బారెడ్డి సంచుల ప్రకారం తనకు రావ ల్సిన మొత్తాన్ని లెక్కగట్టి తీసుకుని మిషన్ ట్రాక్టర్ ట్రాలీలో వేసుకుని వెళ్లిపోయాడు.

కూలీలు కూడా మాలెపల్లె నుంచి వచ్చిన వాళ్లు వెళ్ళిపోయారు.

తూర్పెత్తిన వడ్లను ఒకచోట రాశిగా పో శారు. జొల్లు పోయిండే వడ్లను చూశాలకు రామచంద్ర మనసు బాధతో నిండిపోయింది.

రాశిగా ఉండే వడ్లను చూస్తాంటే రమణ మ్మకు కూడా దిగులయింది. కండ్ల ముందరే సగం పంటను ఎవరో దోచుకెళ్ళినట్టుగా బాధ పడింది.

వడ్ల రాశి దగ్గరకు పోయి నిలబడుకున్నాడు రామచంద్ర.

చేత్తో రాసి అడుగున జానడు ఎత్తులో తాకతా చుట్టూ తిరిగి వచ్చి, తూర్పు ముఖంతో నిలబడుకోని చేతులు జోడించి నమస్కరించాడు. చాట తీసుకోని మూడు సార్లు ముంచి గంపలో వేశాడు.

పంటొచ్చిన ప్రతిసారీ కల్లంలో అలా చేయడం వాళ్ళకు అలవాటు. ఆ వడ్లను రోట్లో వేసి దంచి, బియ్యంతో పాయసంగానీ, అత్తిరాసాలు గానీ చేసి ముందుగా దేవునికి నైవేద్యం పెడతారు. పంటలు బాగా వచ్చే టిగా, వానలు కురిసేటిగా చూడమని వేడు కుంటారు.

"మీరు పొండి యింటికి" అన్నాడు రామ చంద్ర.

"దీనిపైన పట్ట ఏద్దాం" అంటూ కొడుకు మంచం కిందనుంచి సంచులతో కుట్టిన పట్టను తీసుకొచ్చాడు. దాన్ని అందరూ పట్టు కుని వడ్ల రాశిపైన కప్పెట్టి గాలికి లెయ్యా కుండా చుట్టూ అక్కడక్కడా రాళ్లు పెట్టారు.

"నువ్వూ రాబ్బా పోదాం. నీళ్ల పోసుకోని వద్దువు" అంది రమణమ్మ.

"యిబ్బుడు రానులే. రేపు పోసుకుంటా నీళ్ళు. వోని దగ్గెర అన్నం అంపిచ్చు" అన్నాడు మంచం మీద కూర్చుంటూ.

మధ్యాహ్నం కూరలు తెచ్చిన పాత్రలు, నీళ్ల బిందె గంపలో వేసుకుని యింటిదారి పట్టారు

అమ్మా కొడుకు.

చీకట్లు ముసురుకుంటున్నాయి. చెట్లల్లో గూళ్లకు చేరిన పక్షులు గోల చేస్తాండాయి. చంద్రుణ్ణి మబ్బులు కమ్ముకోనుండాయి. వెన్నెల మసకగా ఉండాది.

మంచం మీద కూర్చున్నాడే గానీ రామచంద్ర మనసంతా వికలమయిపోయింది.

ఇరవై ఐదు మోటలుంటాయేమో. మోటకు ఐదు నూర్ల లెక్కన పన్నెండు వేలా ఐదు నూర్లు వస్తాయి.

దుక్కులు దున్నిందానికి, మడక్కు నూరు లెక్కన.

ఎకరాకు ఆరు మడకలు, మూడు సార్లు దున్నకం. యిత్తనం గింజలకు, నాట్లకు ఎకరాకు ముప్పై మంది. ముప్పై లెక్కన కాంప్లెక్స్ మోట, యూరియా అరమోట. కలుపుకు పదిమంది. తెల్లజీడ ఎర్రజీడ రాకుండా మందులు. కోతకు ముప్పై మంది. కుప్ప గొట్టిందానికి మిషన్‌కు.

అదికాడికి ఎకరాకు ఆరు వేల పెట్టుబడి. రెండెకరాలకు పన్నెండు వేలు... యింగా యింట్లో కష్టం లెక్కెయ్యాలా. కరెంటు బాదుగలు. ఎంతయింది.

పంటలో వస్తాండేది పన్నెండు వేలా ఐదు నూర్లు.

మద్దెలో కరెంటు లో వోల్టేజితో మోటార్ రెండుసార్లు కాలిపోయింది. మూడు వేల యిండాది. అంతా కలుపుకుంటే, రెక్కల కష్టం తీసేసినా రెండు మూడు వేలు నష్టం.

లెక్కలన్నీ తలచుకోగానే రామచంద్ర మనసు వికలమయిపోయింది. భవిష్యత్‌ను తలచుకోగానే బాధేసింది. కళ్లనుంచి నీళ్ళు ధారగా కారసాగాయి.

చిన్నప్పటి నుంచీ సేద్యం చేస్తాన్నే రామచంద్ర ఎప్పుడూ యింతగా బాధ పడలేదు. తనకు తెలీకుండానే తన శక్తిని ఏదో హరించి వేస్తాందని, తన పొలాన్ని ఏదో దుష్టశక్తి పీడిస్తాందని బాధ పడ్డాడు, భయపడ్డాడు.

ఎట్లన్నా గానీ, వెయ్యడుగుల లోతయినా సరే. ఈసారి బోరేయాల. గంగను చూడాల. ఐదెకరాలు పంట బెట్టాల. అనుకున్నాడు.

ఆకాశంలో ఉత్తీత అరస్తా పోయింది గుట్టవైపు. ఒక్క క్షణం రామచంద్ర ఒళ్ళు జలదరించింది.



నాలుగు రోజులు గడిచాయి

రాత్రి ఎనిమిది గంటలు కావస్తోంది. తెల్లారితే బోరేయాల. రామచంద్ర పడుకున్నాడే గానీ, చాలా సేపటి వరకు నిద్ర పట్టలేదు. ఏవేవో ఆలోచనలు. యిప్పటికే కొంత చేను అమ్ముకున్నాడు. నాలుగెకరాలు అడమానంలో వుండాది. మిగిలిన రెండెకరాలు గూడా అడమానం పెట్టేసి వెంకటముని దగ్గర మూడు రూపాయల వడ్డీకి యాభయివేలు తీసుకున్నాడు. తెల్లారికి బోరేస్తే నీళ్ళు బాగా పడతాయి..ఐదెకరాలూ సాగవుతుంది. అప్పులన్నీ ఒగటి రెండు పంటల్లో తీరిపోతాయి.

వచ్చే సంవత్సరం బిడ్డలకు పెండ్లి చేసేయాల. కట్నం ఎక్కువయినా సరే. కూతుర్ని ఉజ్జోగస్తునికే యియ్యాల. కొడుక్కు గూడా మంచి కష్టజీవిని తేవాలి. వోడు మా మాదిరిగా కష్టపడలేడు.

ఉద్యోగస్తురాలిని తెస్తేనే మేలు. ఏదన్నా టౌనులో వుండి నీడపాట్న బతికేస్తారు. ఒగేళ... ఒగేళ నీళ్ళు పడకపోతే... ఆ వూహే భరించలేక పోయాడు రామచంద్ర. తప్పకుండా నీళ్ళు పడతాయి అనుకున్నాడు. రమణమ్మ, పిల్లలూ నిద్రపోయారు.

రాత్రెప్పటికో నిద్ర పట్టింది రామచంద్రకు. నిద్రలో ఓ పీడకల.

ఉలికిపాటుగా లేచి కూర్చున్నాడు రామ

చంద్ర.

నోరంతా తడారిపోయిండాది.

లేచి లైటు వేశాడు. హాల్లో చాపలమీద పడుకోనుండే భార్య బిడ్డలను ఒకసారి చూశాడు. రామచంద్ర మనసంతా దిగులు కమ్ముకునింది. నీళ్ళుతాగేసి వచ్చి లైటార్పి పడుకున్నాడు. లైటార్పినా గానీ కళ్ళు మూతలు పడలేదు. ఏవేవో ఆలోచనలు. నిద్రకు మెలకువకూ మధ్య గడిపేశాడు మిగిలిన రాత్రంతా.

"న్నో, రామచంద్రన్నా. ఆరు గంటలకు ఫేసు మారుతుందంట గదా. నారుకు నీళ్ళు కట్టాలంటాంటివే, రా పోదాం" వీధిలో నించి కేకేశాడు శివరాం.

ఔనుగదా, నారుమడి ఎండి పగుళ్ళు బారిండాది ఈ పొద్దు దానికే నీళ్ళుగట్టాల. అనుకుంటా గబగబా లేచినాడు రామచంద్ర. జారిపోతాండే లుంగీని నడుముకు బిగించి కట్టుకుంటూ 'వస్తాండా. శివరాం వుండు. రేయ్ బాలకృష్ణా... బాలకృష్ణా... లేయ్‌రా" అన్నాడు గట్టిగా.

అప్పటికే శారద లేచి కూర్చుని కళ్ళు నులుముకుంటోంది.

"ఏం నాయనా... తెల్లారముందే లేపేస్తాండావు" అన్నాడు బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటా లేచి కూర్చుని.

"లేపకపోతే పద్దాక అయినా పడుకొనేటిగా వుండావే. ఐదు దాటినాంక ఎట్లరా నిద్ర పడతాది. నేను మడి



కాడికి పోతాండా. బోరు మిషను వస్తే మడికాడికి పిల్చుకరా. అట్లే బిందెతో నీళ్ళు తీసుకోనిరా" కొడుక్కు పని పురమాయించాడు.

"బిందె ఎత్తుకోని పోయి బోరుకాడ పట్టుకుందాంలే" అన్నాడు ఆవులిస్తా బాలకృష్ణ.

"నారుకే నీళ్ళు చాలక అల్లాడతాంటే బిందెతో పట్టుకుంటాడంటనే ఈడు, యింటికాన్నించే ఎత్తుకోనిరా" అంటూ రాత్రి తలగడ పక్కన పెట్టుకున్న బీడీకట్ట, అగ్గిపెట్టె తీసుకుని జేబులో వేసుకుని యింటి ముందుకు

వచ్చాడు. నీళ్ళ బిందెతో వచ్చిన భార్యను చూసి 'మంచి శకునం' అనుకొని రెండడుగులు వేసి ఆగి 'ఏమే... నేను మడికాడికి పోతాండాను గానీ, వాళ్ళు వచ్చినాంక ఎందురో లెక్కబెట్టి అన్నం చేసంపు. సంగటి చేయద్దు. మరచిపోయినా, దాంట్లోవి తీసి ఇన్నూరిచ్చి వోన్ని నూతన కాల్వకు పోయి రెండు కోళ్ళు పట్టుకోని రమ్మను" అని భార్యకు చేయాల్సిన పనులు చెప్పి శివరాంతో బయల్దేరాడు రామచంద్ర.

తూర్పున ఎర్ర పటమెగిరిందే కానీ, యింకా పూర్తిగా వెలుగు ఆక్రమించలేదు. చలిగాలి



వీస్తోంది. రాత్రి కురిసిన మంచు చెట్ల ఆకుల మీద నీటి బిందువుల్లా వుంది. కోడిపుంజులు పందెం వేసుకున్నట్టుగా ఒక దాన్ని మించి ఒకటి కూత వేస్తాండాయి. చింత చెట్టు మీద కాకులు గోలగోలగా అరుస్తాండాయి.

"నిన్నటి రేత్తిరి మీ యింట్లో ఏందో గొడవగా వుండెనే. నిన్ననే అడగదామనుకున్నే. మరిచిపోయినా" అన్నాడు రామచంద్ర.

"ఆం... ఆ గొడవా. నువ్వెప్పుడు చూసినావన్నా"

"చూస్తిలే. రేత్తిరి తొమ్మిది గంటల కాడ కదా. గొంతులు పెద్దగా యినపడ్తాన్నేయి" అన్నాడు జోబీలోనించి బీడీతీసి వెలిగిస్తా.

శివరాం కూడా తన జోబీలోనించి ఒక బీడీ తీసి వెలిగించుకున్నాడు. ఇద్దరూ మౌనంగా నడుస్తున్నారు. ఇద్దరి మనసుల్లోనూ ఏవో ఆలోచనలు రగులుకుంటున్నాయి.

"మీకు బేంకునుంచి నోటీసు వచ్చిందాన్నా" అన్నాడు శివరాం.

"మాకా..." అని చెప్పాలా వద్దా అన్నట్టు కాసేపాగి "మొన్న వచ్చిందిప్పా. ఈ నెలాఖరుకంతా కట్టాలంట వడ్డీ మొదలు. లేకుంటే ఏలం ఏస్తారంట ఆస్తులు" మెల్లగా చెప్పాడు రామచంద్ర.

"అందుకేన్నా మా యింట్లో గొడవయిందేది. మాగ్గూడా వచ్చింది నోటీసు. భారతిని బొట్టు చైను యిమ్మని అడిగినాడు మా అన్న.

ఆయమ్మ ఈయనింది. వాళ్ళమ్మోళ్ళు మా పెండ్లయిన పదేండ్లకు చేపిచ్చినారు. నెల గూడా కాలాయింగా. అందుకూ గొడవ" అన్నాడు శివరాం ఒక్కో మాటను ఆగి ఆగి చెప్తా.

కాసేపు మౌనం తర్వాత తిరిగి తనే "యిబ్బటికే మా ఒదినయి నగలు బేంకులో వుండాయి. వాటికి నిరుడు వడ్డీగూడా కట్ట లా. వాటిగ్గూడా నోటీసులు అంపతాండారు. వోటికింగా జూలైదాకా టైముండాది. అయ్యో యిడిపీలాగదా. యియ్యి గూడా పోతాయి. నేను ఈను అంటాది భారతి. దుడ్డు కట్టక పోతే భూములు ఏలం ఏస్తారు. పరువు పోయినాంక వుంటేనేమి, లేకుంటే ఏమి అంటాడు ఆ అన్న..." గొడవకు కారణం వివ రించాడు శివరాం. ఆ మాటలు చెబుతున్న పుడు అతని గొంతులో బాధ.

"ఎంతుండాది బేంకులో? " అడిగాడు రామ చంద్ర.

"నాలుగెకరాలు పాస్‌బుక్కులెట్టి నలబై వేలు తెచ్చిన్నేం. రెండేండ్లయిపాయ. వడ్డీ మొదులు కలుపుకోని చానాగానే అయిం డాది"

"మాగ్గూడా బేంకులో యాభయి వేలుం డాది. మేం తీసుకోని రెండేండ్లయితాంది"

"అయితే ఎట్ల చేస్తారన్నా? "

"ఎంగటముని దెగ్గిరి యాబయి వేలు తెచ్చిండా. బోరేసేదానికి, సేద్దించేసే దానికి యిత్తనాలకు, ఎరువులకు, కూలీలకు గావా లని. బోరేసినాంక మిగిలిన దుడ్డు బేంకుకు కడ్తా. మళ్ళ సేద్యానికి ఎట్ల జేయ్యాల్నో అర్థం కాలా"

"మళ్ళా ఎంగటమునినే అడుగున్నా. రెండె కరాలు అడమానం పెట్టిండావు గదా. ఎకరా మడి ఎంత, యాభై అర్వై వేలుండ్లా. రెండెక రాలకు కలిపి యాభైవేలేగదా యిచ్చినాడు, యింగా యిస్తాడ్లేసలహా యిచ్చాడు శివరాం.

"అడగతా... ఏమంటాడో ఏమో వాడు" అన్నాడు ఇంకో బీడీని వెలిగిస్తా రామచంద్ర.

"ఏమంటాడన్నా. వూరికే యిస్తాడా. మడి పెట్టుకోనుండ్లా. వడ్డీ తీసుకుంటాంట్లా యిస్తాడ్లే అడుగు. యిట్లపోతాన్నా" అన్నాడు తమ పొలంవైపు పోయే దారివద్ద నిలబడుకోని.

"సరేప్పా..." అంటా రామచంద్ర తమ పొలంవైపు అడుగులేశాడు.

శివరాం కపిలతోలేనాటి జానపద గీతాన్ని పాడుకుంటా పోతాండాడు.

"శివరాంకు యింత నిబ్బరం ఎట్టొచ్చిందో. ఎన్ని బాధలున్నా ఎప్పుడూ హుషారుగా వుంటాడు. కపిలలేడుండాయి. గంగేడుం డాది. కపిలతోలేటిగా వుంటే నీళ్ళు కయ్యిలో పారతాన్నెంత సేపూ ఒగమనిషి బాయిలో నించి నీళ్ళను ఎల్లెస్తాండాల్సిందే గదా. బాయిలో వూట తగ్గిండేది, పెరిగిండేది ఎప్ప టికప్పుడు తెలుస్తాండేది మిషన్లు వచ్చినాంకనే గదా. బాయికి మనిషికి సంబంధం లేకుండా పాయ. ఈడ మోటరేసేసి ఆడేడో పోయి నీళ్ళు కడతాంటారు. ఈడ గంగమ్మ వూర తాందా లేదా అనేది ఆడికి యాడ కనిపి స్తాది. గంగమ్మను పట్టించుకోలేదనేమో. అలి గిండాది. అడుగడుక్కుపోతాండాది.

పదిమట్ల బావులు ఎండిపాయ.

ఇన్నూరు మున్నూరడుగులు బోర్లెండి పాయ.

గంగమ్మ ఎప్పుడు కరుణిస్తాదో ఏమో అను కున్నాడు రామచంద్ర. పొలం దగ్గరకు చేరేట ప్పకి బాగా వెలుతురు పరచుకునేసింది. బోరు దగ్గరకు పోయి మోటర్ వేసినాడు. కంప్రె జర్ మిషన్ డుర్రమంటా పని చేస్తాంది. పైపులోనించీ నీళ్ళు అరనిముషం నిముషం ఆగి ఒక్కసారిగా బుడుక్కుమంటా బిందె, అరబిందె నీళ్ళు బయటొస్తాండాయి.

మిరప తోటను చూశాడు. సగం తోట ఎండిపోయిండాది. పూతా పిందెలంతా రాలి పోయిండాయి. నీళ్ళు చాలడం లేదనీ సగం తోటకే కడతాండారు.

వరినారు వద్దకు వచ్చాడు రామచంద్ర. నారుండే కయ్యంతా అక్కడక్కడా నెర్రెలిడిసిం

డాది. రెండు వారాలు దాటింది నారుపోసి. బెత్తెడు ఎత్తుంది నారు. పచ్చగా నిగనిగలా డతా వుండాల్సింది. వాడుమొగం పెట్టిండాది.

గట్టుమీదుండే వేపచెట్టులోంచి ఒకపుల్ల విరుచుకుని పళ్లు తోమడం మొదలు పెట్టి నాడు. మిరప తోటను చూస్తాంటే బాధే స్తాంది రామచంద్రకు.

"దీనెమ్మ నాయాలి కరెంటు. సక్రమంగా వస్తాన్నింటే తోట ఎండిందదు కదా. పొద్దుకు వచ్చేదే ఆరేడు గంటలు. అదీ నాలుగైదు తడ వలుగా వస్తాంది. నిలపకుండా ఒకేతూరి కరెంటొస్తే కయ్యలో జానడెత్తు నీళ్లొస్తాయి. అప్పుడు పారగట్టుకుంటే మిరపతోట ఎందుకు ఎండతాది? వోడు కరెంటు అట్లిచ్చి సస్తే గదా. బోరేసినాంక బోర్లోనీళ్ళు బాగా పడి నాంక ఐదెకరాల్లో పంట బెట్టితే కరెంటు రోజుకు ఐదుగంటలే వుంటే ఎట్ల సరిపో తాయి నీళ్ళు. ఆ కరెంటు ఒగేసారి యిస్తే సర్దొస్తాయి నీళ్ళు. లేకుంటే నీళ్ళన్నే తిప్పలే!

నీటికయ్య వద్దకు వచ్చి నీళ్ళలో అరచేతిని నిలువుకు ముంచి చూసినాడు. మూడడ్డేళ్ళుం డాయి. పార తీసుకుని గట్టు తెంపి నీళ్ళను నారుమడికి మళ్ళించాడు.

ఎండిపోయిండే కాలవ నీళ్ళను ఆవురావురు మంటా పీల్చుకుంటాంది. నత్తనడక మాది రిగా పోతాండాయి నీళ్ళు. నీళ్ళ వేగాన్ని తగ్గి స్తాండాయని, కాలవలోని గడ్డినంతా చెక్కేసి నాడు. పదిబారల దూరంలోని కయ్యకాడికి నీళ్ళు వచ్చేదానికి ఐదునిముషాలు పట్టింది. నారుమడిలో పడిన నీళ్ళు ముందుకు పోవ డమే లేదు. ఎక్కడికక్కడ పగుళ్ళు బారిన నేల నీళ్ళను తనివి తీరా తాగుతున్నట్టుంది. కదలిక కంటికి కనిపించని విధంగా గడియా రంలోని గంటల ముల్లులా నీళ్ళు కదలుతు న్నాయి. కదలిక కనిపించని నీటి నడకను కళ్ళార్పకుండా చూస్తా నిలబడుకున్నాడు రామ చంద్ర. అతనికీ అనుమానంగా వుంది, కయ్యలో నీళ్ళు పారుతున్నాయా లేదా అని. అందుకనే నీళ్ళకు బెత్తెడు అవతల నిలబడు కున్నాడు నీళ్ళనే చూస్తా. ఐదు నిముషాల్లో నీళ్ళు ముందుకు వచ్చి పాదాలను చల్లగా తాకాయి. యిట్లయితే ఎప్పటికి పారేది కయ్య అనుకున్నాడు.

అంతలో కరెంటు పోయింది.

"ఛూ... ముండనాయాలి కరెంటు" అని తిట్టుకున్నాడు. స్విచ్ ఆఫ్ చేశాడు. తిరిగి కరెంటు వచ్చేలకు అరగంటయింది. అప్పటికి నీటి కయ్యలో నీళ్ళయిపోయి కాలవగూడా ఆరిపోయిండాది. మోటార్ వేసినాడు.

నిద్ర లేచిన సూర్యుడు తన ప్రయాణం మొదలుపెట్టి రెండుగంటలు దాటినట్టుంది.

ఏమింగా రాలేదే ఈల్లు అనుకుంటాం డాడు.

అంతలో దూరంనించీ లారీ ఇంజన్ శబ్దం వచ్చింది.

ఆ శబ్దం వింటూనే రామచంద్రలో ఒక విధమయిన అలజడి.

ఈ రోజు నీళ్ళు అంతు తేల్చుకోవాల. అయితే అట్ల, లేకుంటే యిట్ల. అంతే అనుకున్నాడు. అలా అనుకోగానే రామచంద్ర ఒంట్లో సన్నటి వణుకు. నీళ్ళు బాగా పడతాయి అని తనకు తనే ధైర్యం చెప్పుకున్నాడు.




పావు గంటకంతా బోరు లారీ వచ్చింద క్కడికి. వాళ్ళంతా ఏడుమంది వుండారు. వాళ్ళతో పాటు బాలకృష్ణ గూడా వచ్చాడు. నీళ్ళ బిందెను, సద్ది క్యారేజిని తీసుకొచ్చి చెట్టు కింద పెట్టారు.

"మీరంతా టిఫిను తిన్నేరా" వాళ్ళను అడిగాడు రామచంద్ర.

"ఆం... మాదందరిదీ అయ్యిండాదిలేన్నా.

మధ్యాన్నానికి చేపించు చాలు.

"నీసుండాలన్నో...మంచి పందెంకోణ్ణి గానీ, గుడ్లపెట్టను గానీ కోపించు" అన్నారు వాళ్ళు.

"నీళ్ళు పడాల్నేగానీ, మీరు కోరింది పెట్టనా..." రామచంద్ర బదులిచ్చాడు.

"దానికి ఎవురేం చేస్తార్లేప్పా. పడతాయనే అనుకుందాం. తొందరగా రెడీ చేయండి. బిన్నే ఐపోజేసుకోని మళ్ళా కమ్మారపల్లెకు పోవాల. మద్దెమద్దెలో కాఫీలు గావాలన్నా. ఉడుకునీళ్ళు పడకపోతే సరిగా పనిచెయ్యలేం' ' అన్నాడు సురేష్. అతనే దాని ఓనర్.

"ఎన్నిసార్లు తాగతారో తాగండిప్పా. మాకు నీళ్ళు పడాలంతే. రేయ్ బాలకృష్ణ. యింటికి పోయి మీ అమ్మకు చెప్పి కాఫీ పెట్టించుకోని రాపో..." గట్టిగా అరచి చెప్పాడు కొడుక్కు.

"ఎన్నిసార్లు నాయనా యింటికీ ఈడికీ తిర గతాం. రెండు లీటర్లపాలు, చక్కెర, కాఫీపొడి, గ్లాసులు, పాత్రలు అన్నీ తెచ్చేసినాం. వాళ్ళే కాచుకుంటారంటలే" అన్నాడు బాలకృష్ణ.

రామచంద్ర గబగబా నోరు కడుక్కోని, మోటర్ ఆఫ్ చేసి, సద్ది తాగినాడు.

"రాన్నా... టెంకాయ కొడుదువు"

ఒకసారి కొడుకువైపు చూశాడు. యింతవ రకు ఇంట్లో వాళ్ళందరూ టెంకాయ కొట్టారు. కొట్టంది వీడొగడే అనుకుని "నువ్వు కొట్టరా" అన్నాడు కొడుకుతో.

"నేనా..." ఆశ్చర్యంగా అడిగాడు బాలకృష్ణ.

"అవును. నువ్వే..."

"తొందరగా రాండన్నా" వాళ్ళు తొందర చేశారు.

గబగబా తండ్రీ కొడుకులు అక్కడకు వెళ్ళారు.

బోరు పాయింటు దగ్గర సదరంచేసి పసు పునీళ్ళు చల్లి, కడ్డీలు వెలిగించి, కొబ్బరికాయ కొట్టాడు బాలకృష్ణ.

"అబ్బ... కాయ దారంతో పట్టినట్టుగా, యాడేగానీ ముక్కపోకుండా పగిలిండాదన్నా. నీళ్ళు గ్యారెంటీ" సురేష్ చెప్పాడు.

"ఔనన్నా... ఈ మాదిరిగా కాయ పగిలిం తావనంతా నీళ్ళు బాగా పన్నేయి" అన్నారు మిగిలిన వాళ్ళంతా.

రామచంద్రలో ఉత్సాహం పెల్లుబికింది.

కర్పూరం వెలిగించి తండ్రీ కొడుకులు దండం పెట్టుకున్నారు.

బోరు వేయడం ప్రారంభించారు.

ఎండలో వాళ్ళతోపాటే కూర్చుని వుండాడు రామచంద్ర.

రాడ్డు భూమిలోకి దిగేకొద్దీ రామచంద్రలో ఆందోళన పెరగతాంది.

నీళ్ళు పడతాయో పడవో అని దిగులు.

భూమిని తొలుస్తూ, చుట్టూ పరిసరాలను తన శబ్దంతో అదరగొడుతూ, దుమ్ము తెర లను వెలువరిస్తూ, రాడ్డు భూమిలో లోపలికి చొచ్చుకుపోతా వుంది.

బోరు శబ్ధం విని చుట్టుపక్కల పల్లెలోళ్ళు ఒక్కొక్కరే రాసాగారు. దారెంటీ పోయేవాళ్ళు కూడా ఆగి, కొంతసేపుండి చూసిపోతున్నారు.

ఎండ విరగకాస్తాన్నా ఎవ్వరూ నీడకు కూడా పోలేదు

ఎండ వేడి ఒక పక్క గాలి రాక ఆకు కూడా కదలక ఉక్క మరోపక్క చెవులు చిల్లులు పడేలా బోరు శబ్దం యింకోపక్క ఏదో విపరీతం జరగబోతోందా అన్నట్టుగా వుందక్కడి వాతావరణం. రెండు వందల అడుగులు దాటింది. నీటి జాడలేదు. మూడు వందలు దాటింది. కొంత తడిమట్టి వచ్చింది.

"తేమమన్ను వస్తాండాదిన్నా. నీళ్ళు గ్యారెంటీ" అన్నారు ఒకరిద్దరు.

అప్పటినుంచి మరింత నిశితంగా చూస్తాం డాడు రామచంద్ర, పైకొచ్చే మట్టిలో నీళ్ళ కోసం. మరో యాభై అడుగులు దిగేప్పటికి తడిమట్టి పోయింది. మళ్ళీ నల్లటిమట్టి వస్తాంది. ప్రతి పది నిముషాలకు ఒకసారి మట్టిని, రంగును చూసి రకరకాల అభిప్రా యాలు చెప్తాండారు వచ్చిన వాళ్ళంతా.

రామచంద్రకయితే గుండె వేగం బాగా పెరి గింది.

వాళ్ళ మాటలు స్పష్టంగా విన్పించడం లేదు.

మనసెందుకో కీడు శంకిస్తా వుంది. అయినా సరే నీళ్ళు పడేదాకా వదలకూడదను కున్నాడు. గుండెను గట్టిపరచుకుంటాండాడు.

నాలుగు వందల అడుగులయింది. నీటి జాడలేదు. నాలుగు వందలా యాభై అడు గులు దాటింది. బండ తెగతాన్నెట్టు వుంది.

తెల్లటి మేఘంలా పొగచుట్టూ వ్యాపిం చింది. ముగ్గు పిండి మాదిరిగా బండపొడి పైన పడతాంది.

ఐదువందల అడుగులయింది. నీళ్ళు రాలేదు. అదే బండపొడి వస్తాంది.

యింగ నీళ్ళు పడవని తీర్మానించి చాలా మంది వెళ్ళిపోయారు.

సురేష్ గూడా బోరు వేయడం ఆపేసి "అన్నా, యాభై అడుగుల లోతు బండే తెగిం డాది. అంతసేపు తెగిందంటే యింగ బండే వుంటా దిన్నా" యింగ ఎంత లోతు ఏసినా వేస్ట్. ఆపేస్తామింగో" అన్నాడు.

రామచంద్రకు నారాయణ చెప్పిందే గుర్తుం డాది.

బండనెర్రిలో నీళ్ళొస్తాయన్నాడు. తప్ప కుండా పడతాయనుకున్నాడు.

"యింగో యాభై అడుగులు ఎయ్యండి" అన్నాడు.

"ఎందుకన్నా అనవసరంగా, రెండున్నర వెయ్యిపైన అయితాది. వృధాగదా" అన్నాడు సురేష్.

అతనికి యింక ఒక్క అడుగు వేయడం కూడా యిష్టంలేదు. నీళ్ళు పడవని పూర్తిగా నమ్ముతున్నాడతను. అందుకనే రామచం ద్రతో వద్దని చెపుతున్నాడు.

"లేదులే, మీరెయ్యండి. ,యింతే పొయ్యిం దంట. ఆ రెండున్నరెయ్యి ఏం బాగు చేస్తా ది. నీళ్ళు పడతాయనిపిస్తాంది. ఎయ్యండి" అన్నాడు.

తిరిగి ప్రారంభమయింది.

నీళ్ళు పడకపోతే. అడుక్కు యాభైరెండు లెక్కన ఎంత...! ఇరవై ఆరువేల పైన్నే అయి తాండాది.

అలా అనుకోగానే రామచంద్ర ఒళ్ళు ఒక్క సారిగా చల్లగా అయినట్టనిపించింది. కండ్ల ముందంతా మసకమసగ్గా అలికినట్టుగా కనిపి స్తాంది. ఎండ మాడుస్తాంది.

రామచంద్ర ఒళ్ళంతా చెమట్లు పడుతు న్నాయి.

అతని ముఖాన నీళ్ళు పడ్డంతో ఉలికిప డ్డాడు. మళ్ళీ మళ్ళీ పడుతున్నాయి నీళ్ళు. బోర్లోంచి నీళ్ళు దుంకతాండాయి. అక్కడున్న వాళ్ళంతా ఆనందంతో గట్టిగా కేకలేస్తాం డారు.

"అన్నా, రామచంద్రన్నో... నీ పంట పండిందన్నో" అంటాడారంతా.

కొందరు నీళ్ళు రుచి చూసి "భళే వుండాయి" అంటాండారు.

## దుగ్గిరాల గోపాలకృష్ణయ్య

'ఆంధ్రరత్న' దుగ్గిరాల గోపాలకృష్ణయ్య అకళంక దేశభ క్తుడు. కాంగ్రెస్ వాది. సాహసే కాదు.. సమయస్ఫూర్తితో అవతలి వారి నోరు మూయించగల ప్రజ్ఞాశాలి. 'రామదండు' పేరుతో యువకుల్ని కూడగట్టి వారితో ఉద్యమానికి ఊతమిచ్చినవాడు. ఆయన చతురోక్తులు, సమయస్ఫూర్తిని తెలిపే ఘట్టా లలో కొన్ని...



### జ్వరం.. పాణిగ్రహణం!

దుగ్గిరాల ఓసారి జ్వరంతో బాధపడుతున్నారు. విషయం తెలుసు కుని దువ్వూరి సుబ్బమ్మగారు చూడడానికి వచ్చారు. 'పాపం..జ్వరం ఎక్కువగా ఉన్నట్లుందే?' అంటూ చెయ్యి పట్టుకుని చూశారు.

'అసలే జ్వరంతో చస్తుంటే పాణిగ్రహణం కూడానా?' అని విసుగు నటించారు దుగ్గిరాల. ఆయన చమత్కారానికి అంతా ఫక్కున నవ్వారు.

రామచంద్రలో ఆనందం పగ్గాలు తెంచుకున్నింది. డ్రిల్లింగ్ చేస్తున్న దగ్గరకు వెళ్ళాడు. దోసిటితో మట్టినీళ్ళను పట్టుకుని కడుపునిండా తాగాడు.

నిలువెల్లా నీళ్ళతో, కన్నీళ్ళతో తడిసిపోతున్నాడు.

ఐదువందలా యాభై అడుగుల వద్ద డ్రిల్లింగ్ ఆపేశారు.




గలగలా చప్పుడు చేస్తా పైపులోనించి నీళ్ళు దుంకుతున్నాయి. ఎండ చురుకుదనాన్ని పొగమంచు తెలీనివ్వడంలేదు. పొలం గట్టు మీదున్న చెట్లలో పుల్లాయి బెదుళ్ళు కువకువలాడతాండాయి. గిడసబారిన కొబ్బరి చెట్లు నీటి జాడ రోజూ తగులుతుండటంతో పచ్చగా కళకళలాడుతున్నాయి. కొబ్బరి చెట్టు మట్టల పైన వాలి రెండు గోరింకలు ముచ్చట్లాడుకుంటున్నాయి.

నీళ్ళు పడ్డప్పటినుంచి రామచంద్రలో ధైర్యం పెరిగింది. ముఖంలో అది స్పష్టంగా కనిపిస్తాంది. పైపులో నించి దుంకుతున్న నీళ్ళు రెండుకయ్యల కవతల చడేవేసిండే కయ్యల్లోకి పోతాండాయి.

అంతవరకు మడికయ్యలోని నీళ్లలో ఒంటి కాలిమింద జపం చేస్తున్న కొంగలు రెక్కలు టపటపలాడిస్తా పైకి లేచాయి.

మిట్టకయ్యలోకి పోతున్న నీళ్లకు మట్టి అడ్డమేసి తగ్గు కయ్యలోకి మళ్లించాడు. తగ్గుకయ్యలో కూడా నీళ్ల బెత్తెడు లోతుండాయి.

దూరంగా కొడుకు రావడం గమనించి 'ఒగడే వస్తాండాడేంది. కూలోల్లు యాడ' అనుకున్నాడు రామచంద్ర గొణుగుతున్నట్టుగా.

అతడికి ఎందుకో అనుమానం వేసింది. యింకా కొడుకు అంత దూరంలో వుండగానే "కూలోల్లు యాడరా? " అన్నాడు గట్టిగా.

"రాలా నాయనా" అన్నాడు అంతే స్వరంతో బాలకృష్ణ.

"ఏమయిందిరా! రేత్తిరి దాంకా వస్తామంటాండిరే. తెల్లారేలకు ఏమయిందంట వాళ్లకు. ఈడ కాపెట్టుకోనుండ్లా మనం. అదేదో ముందే చెప్పింటే యింగెవర్నన్నా చూసుకోనుందుము గదా..." కోపంగా అరిచాడు రామచంద్ర.

"అందరూ మీటింగుకు పోయినారంట నాయనా. కాంగ్రెసోళ్లు మీటింగు కదా. మన ఎమ్మెల్యే పెద్దిరెడ్డి రామచంద్రారెడ్డి పిల్లంపినాడంట. మీటింగుకు వెళ్తే నూరో, యాబయ్యో దుడ్డిస్తారట. చానామందే పోయిండారు". దగ్గరకు వచ్చిన బాలాక్రిష్ణ వివరంగా చెప్పాడు.

"నిజమే, శివరాం నన్ను గూడా రమ్మన్నేడు. మనమేడ పోతాం. పోనీలే. చెరుకు గాబట్టి సరిపోయింది. రేపయినా నాటుకోవచ్చులే. కూటికి జరక్కపోయినా రాజకీయాలు గావాల ఈళ్లకు. రేపయినా వస్తారారా..."

"రేపొస్తార్లే ఎందుకు రారు? రేత్రికంతా తిరుక్కోని వచ్చేస్తారు"

" నువ్వు సద్ది తేలేదారా...? "

"తేలేదు నాయనా, అమ్మ యింటికే రమ్మనింది"

"ఈడ పనుండలేదంటరా చెట్లెక్కి ఆకంతా కొట్దొద్దా? మడిలో వేసి తొక్కాలగదా, సేద్దిం చేసేవాళ్లకు ఏ పొద్దన్నా పని లేకుండా వుంటాదా? నువ్వు గూడా యింటికి పోయి ఒగ కొడవలి తేపో. యిద్దరం కొడదాం" అన్నాడు రామచంద్ర.

బాలకృష్ణ యింటికి పోయి వచ్చేలకు, మిరప తోటకు నీళ్ల కట్టేశాడు రామచంద్ర.

కొడుకు వస్తానే సద్ది తాగాడు.

ఆ రోజంతా తండ్రీ కొడుకులు పొలం గట్ల మీదా, బాయి గడ్డమీదా వుండే చెట్లలోని

సన్నటి కొమ్మలన్నీ కొడుతూనే ఉన్నారు.

వంటపని ముగించుకొని వచ్చిన రమణమ్మ కిందపడిన కొమ్మలన్నింటినీ ఒకచోట వేస్తా వుంది. కొడుకు కొబ్బరికాయ కొట్టినాక వేసిన బోరులో నీళ్లు పడినప్పటి నుంచీ, రామచంద్రకు కొడుకు మీద కోపం తగ్గింది.

నీళ్లు కావలసినన్ని వుండాయి. ఐదెకరాలు మడుంది. ఒగడే కొడుకు. లక్షణంగా బతుక్కుంటాడులే అనుకుంటాండాడు.

నీళ్లు పడ్డప్పటి నుంచీ రెట్టించిన ఉత్సాహంతో పాతికేళ్ల యువకుడిలా ఉత్సాహంగా పని చేస్తాండాడు. సాయంకాలానికి కొమ్మలు కొట్టడం ఆపేశారు. అప్పటికింక రెండు చెట్లు మాత్రమే మిగిలాయి.

బుడ్డగా ఉన్న ఆకును చూసి "ఎంతుంటాది. బండాకు గూడా వుండదేమో" కొండ కన్నా పోయి కొట్టకస్తే బాగుండు" అన్నాడు రామచంద్ర.

"యింతాకుంది కదా నాయనా, చాలదా? "

"ఎంత ఆకేసినా నష్టం లేదురా. పచ్చి ఆకు మంచి సతవ గదా. మా చిన్నబ్బుడయితే ఈ ఈరియాలు, కాంప్లెక్స్‌లు యాడున్నేయి. అప్పుడంతా దిబ్బెరువు. ఆకే గదా ఏస్తాన్నేం. ఎప్పుడన్నా ఏపపిండి కలపతాంటిమి నీళ్లల్లో"

"మిరపతోటకు గదాబ్బా ఏపపిండి కలపతాన్నింది" రమణమ్మ కలగజేసుకునింది.

"మడికి గూడా ఏస్తాంటిమి లేయ్యే. ఒగో సారి వరి కర్రలు ఎండి పోతాంటాయి చూడు, నీళ్లున్నే గూడా... అట్లాంటప్పుడు కలపతాంటిమిలే"

"వుత్త టమేటా నారే పోసినావు. కొంచెం మిరపతోట గూడా ఏసుకుంటే బాగుండు. సంతలో అమ్ముకోనుండచ్చు వాడిక్కు గూడా వున్నిండు. యింతకు ముందంటే నీళ్లు లేక చానా ఎండిపాయ"

"మిరపతోటే ఎందుకూ... వంకాయలు, బెండకాయలు, మటిక్కాయలు అన్నీ ఎయ్యి... కాదే. అయ్యన్నీ ఏస్తే వోటిని అమ్మేదెట్లు? టమేటానే ఏసినామంటే లారీలో స్తాయి, మదనపల్లెకో మెడ్రాసుకో తోలచ్చు పని కొంచెం సులపగా వుంటాది. రేయ్ బాలకృష్ణా టమేటా నారుకు నీళ్లు పోసి నాలుగు రోజులయితాండాదే" అన్నాడు రామచంద్ర.

"బిందె లేదులే నాయనా, పద్దనికి తెచ్చి పోద్దాం"

"ఆ మిట్టమింద కయ్యలో నారు పొయ్యకుంటేసేం. కింద మిషను నీళ్లు పారే తావులో పోసిండచ్చు గదా యిన్ని నీళ్లు పెట్టుకోని బిందెతో పోయాల్సి వస్తాండాది" అంది రమణమ్మ.

"నీకేం తెలుసులేయ్యే, అది అచ్చొచ్చిన జాగా. మా నాయనోళ్ల కాలంలో గూడా ఆన్నే నారు పోస్తాన్నేరు. అందుకనే ఈసారి ఆన్నే పోసినా, ఈసారి చూసుకో పంట ఎట్లుంటాదో. ఇప్పటిదాంకా అన్నీ మంచి శకునాలే. ఈ సమచ్చరమే మనప్పులన్నీ తీరిపోవాల" తన పనిని సమర్థించుకున్నాడు రామచంద్ర.

"ఈసారి గాకపోతే యింగెప్పుడు తీరతాయిలే పాండి, మాటలు పెట్టుకుంటే మొబ్బయిపోతాది. పొద్దు పోతాండ్లా" అంది రమణమ్మ మధ్యాహ్నం తెచ్చిన పాత్రలను గంపలో పెట్టుకుంటూ.

"చానామంది కుళ్లుకుంటాండారు నాయనా, మనకు నీళ్లు పన్నేయని. రాజన్నోళ్లు గూడా బోరేస్తారంట ఆడ..." అన్నాడు చేతిని తమ బోరు మీదుగా చూపుతా బాలకృష్ణ.

"ఎయ్‌నీ ఎయ్‌నీ యింతకు ముందు రెండుసార్లు ఏసినాడు. మనకూ లేకుండా పాయ, వోనికీ లేకుండా పాయ. ఆశకు పోతే గోసిలో రాయి పడేది అంటే యిదేగదా. ఈసారి మన నీళ్ళు పోవులే. బండ పొరలో పన్నేయి గదా నీళ్ళు. వోడు వెయ్యడుగుల లోతేసినా మన నీళ్ళు పోవు" ధీమాగా చెప్పాడు రామచంద్ర.

"పచ్చగా ఉండే వోళ్లను చూస్తే కండ్లల్లో నిప్పులు పోసుకుంటారు. బోరుకాడ దిష్టి, టెంకాయ కొట్టండి" అంది రమణమ్మ,



గంపను నెత్తిన పెట్టుకుంటా.

"ఔనురా బాలకృష్ణా, పద్దనికి శనారం గదా. వద్దులే. మన్నాడు పద్దన్నే కర్పూరం మగిలించి, నిమ్మకాయ దిగదీసి, టెంకాయకు తుప్పు తీసేసి పగలగొట్టు"

"సరే రాండి అబ్బా కొడుకులు. మొబ్బయి పోతాండాది. చేతి లైటు గూడా లేదు" అంటూ యింటి దారి పట్టింది రమణమ్మ.

ఆమెను అనుసరించారు తండ్రీ కొడుకులు.

అందరూ యింటికి పోయేప్పటికి బాగా చీకటయిపోయింది.

అందరూ స్నానాలు చేసి, భోంచేసి పడుకున్నారు.

ఆ రాత్రంతా రామచంద్రకు కలత నిద్రే.

తొలి కోడి కూసింది. వెంటనే లేచి కూర్చున్నాడు రామచంద్ర. కండ్లు మండుతున్నాయి, పులుముకున్నాడు.

కొడుకు, కూతురు హాయిగా నిద్ర పోతున్నారు.

వాళ్లలో ఉండే నిశ్చింత తనలో లేదెందుకు అనుకున్నాడు.

భార్య వైపు చూశాడు. "ఏంబా కూర్చోనుండావ్" అడిగింది రమణమ్మ పడుకునే.

"కోడి కూసింది గదా... యింగ నిద్రెట్ల పడతాది" అన్నాడు బీడీ ముట్టిస్తా.

"కోడి కూస్తే... కరెంటొచ్చేది ఆరుకూ"

"ఔన్‌లెయ్యే... నాకు తెలీదా? కరెంటోడు పద్దన్నే నాలుగు గంటలే యిస్తాడు. ఆరు గంటలకే మడిలో దిగినామంటే కరెంటు పొయ్యాలకు యిత్తనం నాటేయచ్చు"

"మనకున్నెంత అక్కర కూలోళ్లకు ఉండద్దా? చలి గూడా ఎక్కువగానే ఉండాది. అంద

రికీ రాత్రే చెప్పినా. పాలబెల్లు కొడతానే వచ్చి లేపతానని, సరే అన్నేరంతా. నువ్వూ పడుకో... పాల బెల్లు కొడతానే లేద్దాం" అంది రమణమ్మ అటు తిరిగి పడుకుంటా.

జీవితంలో ఎన్ని ఒడుదుడుకులు, ఎంత కష్టాలు, ఎందరికి అప్పులు.

అయినా ఏమాత్రం బెదరని భార్యను చూస్తే రామచంద్రకు ఆశ్చర్యంగా ఉంటుంది. భార్యంత నిబ్బరంగా ఉండాలని ఎన్నిసార్లో అనుకున్నాడు. కానీ అతనికి అలా ఉండటం సాధ్యం కావడం లేదు. ప్రతి పని దగ్గరా ఆదుర్దా, అవుతుందో కాదో అనే ఆలోచన్లు.

బీడీ తాగేసి పడుకున్నాడు. పడుకున్నాగానీ వెంటనే నిద్ర పట్టలేదు. ఎప్పటికో నిద్ర పట్టింది. నిద్ర పడుతూనే పాల బెల్లు మోగింది. వెంటనే లేచి కూర్చున్నాడు.

బాలకృష్ణ పాలు పోసేసి వచ్చేప్పటికి కాఫీ తయారయింది. అప్పటికే కూలీలు అందరూ వచ్చేశారు. కాఫీ తాగి పొలం వద్దకు బయలు దేరారు. వణికించే చలి. యింకా పూర్తిగా వెలుతురు పరుచుకోలేదు. దారి పక్కన పొదల్లో కీచురాళ్ళు రొద పెడుతున్నాయి. అందరూ మాటలు చెప్తున్నారు. దారి పక్క నున్న పొలంలో మోటార్ పోతాంది.

"బిన్నే నడండి, కరెంటు వచ్చేసిండాది" తొందర చేశాడు రామచంద్ర.

అందరూ మడి వద్దకు చేరుకున్నారు.

రామచంద్ర మోటర్ వేసి నీళ్ళు కాలవలోకి మళ్లించినాడు. మూడించుల నీళ్లయినా తొలీ గా పారడం కావడంతో కాలవలో నిదానంగా పోతాండాయి. "యిత్తనం చెరుకులను కాలవ గడ్డల మింద ఇద్దరు పెట్టుకుంటా పోతాంటే, ముగ్గురు నీళ్లు పారతాండే కాలవలో నాటు కుంటా పోతున్నారు" అన్నాడు రామచంద్ర.

పదిగంటలకు కరెంటు పోయింది. అప్ప టికి యింకా ఒక కాలవ నాటడం మిగిలిపో యింది. "గబ్బు నాయాలి కరెంటు యింగో కాల్ గంట వున్నింటే నాటేసిందుమే" అన్నాడు బాలకృష్ణ.

కూలీలు ఆకలిగా ఉందనడంతో అందరూ యింటికి చేరుకున్నారు. అప్పటికి శారద వంట సిద్ధం చేసింది.

భోంచేశాక ఒక్కరోజు కూలి తీసుకుని వెళ్ళి పోయారు వాళ్ళంతా.

మరో రెండు రోజుల్లో టమేటా నాట్లేశారు. పది రోజులు గడిచాయి.

ఆ రోజు రామచంద్ర చాలా ఆనందంగా వుండాడు. చాలా కాలం తర్వాత ఐదు ఎక రాలూ సాగవుతోంది. చివరి రెండెకరాలు ఆ రోజు నాట్లేస్తారు.

రైతుకు తన పొలం మొత్తం పచ్చగా కని పించడంకన్నా ఆనందం ఏముంటుంది!

శారద, బాలకృష్ణ. రామచంద్ర వరినారు పెరికి కట్టలు కడతాండారు. ఎండ తన ఉని కిని స్పష్టంగా తెలుపుతా వుంది.

"ఏమిరా ఈళ్ళు యింకా రాలేదు. కనీసం ముప్పైమందన్నా కావాల. ఎంతమంది వస్తా మన్నేరు" కొడుకును అడిగాడు రామచంద్ర.

"మొత్తం ముప్పై రెండు మంది నాయనా, లెక్కకు చూద్దాం ఎందురొస్తారో. వాళ్ళూ నాట్లేయాలంటాన్నేరు"

"ఎవురంటరా యిప్పుడు నాటేది? నీళ్ళేడుండాయి వాళ్ళకు"

"దిగవీధి జయన్న కొడుకు చెప్పేసినాడంట, లక్ష్మయ్యకు. వాళ్ళకు గూడా నీళ్ళు బాగా వుండాయి గదా. మూడెకరాలు చేడకేసినా డంట"

"అయితే మనకొస్తారో రారో" అనుమానం వెలిబుచ్చాడు రామచంద్ర.

"ఎందుకు రారు... వస్తారులే నాయనా. రాత్రే అడ్వాన్స్ ఐదునూర్లు తీసుకున్నేరు. గ్యారెంటీగా వస్తార్లే"

"అదో,వస్తాండారు నాయనా"అంది శారద.

తండ్రీకొడుకులు అటువేపు చూశారు. గుంపులు గుంపులుగా మాటలు చెప్పుకుంటూ వస్తాండారు వాళ్ళు. వాళ్ళను లెక్కబెట్టాలని ప్రయత్నించాడు గానీ, సాధ్యం కాలేదు రామ చంద్రకు.

"ఏమ్మే, యిబ్బుటికి తీరికయిందా"

"యిబ్బుడే గదా మామా గొడ్లను ఎల్లదో లించేది" అంది రంగమ్మ.

"మాటలు బాగా నేర్చిండారు లేమ్మే. దిగండి దిగండి" అన్నాడు రామచంద్ర.

అప్పటికే ఎకరా నేలలో బారకొగటి లెక్కన నారుకట్టలు వేసి పెట్టారు. యూరియా బస్తా, కాం ప్లెక్స్ రెండు బస్తాలు తెచ్చిండారు. అవి రెండూ కలుపుకుని చిన్న గంపలో పోసుకు న్నాడు రామచంద్ర. దాన్ని మడికయ్యలోకి దిగి వర్సగా చల్లుకుంటూ పోతాండాడు.

కూలీలంతా ఇరవై ఎనిమిదిమంది వచ్చిం డారు.

అందరూ లంగాలు చీరతోపాటు గోసిలాగా వెనక్కు చెక్కోని కయ్యలోకి దిగారు.

వాళ్ళు అడుగులు పెట్టంగానే ఆకు కుళ్ళిన వాసన ఆహ్లాదంగా వచ్చింది.

"అబ్బా... మోకాళ్ళోతు దిగతాండాయి కాళ్ళు" అన్నారొకరు.

అందరూ తలా ఒక నారుకట్ట ఎడం చేతి లోకి తీసుకుని కుడిచేత్తో నాట్లేయసాగారు. ఏవేవో మాటలు చెప్పుకుంటున్నారు. పొడ వాటి కర్రకు రెండువైపులా నారుకట్టలను సమానంగా పేర్చుకుని, వాటిని తీసుకొచ్చి కయ్యలో వేస్తున్నాడు బాలకృష్ణ. శారద నారు పెరికి కట్టలు కడుతోంది.

ఒకామె పాట ఎత్తుకునింది. అందరూ ఆమెకు వంత పాడుతున్నారు.

పాటలంతా వేగంగానే పనీ జరగతా వుంది. పాటల్లో పడి శ్రమను మరచిపో యారు. ఆకలి, దప్పులు కూడా మరచిపోయా రు. శారద నారు పెరికి కట్టలు కడుతూనే వుంది. రామచంద్ర మందులు చల్లుతున్నా డు. బాలకృష్ణ నారు కట్టలు మోస్తాండాడు.

అందరినీ పాటలు పనులపట్ల పరుగులెత్తిం చాయి.

'న్నో...రామచంద్రన్నా... యింటికాడ ఒదిన పిలస్తాండాది. సంగటి ఎత్తుకోని వచ్చే దానికంట యిద్దర్ని అంపిచ్చు" అరిచాడు సహ దేవనాయుడు, తన చేనువైపు పోతూ. అతని అరుపుతో అందరూ పనాపి పొద్దుకల్లా చూసి నారు.

"యిద్దురు పోండి యింటికి" అన్నాడు రామచంద్ర.

జయమ్మ, సావిత్రి గట్టుకొచ్చి కాలవలో కాళ్ళు చేతులు కడుక్కుని పల్లెకు పోయారు. రమణమ్మ ఒక గంపలో కూరలు, పాత్రలు పెట్టుకుని ఎత్తుకునింది. వాళ్ళిద్దరూ సంగటి గంపలు చెరొగటి నెత్తిన పెట్టుకుని మడివ ద్దకు వచ్చారు.

అందరూ ఒడ్డుకు వచ్చి కాళ్ళూ చేతులు కడుక్కుంటా. అన్నో... ఒగచెట్లో గూడా ఆకులు లేకుండా నరికేసినారే. అన్నం తినేదా నికి కూసింత నీడ గూడా లేదే" అన్నారొకరు.

"నీడదేముండాదిలేమ్మా... పంట బాగొస్తే నీడలో వున్నెట్టే" బదులిచ్చాడు రామచంద్ర.

వేడి వేడి సంగటికి, వంకాయలు, టమే టాలు, కందిపప్పు వేసి పుల్లగూర చేసింది రమణమ్మ. ఒక పెద్ద పాత్ర నిండుకు మజ్జిగ తెచ్చింది. అందరూ తింటూనే "వక్కాకు లేదా మామా" అడిగింది రంగమ్మ.

రమణమ్మ ఆకులకట్ట, వక్కలు, సున్నం వాళ్ళ ముందు పెట్టింది. అందరూ వక్కాకు నములుతా తిరిగి కయ్యలోకి దిగారు.




ఆ రోజు ఏప్రిల్ ఒకటి.

ఎండ పెట్లగాస్తాంది. ఆకాశంలో అక్కడొ కటి అక్కడొకటి మేఘాలు కదిలీ కదలకుండా వున్నాయి. టమేటా తోటకు నీళ్లు కడుతున్న రామచంద్ర ఆకాశం వైపు చూశాడు.

అతనికెందుకో అనుమానం వచ్చింది, వానొస్తుందేమోనని.

తోటలోని కలుపు మొక్కలు పెరుకుతున్న భార్యను "మ్మేయ్... రమణా..." అంటా కేకేసినాడు.

"ఏంబా" అనిందామె తల పైకెత్తి.

"బాగా వుమ్మగిస్తాండాదే, వానేమన్నా వస్తాదా" ప్రశ్నించాడు భార్యను.

రమణమ్మ కూడా ఆకాశం వైపు పరిశీలనగా చూసింది. వుమ్మగిస్తాంది గానీ, మోడాలు లేవుగదా. ఎండల కాలం యిట్లేలే వుంటాది"అని తిరిగి తన పనిలో మునిగిపోయింది.

రామచంద్ర మళ్ళీ ఆకాశం కళ్ళా చూసినాడు. వంటికి పట్టిన చెమటతో చిరాగ్గా వుందతనికి. పది నిముషాల కొగసారి కాలవలో పారతాండే నీళ్ళు దోసిటతో ముంచుకుని తాగతాండాడు. పక్కనే వరి పైరులో కూలీలు కలుపు తీస్తాండారు.

యింతకు ముందు అక్కడొకటి అక్కడొకటిగా వున్న మేఘాలు దట్టంగా కమ్ముకుంటా తూర్పువైపు నుంచి ఎగబడతాండాయి. రామచంద్ర తోటంతా పార చూసినాడు. చెట్లంతా పూతా పిందే. 'ఈ టైంలో వాన పడితే ఏమన్నా వుందా? పూతా పిందే రాలిపోదా' అనుకుని దిగులుపడ్డాడు.

"రామచంద్రన్నో, తోట బళే వుండాదే. ఈసారి దుడ్డంతా నీదేలే" అంటా వచ్చినాడు సహదేవనాయుడు.

"ఆс ఏముండాదిలేప్పా, యియ్యి సక్రమంగా కాయలు నిలబడి, పెద్దయయ్యి, రేటొచ్చి దుడ్డు చేతికొస్తే గదా నమ్మకం" అన్నాడు నిరాసక్తంగా రామచంద్ర.

"యాట్నించబ్బా మద్దేన్నం కాడొస్తాండావే" అడిగింది రమణమ్మ.

"బాయికాన్నించే ఒదినా. మేం గూడా మడి కలస్తాండాం. టమేటా మాత్రం బళే మోసమయి పోయిండాదిన్నా. కడదాకా నమ్మేదానికి లేదు. వడ్లేసినా, వెనిగేసినా, కడాకు చెరుకేసినా కొంచెం రేటు అట్లో ఇట్లో వుంటాది. టమేటాలు ఎప్పుడు ఎంతుంటాదో తెలీదు. టమేటా ఎయ్యడమంటే యిస్పేటాకులు ఆడినట్టే గదా"

"నాకూ అదే భయంగా వుందిప్పా. నువ్వన్నా అరెకరా ఏసినావు. మేము రెండెకరాలు ఏసిండామే" ఆకాశం కళ్ళా చూస్తా చెప్పాడు రామచంద్ర.

"ఎంతయినా నష్టం నష్టమే గదా. ఏం ఒదినా నువ్వాగదానివే గడ్డి పెరకతాండావే. మనుషుల పెట్టగూడదా? "

"రెండుసార్లు అయ్యింది. నేనే వూరికే వుండలేక" నవ్వతా అంది రమణమ్మ.

"బాలకృష్ణ యాడికి పోయినాడు? "

"ఆ గబ్బు నాకొడుకు మాట నాకాడ ఎత్తద్దులే... వానంత సోంబేరి నాకొడుకు యింగోడు వుండడు. తిని తిరగమంటే తిరగతాంటాడు. పద్దన పొయ్యినాడు నూతన కాలవకు, క్రికెట్టు ఆడేదానికి. యింగా రాలా..." కొడుకు మీద యాష్టపోయినాడు రామచంద్ర.

"ఏందోన్నా, ఎవురు చూసినా క్రికెట్టే, మా పిల్లోల్లు గూడా అంతే. బడి లేకుంటే చెర్లోకి పోతాంటారు. బాలకృష్ణకు పెండ్లి చేసేయండి. చెప్పిన మాట యింటాడు" సలహా యిచ్చాడు సహదేవనాయుడు.

కొడుకు పెండ్లిమాట ఎత్తతానే రామచంద్రకు గుండెను పిండినట్లయింది. కాసేపు మౌనంగా వుండిపోయాడు.

"లేకపోతే, అంత పెద్ద పిల్లోడు. సేద్దింకాడికి రాకుండా పిల్లోని మాదిరిగా ఆడుకోను పోతాడా. ముక్కుతాడు ఏసేస్తే చెప్పిన మాట యింటాడు" సహదేవనాయుడే మాట్లాడాడు.

"ఎట్ల చేస్తాం సహదేవా? దుడ్డేడుంది? ఐదారేండ్లనించీ వరుపే గదా. ఒగరూపాయి ఆదీకం రాలా, పెట్టుబడే చేతికి రావడం లేదు! ఈసారన్నా పంటలు బాగొస్తే, యిద్దరికీ ఒగేసారి పెండ్లి చేద్దామనుండాం. వోనికి బిడ్డను చూసే పనిలే. మా పెద్దబామ్మర్ది కూతురుండాది"

"ఎవురన్నా? మదనపల్లెలో వుండాడే,

ఆయనా”

“ఆఁ... వాడే”

“వాళ్ళ పాప బాగుండాదిలే, చూసినా ఒగ సారి. వాళ్ళిచ్చే కట్నంతో మన పాపకు చేసే యండి”

“వోడు బామ్మర్ది గదా. ఎక్కువ ఏమడ గతాం. అబ్బటికీ కూతురు పెండ్లికని లక్ష రూపాయలు ఎత్తి పెట్టినాడు. పెండ్లి ఖర్చు లుబోను ఎంత మిగలతాది? దాంతో మన బిడ్డ పెండ్లి చెయ్యలేం గదా. యింగో లక్షన్నా గావాల. ఈసారి చేసేస్తాం లేప్పా” అన్నాడు కాస్త ధీమాగా రామచంద్ర.

“సరేన్నా, నేను యింటికి పోతాండా,” అని చెప్పి ఇంటిదోవ పట్టాడు సహదేవనాయుడు.

మేఘాలు ఆకాశమంతా దట్టంగా కమ్ముకో నుండాయి. మూడు గంటలు కాకముందే సాయంత్రం అవుతున్నట్టుగా వుంది. చల్లటి గాలులు వీస్తా వుండాయి.

ఖాళీ అయిన సంగటి గంపను తీసుకొని ఇంటికి బయలుదేరింది రమణమ్మ.

కాసేపట్లోనే వర్షం జోరందుకుంది. నిముష నిముషానికి పెరుగుతోంది.

వర్షంతో పాటు వడగండ్లు పడుతున్నాయి.

వడగండ్లను చూడగానే రామచంద్ర ఉలిక్కి పడినాడు. నెత్తిన పైపంచెతో టమేటా తోట దగ్గరకు పోయాడు. అప్పటికే అతను ముద్ద ముద్దగా తడచిపోయాడు. నెత్తిమీద నుంచి నీళ్ళు ముక్కుమీదగా కారతాండాయి. వంటి మీద గులకరాళ్ళ మాదిరిగా వడగండ్లు పడ తాండాయి. టమేటా చెట్ల నుంచి పిందెలు, పూత నేల రాలతాండాయి.

రామచంద్రకు భయమేసింది, బాధేసింది, దిగులేసింది.

ఎకరాకు నలభై కుంటలు... కుంటకు వెయ్యి... రెండెకరాలు. ఖర్చులన్నీ పోను నిక రంగా ఎనభైవేలు ఆదాయం తెచ్చే పంట.

టమేటా తోటకే పెట్టుబడి పద్దెదువేలు.

యింగా గుండెల మీద కుంపటి మాదిరిగా కొడుకూ, కూతురు వుండారు. వాళ్ళకు పెండ్లి చేయాల.

అప్పులమీద అప్పులయితాండాయి. ఒగ పంటా చేతికి రాదు. బేంకులోల్లు జప్తుకు వస్తామంటాండారు. ఎట్ల బతికేది? ఎట్ల బిడ్డ లను ఒగింటోళ్ళను చేసేది? ఎట్ల అప్పు లు తీర్చేది? దిగులయిపోయింది రామచంద్రకు. మేఘాలే కాదు... అతని గుండె కూడా పగిలి నట్టుండాది. కళ్ళనుంచి నీళ్ళు ధారాపాతంగా కారుతున్నాయి. వంగి కాలవలో పేరుకుపో యిన టమేటా పిందెలను చేతుల్లోకి తీసుకుని గుండెలకేసి అదుముకున్నాడు. విరిగిన లేత రెమ్మలను చూశాడు పిచ్చి పట్టినట్టయింది.

“నన్ను నిలవనా ముంచేస్తారా. నాకు కూడు మిగలనీరా” అంటా పిచ్చిపిచ్చిగా వదు రుతూ నాల్గుగైదు చెట్లు గబగబా పెరికేశాడు. అలాగే నేలమీద కూలబడి ఏడుస్తూ కూర్చు న్నాడు.

వడగండ్లు పడటం ఆగింది కానీ వర్షం జోరు తగ్గలేదు.

యిప్పుడే మేలు గదా. యింగో రెండు నెల్లు పోయినాంక వచ్చింటే మడిగూడా నాశ నం అయిండు. టమేటా తొలికాతిది. యింగా రెండు మూడుసార్లు పూతొస్తాది. కాపొస్తాది. నష్టం రాదులే అని ధైర్యం చెప్పుకున్నాడు. పెరికేసిన టమేటా చెట్లను తిరిగి పాతిపె ట్టాడు.

మడికయ్యలన్నీ వర్షపు నీటితో నిండిపో యాయి. చిన్న చిన్న కాలవలంటీ నీళ్ళు పొంగి పొర్లుతూ వుండాయి. ఎక్కడో కప్పలు బెకబెక మంటాండాయి. చలి వణికిస్తాంది. అలాగే తడుచుకుంటూ యిల్లు చేరాడు.

“ఏంబా అంత వానొస్తాంటే, తడస్తా అన్నే వుంటారా ఎవురన్నా, యింటికి వచ్చేసిండ గూడదా. తడిస్తే పడిశెం, జొరం రావా. యింత మనిషివైనావు గానీ, కొంచెం గూడా తెలీదు నీకు” అంటా రమణమ్మ భర్త చేతికి పైపంచె యిచ్చింది.

తడిచిన బట్టలు తీసేసి పొడి బట్టలు వేసు కున్నాడు. పైపంచెతో తల తుడుచుకుంటా

కూర్చున్నాడు మౌనంగా.

"యిందో... కాఫీ తాగు"

కాఫీగ్లాసు తీసుకుంటూ "వానతో చానా నష్ట మయ్యిందే" దిగులుగా అన్నాడు రామచంద్ర.

"దానికేం చేస్తాంలే. వాన పడిందంటే నేల శాంతగిస్తాది. బోర్లల్లో నీళ్ళూ తగ్గవు. మిగిలినో టియన్నా బాగొస్తాయి" అంది రమణమ్మ.

"ఈసారి టమేటా బాగున్నింది. ఎనభై వేలు నికరంగా వస్తాదనుకోనుంటి" కాఫీ తాగకుండా గ్లాసు చేతిలో పట్టుకొని అన్నాడు రామచంద్ర.

బాలకృష్ణ కూడా బట్టలు మార్చుకొని వచ్చి కాఫీ గ్లాసు తీసుకున్నాడు.

"నీకు ముందే చెప్పలా నేను... మనకు టమే టా అచ్చిరాదు వద్దని. మొత్తం మడినాటేసింటే పోయిండు. ఎట్లా నీళ్ళుండాయి గదా. నీళ్ళు చాలవనేటిగా వుంటే, చెరకు నాటేసిన్నా బాగుం డు. కాఫీ తాగు చల్లారిపోతాది" అంది రమ ణమ్మ.

శారద టివి చూస్తా కూర్చోనుంది.

"వద్లు చూడలా... కార్తీకం ఎంత జొల్లు పోయిండాదో. టమేటా అయితే ఆ ఇబ్బంది వుండదు గదా" తన పనిని సమర్థించుకున్నాడు రామచంద్ర కాఫీ తాగతా.

"ఔనౌను, రెండేండ్లకు ముందు ఎకరా నేలలో టమేటా ఏస్తిను. ఏమి పంట. ఎంతెంత కాయ లు ఒగోటి పట్టిడు పట్టెడున్నేయే. అబ్బుడే మాయ బతుకు" కాస్త విసురుగా ప్రశ్నించింది రమణమ్మ.

"ఆ సమర్చరమంటే ఎక్కువమంది ఏసిన్నేరు. రేటు లేదు యిబ్బుడట్ల కాదుగదా"

"అదే నేను చెప్తాండేది. మనకు టమేటా పంటే అచ్చిరాలా. అయినా ఈ యింట్లో నా మాట ఏ పొద్దు యిన్నేరని".

"యిప్పుడేందో నీయమ్మా. గబ్బుదానా. మద్దిస్తం పెట్టిండావు. నోర్మూసుకోని పనిజే సుకో" హుంకరించాడు రామచంద్ర.

పంట నష్టం అయ్యిండేది కళ్ళారా చూడ్డంతో చాలా బాధగా వుంది రామచంద్రకు. అదే సమ యంలో తన పనిని భార్య తప్పులు పట్టడంతో

## వయసు దాచే పళ్లరసాలు

చర్మ సౌందర్యాన్ని ఎలా పెంచుకో వాలా అని ఆపసోపాలు పడిపోతుంటారెం దరో. ఎన్ని క్రీములు వాడినా, ఎంత మంది డెర్మటాలజిస్టులని సంప్రదించినా ఫలితం లేక పోతోందంటూ ఉసూరుమం టుంటారు. ఇక మీదట అలా డీలా పడి పోనక్కరలేదండోయ్. క్రీముల్లో "ఆల్ఫాహై డ్రాక్సీ ఆమ్లాలు" ఉన్నవాటిని ఎంచుకుని వాడితే వయసు వల్ల వత్తిడి వల్ల వచ్చే



మచ్చలు, చారలు తగ్గుతాయని చర్మ నిపుణులైన అమెరికన్ శాస్త్రవేత్తలు చెబుతు న్నారు. ఇప్పుడు ప్రపంచ వ్యాప్తంగా తయా రయ్యే సౌందర్య సాధనాల్లో చర్మానికి సంబంధించిన క్రీముల్లో ఆల్ఫాహైడ్రాక్సీ ఆమ్లాల సాంద్రత ఎక్కువగా ఉండాలని నిబంధనలు పెడ్తున్నారు.

సిట్రస్ జాతికి చెందిన పళ్ల రసాల నుంచి ఈ ఆల్ఫాహైడ్రాక్సీ ఆమ్లాలను తయారు చేస్తారు. సూర్యరశ్మి వల్ల చర్మా నికి నష్టం కలగకుండా ఈ ఆమ్లాలు మృదుత్వాన్ని, ఆకర్షణీయతను అంది స్తాయి. మనకు అందుబాటులో నిమ్మ, నారింజ, కమలా వంటి సిట్రస్ ఫలాలు ఎన్నో ఉన్నాయి. ఆ పళ్ళ రసాలు వాడండి. అందంగా కన్పించండి.

భరించలేకపోయాడు. భార్యవైపు గుడ్లురిమి చూసి పండ్లు పటపటా కొరికాడు.

"ఆc...దానికేం తక్కువలే. రేయ్. ఆ లైట్లెయ్ అట్ట. మెబ్బుగా వుండాది. బియ్యం తో మెరికలు కనపడిసావవు. ఏరాల" కొడుకు తో అని చాటలో బియ్యం పోసుకురావడానికి లోపలికి వెళ్లింది రమణమ్మ.



6

"మ్మేయ్, బిన్నె పెరకాల మద్యేన్నం అయి పోతుండాది. లారీ వచ్చేస్తాది" అరిచాడు రామచంద్ర, కానుగ చెట్టుకింద కూర్చుని నలిగిపోయిన టమేటాలు తీసి పక్కన వేస్తా.

జెర్సీ ఆవులను పక్కనే వేరొక చెట్టుకు కట్టేసి, వాటి ముందర పచ్చిగడ్డి వేసిండారు. బాలకృష్ణ, శారద, రమణమ్మ టమేటాలను బుట్టల్లో పేరుస్తున్నారు.

ఏప్రిల్ నెల చివరి రోజులు.

ఎండ భగభగమనడం ప్రారంభించి చాలా రోజులే అయింది. పక్షులన్నీ చెట్ల కొమ్మల్లో ఒదిగి కూర్చుని నోర్లు తెరుసుకోనుండాయి. జెర్సీ ఆవులు గడ్డి తినకుండా కాళ్ళు చాపుకొని పడుకోనుండాయి.

తోటలో పదిమంది కూలీలు టమోటాలు కోస్తాండారు. కోసిన వాటిని గంపలో వేస్తు న్నారు. గంప నిండుతూనే ఎవరో ఒకరు తీసుకొచ్చి రామచంద్ర వాళ్ళున్న చోట దించేసి అక్కడున్న ఖాళీగంపను తీసుకుని వెళుతు న్నారు.

"ఏమన్నా, అందరూ మీరే మల్లుకున్నేరే" అంటా వచ్చినాడు సహదేవనాయుడు

"రా రా సహదేవా. మేమే మల్లుకోకపోతే ఎట్ల జరగతాదబ్బా, కూలీలకు గూడా దుడ్డు వస్తాదో రాదో చూడు. కేజీ పావలా, అద్దరూ పాయి పోతాంటే కూలోల్లను ఎంతమందిని పెట్టుకుంటాం? తోటలో గొడ్లు తోలేద్దామను కుంటి. మనసొప్పలా..." అన్నాడు రామ చంద్ర.

"అట్లనుకుంటే ఎట్లన్నా, రేటు ఒగోసారి కడాన రెండుమూడు వారాలు బాగుంటాది. అప్పుడమ్ముకొన్నే మన పెట్టుబడయినా వస్తాది గదా" అన్నాడు సహదేవనాయుడు, పక్కనే వుండే రాతిమీద కూర్చుంటా.

"ఆ ఆశతోనే యిబ్బుడీ పని చేస్తాండేది"

"మీరు కాయలు పెరికేసినారా? "

"పెరికేసినా ఒదినా... ఎంత... అరెకరానే గదా. గంపలకు పేర్చేసినాం. మీది అయిందా లేదా అని వచ్చినా. టైము రెండయితాండాదే. లారీ వస్తాండ్లా యింగ"

"వస్తాదిబ్బా. అందుకే గదా అన్నం కూడా తినకుండా పనిచేస్తాండాం"

కానుగ చెట్ల ఆకుల్లో సందులున్న చోటు నుంచి సూర్యకిరణాలు పడుతున్నాయి. ఆ వెలుతురు పడినచోట వుండే టమేటాలు రక్త వర్ణంలో మెరుస్తున్నాయి.

"బావా బాగుండావా" అంటా వచ్చాడు శేఖర్

"ఏంరా శేఖర్ ఎప్పుడొచ్చినావు? బాగుం డా... నువ్వు బాగుండావా. మీ అమ్మా నాయన బాగుండారా? " ప్రశ్నల వర్షం కురి పించినాడు సహదేవనాయుడు.

"బాగుండాం బావా. మీరు బాగుండారా. యిబ్బుడే యింటికి వచ్చినా. మా అక్కుండి నువ్వు టమేటా పండ్లు పెరికిస్తాండావని చెప్పె. నేనేదన్నా సాయం చేయాల్నేమో అని వచ్చినా. మీరు బాగుండారాన్నా. బాగుం డావా బాలకృష్ణ" అందరినీ పేరు పేరునా పలకరించాడు శేఖర్.

"బాగుండామప్పా" అన్నారంతా.

"ఈ రోజు బేస్తారం గదారా. డ్యూటీ లేదా? " అడిగినాడు సహదేవనాయుడు.

"లేదు బావా, ఎలక్షన్ డ్యూటీ మింద నగి

రికి పోయిన్నే. రేపుంటాది బడి"

"కచ్చేన్నా" అంటా ఖాళీగా వుండే బండ ను చూపించాడు బాలకృష్ణ.

శేఖర్ అక్కడ కూర్చున్నాడు.

మరికొంత సేపటికి టమేటాలు కోయడం, గంపల్లో పేర్చడం అయిపోయింది.

కూలీలందరూ తలా కొన్ని టమేటాలు తీసుకుని వెళ్ళిపోయారు.

టమేటాలు పేర్చిన గంపలకు సంచి పట్టలు వేసి దబ్బనం దారం తీసుకుని కుడు తున్నాడు బాలకృష్ణ. సమయం మూడు గంటలు దాటింది. ఎండలో త్రీవత తగ్గలేదు. చెట్టుకిందుండే ఆవులు "అంబా అంబా" అంటా అరస్తావుండాయి.

"వోటికి దప్పికగా వుండాదేమో. తొట్టికాడ నీళ్ళు తాపమ్మా" కూతురితో అన్నాడు రామ చంద్ర.

"ఎండ ఎట్ల గాస్తాండాది. తాగే నీళ్ళుండా యాన్నా ఈడ" అడిగాడు శేఖర్.

శారద లేచి ఆవుల వద్దకు పోయింది.

బిందెలో వుండే నీళ్ళు గ్లాసుతో ముంచి యిచ్చింది రమణమ్మ.

నీళ్ళు తాగి గ్లాసు యిస్తా "ఎంత వేడిగా వుండాయిక్కా నీళ్ళు" అన్నాడు శేఖర్.

రమణమ్మ అన్నం గంపను సంచి పట్ట మీద పెడతా అందర్నీ తింటానికి పిలిచింది.

తమకు వద్దన్నారు బావా, బావమరిది.

తొట్టి దగ్గరకు పోయి కాళ్ళూ, చేతులు కడుక్కొని వచ్చారంతా. శారద ఆవులకు నీళ్ళు తాపేసి వచ్చింది. విస్తరాకుల్లో అన్నం పెట్టి టమేటా బజ్జి వేసింది రమణమ్మ.

"అబ్బా యాడజూసినా యిదే కూరా. మా క్కూడా టమేటాలు తక్కువ రేటని వారంలో మూడు నాలుగు రోజులు ఈ కూరే చేస్తాండారింట్లో" అన్నాడు శేఖర్.

"మీకు మూడు నాలుగు దినాలే. మాక యితే రోజూ యిదే" అన్నాడు సహదేవనా యుడు.

"పండించినోళ్ళం మనమే తినకపోతే ఎట్ల? " అంది రమణమ్మ.

"గిట్టుబాటుండాదాన్నా" అడిగాడు శేఖర్.

"ఏం గిట్టుబాట్లే... మీ బావను అడుగు చెప్తాడు"

"గిట్టుబాటు యాడుందిరా... చేసిన కష్టం, పెట్టిన పెట్టుబడి, కరెంటు చార్జీలు అన్నీ బీటికే కదా. కడాకు యించేపు కాయలు పెరికినారే... వోళ్లకు కూలీలు గూడా రావడంలే ఈ టమేటాల్లో" అన్నాడు సహదేవనాయుడు.

"ఔను బావా... పేపర్లలో చూస్తాండా గదా... వాయల్పాడు మార్కెట్ యార్డుల బండి బాడుగలు కూడా రాలేదని రైతులు టమేటాలు రోడ్డు మిందే కుమ్మరించేసినారు"

"కుమ్మరించేయక ఏం చేస్తారు చెప్పు. కొందరయితే కాయలు కోసేదే ఆపేసినారు. తోటల్లో గొడ్ల తోలేసినారు" అన్నాడు బాల కృష్ణ.

"యింతగా నష్టం వస్తాంటే, ఈ పంట ఎయ్యకపోతేనేం? వేరే ఏదన్నా ఏసుకోవ చ్చుగదా? " ప్రశ్నించాడు శేఖర్.

"ఏదో బాగుపడతామని ఆశగదా... వడ్లే ద్దామంటే నీళ్లు చాలవు. వోటికీ నానారకాల రోగాలొస్తుండాయి. చెరుకు ఏద్దామంటే... సమచ్చరం పొడుక్కా నీళ్ళుంటాయనే నమ్మ కంలే. పొద్దుతిరుగుడు మనకు తెలీని పంట. దానిగ్గూడా గిరాకీ తగ్గిందంట. బయట దేశాల నుంచి నూనెలు దండిగా వచ్చేసినాయంటనే. పట్టుగూళ్ల మాట ఎందుకులే... పదేండ్లకు ముందు ఎంత రేటున్నిందో, యిప్పుడు అంతకన్నా కొంత తక్కువే వుండాయి గూళ్ళ రేటు. అయ్యి పంట బెట్టినోళ్ళు కూడా తనకలాడతాం డారు. మనకు బాగా తెలిసింది, బిన్నే అయి పోయేది యిదే గదా. జాక్‌పాట్ మాదిరిగా, రేటుంటే ఎకరాకు ముప్పై నలభై వేలొ స్తాది. యింగ ఏ పంటలో యింత అదీకం లేదు" అన్నాడు రామచంద్ర.

"శీతల గిడ్డంగులు ఏర్పాటు చేస్తారంటనే,

మళ్ళీ అంత బాధుండదు"

"ఏంటయ్యో... పండినోటియన్నీ కొంటా రా? " అడిగింది రమణమ్మ

"అన్నీ కొనురుక్కా... పండించినోటియన్నీ అక్కడ స్టోర్ చేస్తారు. అది ఫ్రిజ్జు మాదిరిగా పనిచేస్తాది. దాంట్లో పెట్టి రేటున్నెపుడు అమ్మ తారు. ఇప్పుడు అక్కడక్కడా శనక్కాయల గోడౌనులు వుండ్లా అట్ల" వివరించాడు శేఖర్.

"దాంట్లో ఎన్నని పెడతారు? "

"పెద్దయిలే ఒదినా... చిన్నయి గాదు. చానానే పడతాయి. అయ్యి కట్టినప్పటి మాటలే. ఓట్ల కోసం ఏమయినా చెప్తారు. నాకయితే నమ్మకం లేదు" అన్నాడు సహదేవ నాయుడు.

యింతలో బుర్రుమనే శబ్దం వినిపించింది.

"లారీ వస్తాండాదేమో" అంది రమణమ్మ.

గబగబా తండ్రీ బిడ్డలు అన్నం తిన్నారు. వాళ్ళు తినడం ముగించాలకు లారీ వచ్చింది. లారీని నిలిపి క్లీనర్, డ్రైవర్ దిగారు.

"ఏమప్పా గౌస్పీరా, యింతసేపటికా వచ్చేది? రెండుకే వస్తామన్నారే... మీ కోస రం కాపెట్టుకోనుండాం"అన్నాడు రామచంద్ర.

"ఏం చెప్పమంటావు లేన్నా మా బాధ. నడిదోవలో ముందు టైరు పంచరయింది. మార్చుకోనొచ్చాలకు ఈయరవయింది" అన్నాడు డ్రైవర్ గౌస్పీర్.

"ఎట్లుండాదిప్పా రేటు" అడిగాడు రామ చంద్ర.

రెండు రోజుల ముందుకన్నా అంతో యింతో పెరిగిందేమో అనే ఆశ.

"ఎట్లుండేదేముండాదిలేన్నా, సావనీదు బత కనీదు" అన్నాడు గౌస్పీర్.

రెట్టించి అడిగితే అతని నుంచి ఎలాంటి సమాధానం వినాల్సి వస్తుందో అని మౌనంగా వుండిపోయాడు రామచంద్ర.

అందరూ కలిసి గంపలను లారీలో పేర్చారు.

"ఎవురొస్తాండారున్నా" అడిగాడు గౌస్పీర్.

"సహదేవ వస్తాండ్లా మళ్ళా మేమెందుకులే" "నేను పోలేనులేన్నా. మా బామ్మర్ది వచ్చి నాడు గదా... బాలకృష్ణను పంపుదాం. మా తోటకాడ గంపలేద్దాం పాండి" అన్నాడు సహ దేవనాయుడు.

సహదేవ, శేఖర్, బాలకృష్ణ ఎక్కగానే లారీ వెళ్లిపోయింది, దుమ్ము లేపుకుంటా.

"నేను యింటికి పోతామ్మా" అంది శారద.

"అందరం పోదాం పాండి... ఈడుండి ఏం జేయాలింగా" అంది రమణమ్మ, మిగిలిన సంచులను చుట్టి గంపలో వేసుకుంటూ.

"మీరు పాండి, తోటకు నీళ్ళు కట్టాల గదా' ' ఐదుగంటలకు కరెంటిస్తాడు. పొద్దు పోయే దాకా తోటకు కడతా. మళ్ళ మడికి పొరగ ట్టేసి వస్తా" అన్నాడు రామచంద్ర.

అమ్మా కూతుండ్లు ఆవుల తోలుకోని, గంప లెత్తుకుని యింటిదారి పట్టారు.

రామచంద్ర కానుగ చెట్టుకింద నుంచి తోట లోకి పోయాడు. చెట్లనిండుకూ పిందెలుం డాయి. పెద్ద కాయలూ వుండాయి. అక్కడొ కటి అక్కడొకటి మాగిన పండ్లు కనిపిం చాయి. ఈళ్ళు సరిగా చూసి పెరికితే గదా అనుకున్నాడు.

వడగండ్ల వానొచ్చి పంటను సగం నష్టం జేసె, లేకుంటేనా యింగా బాగుండు తోట. తోట ఎంత బాగుండి ఏం లాభం? కాయ లకు రేటు లేదే. ఒకరకంగా అబ్బుడు వడ గండ్ల వానొచ్చి మేలే సేసింది. ఆ పూతా పిందే రాలిపోకుండా వున్నింటే, ఇబ్బుడు యింగా ఎక్కువ గంపలకయిండు కాయలు. వాటిని పెరిగేదానికి, ఏసక పోయేదానికి చానా దుడ్లు గావల్ల. లోడ్లు లోడ్లు కాయలు పెరికంపించి కూలీ గూడా రాకుండా వుంటే గుండె ఆగిపోయ్యిండదా. అందుకేనేమో దేవు డు ముందే సగం పంటను రాల్చేసినాడు. యింగన్నా రేటొస్తే బాగుండు. యింగా నెల పైన్నే కాపుంటాది. ముప్పై నలభై వేలన్నా వస్తాది. పెట్టుబళ్ళన్నా వస్తాయి అనుకు న్నాడు.

పొద్దు పడమర తిరిగినా ఎండ చురుగ్గా

వుండటంతో తిరిగి చెట్టు కిందకు వచ్చాడు. బాగా అలసటగా అన్పించడంతో పైపంచెను కిందపరచి పడుకున్నాడు. పడుకున్న కాసేప ట్లోనే నిద్ర పట్టేసింది.

"మామా... ఏం పడుకోనుండావే" మాటలతో ఉలికిపాటుగా లేచి కూర్చున్నాడు రామచంద్రం. ఎదురుగా షరీఫ్.

అమాయకంగా వుండే నవ్వు, వత్తయిన మీసకట్టు, తెల్ల శరీరం, ఆరడుగులకు రెండంగుళాలు తక్కువుంటాడు. ఎర్ర నిలువుచారల తెలుపు చొక్కా, నల్లరంగు ఫేంటూ వేసుకోనుండాడు. పాతిక ఏళ్లుంటాయి వాడికి.

"ఏం మామా... అట్ల చూస్తాండావు? "

"ఏం లేదులేవాయ్, మంచి నిద్రలో వుంటే లేపేసినావే. అరరే... కరెంటు వచ్చిండాది గదరా. రాజయ్యోళ్ళ మోటర్ పోతాండాదే. టైమెంతయిండాదిరా" అంటూ గబగబా లేచి పైపంచె విదిలించి భుజంమీద వేసుకుని, మోటర్ వద్దకు నడవసాగాడు రామచంద్ర.

"ఐదూ పది మామా" అన్నాడు రామచంద్రను అనుసరిస్తా షరీఫ్.

"పది నిముషాలయిందా కరెంటొచ్చి" అంటా మోటరేసి, పార తీసుకుని నీళ్ళను వెంబడిచ్చాడు.

షరీఫ్ కాలవ గట్టున నడుస్తా "ఈసారి తోట భళే ఉండాదే మామా" అన్నాడు.

ఈడు నన్నెందుకు మాటి మాటికి మామా అంటాండాడు. ఈ నెక్కను నేనేమన్నా పెండ్లి చేసుకున్నేనా. ఈ నెమ్మకు నేనేమన్నా అన్నదమ్మున్నే. ఎన్ని గుండెకాయలీనికి. శారద ఎనకంటీ పడతాండాడంటనే. శివరాం చెప్పినాడు. ఎవుడు యాడుండాల్నో ఆడుండాల. వయసు ఆడబిడ్డ వున్నెప్పుడు మొగపిల్లోల్లను యింటికి రానీగూడదు. మన బిడ్డ బంగారం గాబట్టి సరిపోయింది. లేకుంటేనా... ఈపాటికి ఎంత చెడ్డ పేరొచ్చిండునో. దండిద్దామంటే భయం. వయసు పిల్లోల్లు. ఎట్టపోయి ఎట్లొస్తాదో అనుకున్నాడు రామచంద్ర.

"యాట్నించి వస్తాండావు? "అని అడిగాడు.

## పుష్కర రాజకీయం

విజయవాడలో కృష్ణా పుష్కరాలు జరుగుతున్నాయి. వేలల్లో జనం వస్తున్నారు. అలాంటిచోట కాంగ్రెస్ సభ నిర్వహిస్తే ప్రచారం బాగా వస్తుందని గోపాలకృష్ణయ్య భావించారు. మిగిలిన నాయకులు ఒప్పుకోలేదు. నదిలో స్నానం చేసి ఎవరి దారిన వారు పోతారుగానీ సభకోసం ఎవరుంటారనేది వారి వాదన. జగమొండి గోపాలకృష్ణయ్య మాత్రం పట్టు వీడలేదు. అనుయాయులతో రెండు బెంచీలు తెప్పించి కృష్ణ ఒడ్డున వేయించి వేదిక తయారు చేశారు. తర్వాత సాధువేషంతో చిడతలు తీసుకుని 'రాజు వెడలె రవితేజము లలరగ.. కుడి ఎడమల ఢాల్ కత్తులు మెరియగ..' అంటూ దానిపై ఆట పాట మొదలెట్టారు. ఈ హడావిడికి జనం ఒక్కొక్కరే రావడం మొదలెట్టారు. అధికసంఖ్యలో వారు జమ కాగానే బ్రిటిషర్ల నిరంకుశత్వం, గాంధీజీ పోరాట బాణీని తన ఆటపాటల ద్వారా వివరించి జనాన్ని పోరుబాట వైపు ఆకర్షితుల్ని చేశారు దుగ్గిరాల గోపాలకృష్ణయ్య.

"చింతమాకలపల్లె సంతకు పోయింటి"

"ఏంరా...నువ్వు గూడా మీ నాయన మాదిరిగా చింతకాయ యాపారం చేస్తాండావా? "వ్యంగ్యంగా ప్రశ్నించాడు రామచంద్ర. "మరి చింతకాయ యాడరా అయితే. వొట్టి చేతులు వూపుకుంటా వస్తాండావే..."

"మా నాయన ఆట్నించి అట్లే కలకడ సంతకు పోతాడంట. నన్ను పద్దనికి ఇర్వై కేజీల చింతకాయ ఏసక రమ్మన్నేడు. అందుకనే యింటికి వస్తాండా"

"నువ్వేం చదివినావురా"

"నేను డిగ్రీ పాసయిండాగదా. ఎన్సై ఉద్యో

మూడు లక్షలా... ఏదన్నా బేంకుకు దుంకేస్తామని చెప్పగూడదా. కర్రి నాయాలికి అంత కట్నం యియ్యాలంటనా

గానికి పరీక్ష రాసినా. పరీక్ష బాగా రాసినాలే. ఈసారి గ్యారెంటీగా వుద్యోగం వస్తాది మామా" ఉత్సాహంగా చెప్పాడు షరీఫ్.

"వుద్యోగం వచ్చేదానికి యింగా ఎన్నిరోజులు పడతాదిరా"

"యింగానా... అన్నీ సక్రమంగా జరిగితే ఆరేడు నెల్లు పడతాది. లేకుంటే యింగా ఎక్కువ రోజులే అయితాది"

"అన్నా, లారీ ఆట్లే ఎల్లిపాయ. బాలకృష్ణ రేత్రిరికి పాల్లారీలో వస్తాననేడు..." అన్నాడు సహదేవనాయుడు బావమర్దితో కలిసి వస్తూ అతడితో పాటే వచ్చాడు శేఖర్.

"ఎన్ని గంపలున్నేయి మియ్యి"

"ముందే చెప్పినా గదాన్నా. పన్నెండున్నేయి. ఏందిరా షరీఫా ఈడుండావు? "

"సంతకు పోయివస్తాండా మామా..."

"ఔన్నా, మొన్నొచ్చిందే పాపకు సంబంధం. అదే... రాయచోటోళ్ళది. ఏమయింది? " రామచంద్రను అడిగాడు సహదేవనాయుడు.

"అదా, అయ్యేదేముండాదిప్పా. ఈ కాలం పెండ్లిండ్లంతా దుడ్లతోనే గదా, పిల్లోడు ఆడేయాన్నో అటెండర్ వుద్యోగం చేస్తాండాడంట. బాగా పెద్ద చదువులు చదివిండాడంటలే. నిదానంగా పెద్ద వుద్యోగం వస్తాదంటారు" అని ఆగాడు రామచంద్ర.

"అయితే ఏమనుకున్నేరు? "

ఒకసారి షరీఫ్ వైపు చూసి "అనుకునేదేముండాది"- వోళ్ళకు మూడు లక్షలు యియ్యాలంట. దాంట్లో రెండు లక్షలు కట్టి పెద్ద ఉద్యోగం తెచ్చుకుంటారంట. పిల్లోడు గూడా బాగ లేడులే. కర్రిగా వుండాడు" దిగులుగా చెప్పాడు రామచంద్ర.

"మూడు లక్షలా... ఏదన్నా బేంకుకు దుంకేస్తామని చెప్పగూడదా. కర్రి నాయాలికి అంత కట్నం యియ్యాలంటనా. ఆ పొద్దు నేను గూడా చూసినాలే వాళ్ళను. ఆ సంబంధం వద్దులే. మా శేఖర్ చెప్తాండాడు. వాళ్ళూర్లో మీవోళ్ళుండారంట. మావోనితో పాటు పనిచేస్తాడంట. చానా మంచోడు అంటాండాడు. మాట్లాడమన్నే" అన్నాడు సహదేవనాయుడు.

"ఔన్నా, నేను పనిచేసే స్కూల్‌లోనే చేస్తాండాడు. ఒగడే కొడుకు. ఆడబిడ్డలు లేరు. వుండే వాళ్ళేం కాదుగానీ, తిండికి లోటు లేదు. యిప్పుడీ అబ్బాయికి ఉద్యోగం వచ్చింది గదా. బాగనే వుండాదిప్పుడు. అదో... ఆ పిల్లోని మాదిరిగా వుంటాడు. చానా నెమ్మదస్తుడు. పెద్దోళ్ళకు విలువిస్తాడు. సిగరెట్టు, మందూ అలవాట్లు లేవు. అంతా నా మాదిరిగానే అనుకో" అన్నాడు శేఖర్.

"అట్లా వోళ్ళు కట్నం ఎక్కువడగతారు కదాప్పా" అన్నాడు రామచంద్ర బాధగా.

"అదేం లేదన్నా. నాకు వాళ్ళమ్మ బాగా తెలుసు. నాయన కాలం చేసిండాడు. అమ్మా కొడుకూ చెప్పేదొగటే. పాప బాగుండాల. మంచి సంప్రదాయం వుండాల. మట్టూమర్యాదా తెలిసిండాల. కట్నం ఎక్కువేం పనిలేదంట"

"పాపను నువ్వు చూడలేదంటరా... మద్యాహ్నాం టమేటాలు గంపల్లో ఏస్తాన్నింది"

"ఔను బావా, పాప బాగుందని చూసే చెప్తాండేది"

"సహదేవునికి తెలీందేముండాది మా సంగతి. కావాలంటే వూర్లో గూడా విచారించుకో, మేం ఎట్లా వోళ్ళమో తెలుస్తాది. అయితే ఈ సంబంధం కుదిరేటిగా చూడు నాయనా, నీకు పుణ్యముంటాది" అన్నాడు అభ్యర్థనగా రామచంద్ర.

"తప్పకుండాన్నా. ఈ సంబంధం గ్యారెంటీగా కుదరతాదిలే. నేను పోతానే వాళ్ళతో మాట్లాడి ఎప్పుడొచ్చేది ఫోన్ చేస్తా. లేదంటే లెటర్ రాస్తాలే" అన్నాడు శేఖర్.

"మా పరిస్థితి బాగ లేదప్పా..." అంటున్న రామచంద్ర మాటలను మధ్యలోనే అడ్డు కుంటా "మా బావ అంతా చెప్పినాడులేన్నా. సేద్యం చేసే వాళ్ళందరి పరిస్థితీ అట్లే వుండా దిలే. మా బావ గూడా అంతేగదా. పోదాం బావా యింగ" అన్నాడు శేఖర్.

"సరేన్నా, మొబ్బాయితాండాది. వస్తాండలా నువ్వా" అన్నాడు సహదేవనాయుడు.

"లే యింగా. మడికి నీళ్ళు కట్టాల, మీరు పాండి" అన్నాడు రామచంద్ర.

షరీఫ్‌తో "రారా పోదాం" అంటూ సహదే వనాయుడు పల్లెవైపు అడుగులేశాడు. అతడ్ని అనుసరించారు షరీఫ్, శేఖర్.

మసక చీకట్లు కమ్ముకుంటున్నాయి.

వెళ్తున్న వాళ్ళను చూస్తున్న రామచంద్ర ముఖంలో చీకట్లు తొలగుతున్నాయి.

పున్నమి దగ్గరలో వున్నట్టుంది. చంద్రుడు పదిబారల ఎత్తులో కళకళలాడుతాండాడు.

ఆ టీచరు సంబంధం కుదిరితే బాగుండు. శారద జీవితం బాగుపడతాది. పెద్ద బిడ్డను సేద్యగానికి యిచ్చినాం. ఏం సుఖపడతాంది? రేయింపొగులూ కష్టమే గదా. ఈ బిడ్డకు అట్లా కష్టాలొద్దు. పెండ్లి బిన్నే కాందానికి మంచి సంబంధమే వస్తాండాదిలే. అట్లే వోన్నిగూడా ఒగింటోన్ని చేసేస్తే ఆడికి నా బాధ్యత తీరిపోతాది. అంతటితో తీరిపో తాదా... అప్పులుండ్లా. అప్పులు తీరద్దా. అప్పులదేముండాదిలే. బిడ్డకు కట్నం లేకుండా పెండ్లయిందంటే. వోనికి లక్ష కట్నం యిస్తా రు గదా... నీళ్ళు బాగుండాయి. రెండు మూడేండ్లలో అప్పులన్నీ తీరిపోవా... మళ్ళ కొడుకూ కోడలూ సేద్దిం చేసుకుంటాంటే కాలు మింద కాలేసుకోని కూచ్చోని తినాల. యింగ కష్టపడలేను. ఈపులో నొప్పి వస్తాం డాది. అప్పుడప్పుడు మోకాళ్ళ నొప్పులొస్తాం డాయి. యింగెన్ని రోజుల్లే అనుకున్నాడు రామచంద్ర.

* * *

అది మే నెల. యింట్లో వుక్కపోత. ఫేను వేసుకుందామంటే కరెంటు సక్రమంగా వుండ కపోవడంతో అందరూ మిద్దె మీద పడుకోను న్నారు.

దిగవీధిలో కుక్కలు మొరగడంతో రామ చంద్రకు హఠాత్తుగా మెలకువ వచ్చింది. అప్పటి నుంచి నిద్ర రాలేదు.

'ఉగాది పండక్కు పెద్దకూతురు వచ్చింది. పెద్ద చైను చేపీలేదని అలిగిపోయింది. పెండ్లికి మాటిచ్చినాం. ఏం చేసేది? అబ్బు డు చెనిగి బాగున్నింది. నికరంగా నూరు మోటలు అయితాయనుకుంటిమి. నూరు మోటలయింటే ఎబ్బుడో చేపిచ్చిందుము. యిందాకానా. వాన ఎనిక్కి గొట్టి పన్నెండు మోటలాయ. అయ్యా అంతా జొల్లు.

ఎవరి బాధలు వాళ్ళయి. ఏం చేసేది...

అత్తగారు అడగతాంటారు. ఆ మాత్రం తెలీదా సర్ది చెప్పుకునేది.

యింగా చిన్నమ్మికి పెండ్లి జేయాల. ఎంత వుతాదో ఏమో. ఈసారి వడ్లు, చెరుకు బాగనే వుండాది. దేవుడు దయబెట్టి అన్నీ సక్రమంగా జరిగితే ఈసారి యిద్దరికీ పెండ్లి జేయాల. బాలకృష్ణకు పిల్ల పిచ్చి పట్టుకున్నెట్టుంది. వోన్ని చూస్తాంటే భయంగా వుండాది. సక్ర మంగా చదువుకోనుంటే ఈ తిప్పలున్నిండవు. చదివినా వుద్యోగాలు యాడొస్తాండాయి నాయనా అనె. వుద్యోగాల్లోంచి తీసేస్తాంటే చదువుకోని ఏం చేసేది, దుడ్డు దండగ కదా అనె. వోని బతుకు ఏమయితుందో ఏమో. యిబ్బుడే యిట్లుండాది సేద్దిం. యింగ ముం దు ముందు నీళ్ళే వుండవంటా వుండారు. తల్చుకుంటాంటేనే భయమేస్తాండాది.'

"థూ గబ్బునాయాలి చీటీగలు' అనుకుంటా చేత్తో చెవుల వద్దకు వచ్చిన దోమలను తోలాడు.

లేచి కూర్చున్నాడు. దిండు పక్కన పెట్టు కున్న బీడికట్టలోంచి ఒక బీడీని తీసి వెలిగిం చాడు. నోటి నిండుకు పొగ లాగాడు. వూపి రాడకుండా దగ్గు వచ్చింది. బీడీని పక్కన పెట్టేసి రెండు చేతులతో కడుపు పట్టుకోని



దగ్గుతూనే కూర్చున్నాడు.

"బీడీలు తాగద్దంటే యింటావా...?" అంటూ యిటు తిరిగి పడుకోనున్న రమణమ్మ అటు తిరిగి పడుకుంది.

కాసేపు దగ్గాక పక్కనే వున్న చెంబులోని నీళ్ళు గటగటా తాగాడు. ఆరిపోయిన బీడీని తిరిగి వెలిగించాడు. అలవాటు ప్రకారం మళ్ళీ పొగ ఎక్కువ లాగాడు. ఈసారి ముందంత దగ్గు రాలేదు.

బీడీ తాగుతా చంద్రున్ని చూశాడు. పడుకోనున్న భార్యను చూశాడు.

'...నా రమణీ... రమణమ్మా... ఎంత బాగున్నావే పెండ్లప్పుడు. నిండు చందమామ మాదిర్తో గదా వున్నేవు. యిబ్బుడు... ఆ చందమామ మాదిరిగా అయిపోయినావు గదే- నన్నెందుకే పెండ్లి చేసుకున్నేవు. నిన్ను సింహాసనం మింద కుచ్చోబెడతానన్నే గదా. నువ్వేమన్నేవు. సింహాసనాలేం వద్దు. నీ గుండెల్లో పెట్టుకో చాలన్నేవు... గదా. గుండెల్లో పెట్టుకుంటే ఏమొస్తాదే... బువ్వ దొరకదు. ఎన్నాళ్ళు పస్తులున్నేవే. ఎన్నెన్ని తిప్పలు పడతాండావే... ఎంతెంత బంగారుం వదులుకున్నేవే... నేను ఎంత దుడ్డు సేద్దానికి తగలబెడతాన్నే, ఏ పొద్దేగానీ ఒగ మాటనలేదు గదే... ఒక చీరడగవు, ఒగ రైకడగవు... వున్నికాడికి గుట్టుగా వుంటావు... ఎందుకే నాతో... నీకెవరన్నా ఉద్యోగస్తుడయింటే బాగున్నిండే రమణి... నేను సుఖపెట్టలా నిన్ను. యింగన్నా మన బతుకులు బాగుపడితే చాలు. టమేటా పాయలే... అబ్బుడే నీ మాట యినింటే ఈ నష్టం వున్నిండదు. యింగ టమేటా ఎయ్యనులే. ఈసారికి, రేపుసారికి అప్పులన్నీ తీరిపోతాయి. చిన్నమ్మికి, పెద్దమ్మికి, నీకు... ఒగేసారి పెద్ద చైన్లు చేపిస్తా. నాగ్గూడా వుంగరం చేపించుకుంటా. ఎర్ర రాయిదా, పచ్చ రాయిదా... పచ్చరాయిదే బాగుంటాదిలే.

"కొక్కొరొకో..." అంటా ఎవరింటి దగ్గరో కోడిపుంజు కూతేసింది



ఓయమ్మా... కోళ్ళు కూతేస్తాండాయి... కరెంటు వచ్చి చానా సేపయిండాదా. శివరాం రానేలేదే అనుకుంటూ గబగబా లేచాడు రామచంద్ర.

రాముని గుడి ముందర కుక్కలేవో మొర గతావుండాయి.

"భౌయ్...భౌయ్... నీయమ్మా... పోండే అవతలకి. దొంగలను బళే పట్టాయియ్యి" అర స్తాండాడు శివరాం.

రామచంద్ర పల్లెనంతా పరిశీలనగా చూశాడు. ఎక్కడా లైటు వెలగలేదు.,

"రామచంద్రన్నో... రా పోదాం" కింద నుంచే అరచినాడు శివరాం.

బీడికట్ట, అగ్గిపెట్టెను బనీను జేబులో వేసు కుని, పైపంచెను భుజం మీద వేసుకుని కిందకు వచ్చాడు రామచంద్ర.

"ఏంనా... ఒక్యాతకే వచ్చేసినావే"

"చానా సేపట్నించీ మేలుకునే వుండా"

"ఏంనా... ఎట్ల బతకతామో అనా... యింగేం భయమొద్దులేన్నా... కాంగ్రెస్ వచ్చే సింది గదా... రాజశేఖర్‌రెడ్డి ముఖ్యమంత్ర యితానే ముందుగా ఉచిత కరెంటుపైన సంతకం చేసెనే" అన్నాడు ఉత్సాహంగా శివరాం.

"ఏమోలేప్పా., యిదే మాదిరిగా వుంటారం టావా కడంతరమూ... రాజకీయాల్లో వుండే వోళ్ళు, వూసరబెల్లి అట్లాటోళ్ళు యింతకు ముందు ఎందర్ని చూడలా"

యిద్దరూ పొలంవైపు నడచుకుంటా వెళుతు న్నారు.

చింతచెట్టు కింద కుక్కలు భౌభౌ అంటా అరవడం మొదలుపెట్టినాయి. ఎవరిదో గేదె పరుగులు తీస్తాపోయింది. దాని వెంట పన్నెయి కుక్కలు అరస్తా. చంద్రుని గుడ్డి వెలుతురును దారిపక్క నుండే చెట్లు అడ్డగిస్తు న్నాయి. బాగా చీకటిగా వుండి, ముందు

ఏమున్నది కన్పించడంలేదు. అలవాటయిన దారి కాబట్టి యిద్దరూ చకచకా నడుస్తు న్నారు. దూరంగా గుట్టలో నక్కలు అరుస్తు న్నాయి. చింత చెట్లలో గుడ్లగూబలు అరుపు లతో తమ వునికిని చాటుకుంటున్నాయి.

"ఈసారి మేం గూడా లోను తీసుకోని బోరేయాలన్నా" అన్నాడు శివరాం నడుస్తూ.

"ఎయ్యండప్పా... నీళ్ళు పడితే బాగు పడ తారు గదా" అన్నాడు రామచంద్ర.

"మీ తోటలు ఎట్లుండాయన్నా?"

"టమేటో వూడ్చిపోతుండాది. అదయితేనే ఈసారి అంతా మడి నాటేద్దామనుకుంటాను. యిబ్బుడు మరీ బాగుండాది. చెరకూ బాగుం డాది"

కాలుకు రాయి తగులుకోని ముందుకు పడ బోయి నిలదొక్కుకున్నాడు రామచంద్ర.

"జాగ్రత్తన్నో... చేతిలైటు తెచ్చుకోనుండా ల్సింది. వచ్చేసినాం"

"మా ఇంట్లో వుండాది గానీ బ్యాటరీలు అయిపోయిండాయి"

"మేం గూడా నీళ్ళు పన్నేయంటే మడే నాటుతాంనా. మీరూ ఆ పనే చేయండి. నడి కారు గదా. బాగొస్తాది పంట. జాల్లు పోవు. టమేటాలు ఎన్ని రోజులుంటాయన్నా"

"అయిపోయినాలే! యింగ రెండు వారా లుంటాయేమో"

"నారు పోసిండారా"

"లేదింగా. వడ్లేడియి. ఎవుర్నన్నా అడగాల"

"మా యింట్లో గూడా లేవన్నా. ఎంగట మునన్నను అడగ్గాడదా"

"అదే చెయ్యాల. యింగా ఎవుర్నన్నా యిద్దరి ముగ్గుర్ని అడిగి చూస్తా. యాడా దొరకలేదంటే వాని దగ్గరే తెచ్చుకుంటా"

"వుగాదికి విజయ వచ్చిన్నిందే. వాళ్ళూ సేద్దిమే గదా చేస్తారు, అడగలా"

"లేదప్పా. వాళ్లదీ మనట్లా పరిస్థితే. నీళ్ళుం డద్దా దేనికయినా"

"అల్లుడు వచ్చినట్టు లేదేన్నా"

చీకటంతా దట్టంగా పరచుకోనుంది. కరెంటు లేకపోవడంతో కనుచూపు మేరలో ఎక్కడా వెలుతురు లేదు. ఆకాశంలో నక్ష త్రాల మినుకులు తప్ప.

"రాలా... అలిగినాడంట. విజయకు పెద్ద చైను పెడతామని మాటిచ్చిన్నేం. పెండ్లబ్బుడే చెప్పిన్నేంలే. ఈసారి పంటలో యిస్తామని పంటే రాలా. అప్పట్నించి. ఎప్పుడూ... తొంబై తొమ్మిది ఆగస్టులో పెండ్లయిందిప్పా. అప్పట్నించి పంటలేడొచ్చినాయి" దిగులుగా అన్నాడు రామచంద్ర.

"అందరి పరిస్థితీ అంతే గదన్నా. మా అన్న కూతురికి పెద్దమ్మికి, నాలుగేండ్లప్పుడే పెండ్లి చేయాలనుకోనుంటిమి. వరసగా వానలు పడలా. బోర్లు ఎండిపోతాండాయి. గమునయిపోతిమి. పెండ్లి ఎట్లా చేస్తాంనా పంటలు రాకపోతే..." ప్రశ్నించాడు శివరాం.

ఇద్దరి పొలాలకు పోయే దారులు విడిపో తాయక్కడ. అక్కడక్కడ వ్యవసాయ బావుల వద్ద లైట్లు వెలుగుతున్నాయి.

రామచంద్ర తమ పొలం వైపు నడిచాడు.

అక్కడక్కడ బావుల వద్ద మోటార్ల చప్పు డు... నీళ్ళు దుంకుతున్న చప్పుడూ అస్పష్టం గా విన్పిస్తా వుంది. పల్లెలో మళ్ళీ కోడి పుంజులు కూతేశాయి. ఐదు నిమిషాల్లో బావి వద్దకు చేరుకున్నాడు. మోటర్ వద్ద అరవై వోల్టుల బల్బు వెలుగుతోంది. చుట్టూ చీకటి కావడంతో ఆ వెలుగు ఎక్కువ దూరం పరచుకోవడంలేదు. పైరు మీద నుంచి వస్తున్న గాలి చల్లగా ఉంది. మొలతాడుకున్న తాళంచెవి విప్పదీసి స్టాటర్ బాక్స్ తాళం తీశాడు. పచ్చబటన్ నొక్కాడు. బుర్రుమనే శబ్దంతోపాటు నీళ్ళు జలజలమంటూ దుంకాయి. అక్కడేవున్న పారను తీసుకుని నీటివెంట పోయాడు. వరి పైరులోకి నీళ్ళు పోగానే వచ్చి గట్టున నిల్చున్నాడు.

నీళ్ళు దుంకే శబ్దం, మోటార్ శబ్దం తప్ప అంతా నిర్మానుష్యంగా వుంది.

రామచంద్రకు ఎందుకో దిగులనిపించింది.




సేద్దిము. అప్పులు... కూతురు... కొడుకు... ఏదన్నా మనస్సుకు నిమ్మళం చేస్తాందా. దేన్ని తల్చుకున్నా బాధే. ఎట్ల బతికేది అనుకున్నాడు రామచంద్ర.

మనసు ఒక విధమయిన స్తబ్దతకు లోనయింది. మౌనంగా, నిరాలోచనగా కూర్చుండిపోయాడు.

"ఏంబో, ఈ పొద్దున్నా పోవా? పండక్కు బిడ్డోల్లు వస్తారు. యిట్లే పిచ్చోని మాదిరిగా వుంటావా? " అరిచింది రమణమ్మ.

యింకా పూర్తిగా తెల్లవార లేదు.

యిళ్లముందు ఆడవాళ్లు చెత్త వూడుస్తున్న చీపురు శబ్దం విన్పిస్తా ఉంది. చింతచెట్టు మీద కాకుల గోల మొదలయింది. కోళ్లు కూతలేస్తాండాయి. ఆకాశంలో మేఘాలు వుత్తరం నుంచి దక్షిణం పోతా వుండాయి. రామచంద్రకు మెలకువ వచ్చినప్పటి నుంచీ ఆకాశంలో పోతున్న మేఘాలనే పరిశీలిస్తా వుండాడు. అప్పటికి రమణమ్మ నాలుగుసార్లు చెప్పింది చెయ్యుమని, యిక తప్పదనుకుని లేచి కూర్చున్నాడు.

"మోడాలు చూసినావా... దచ్చిణం పోతుండాయి" అన్నాడు భార్యతో.

"ఆ ఏ తిక్కు పోతే ఏంటీ మనకేమన్నా వానొస్తాందా పాడా" అంటూ ఆమె కిందకు వెళ్లిపోయింది.

బద్ధకంగా వళ్లు విరుచుకుంటూ పక్క మిద్దెల వంక కళ్లా చూసినాడు. ఇంకా ఒకరిద్దరు పడుకునే ఉన్నారు. గుడి దగ్గర అరుగుల మీద వేరుశనగ కాయలు వలుస్తున్నారెవరో. కాదరింటికాడ చింతమాను కింద చింతకాయల కోసరం గొడవ పడతాండారు పిల్లలు.

"నాయనా... అమ్మ పిలుస్తాంది" కింద నుంచే కేకేసింది శారద.

బీడీ వెలిగించుకుని తాగతా కిందకుపోయాడు.

"ఏంబా, ఈ పొద్దు సహదేవనాయుడు బామ్మర్ది చెప్పినాడే సంబంధం. వాళ్ల వస్తారంట పాపను చూసేదానికి" అంది రమణమ్మ.

"ఎవరు చెప్పిరి నీకు"

"యిప్పుడే సహదేవుని భార్య వచ్చి చెప్పేసి పాయ" అంది భర్త కళ్లల్లోకి చూస్తా.

"ఈ పొద్దు ఆవులకాడికి వాన్నంపించ్చు ఎన్ని గంటలకు వస్తారంట? "

"కుప్పం చానా దూరమంటనే... వాళ్లాడ పద్దనే తినేసి ఎలబారతారంట, మద్యాన్నేలకు వస్తారని చెప్పింది"

"మద్యానాలకు వస్తారంటానా... ఈ పొద్దు కరెంటు పదకొండు గంటలనించీ యిస్తాండాలే. సరేలే... అయరవకు వచ్చేస్తాన్లే..."

"ఈ పొద్దు నీళ్ల కట్టకపోతే పోనీలే. జుట్టు కత్తిరించుకోని బిన్నే వచ్చేయి. తోట వున్నప్పుడు రాలా ఈల్లు. కాయగూరలు ఏమీలేవు. ఏం కూరచేసేదో ఏమో" అంది రమణమ్మ.

"ఏదో ఒకటి చెయ్యే. వోళ్లు తినర్లే... గతి కితే అతకదంటాండ్లా"

"ఆ అయ్యన్నీ మనకాలం... యిపుడు గతి కేదానికే వస్తాంటారు చానామంది"

"సరేలే, ఏదో ఒకటి చెయ్యి. నేను ఎలబారతాండా" అన్నాడు రామచంద్ర స్నానాల గదిలోకి దూరి. గూట్లో ఉన్న టూత్‌పేస్ట్ కొంచెం వేలికి రాసుకుని గబగబా పళ్లు తోమాడు. ముఖం, కాళ్లు, చేతులు కడుక్కుని వచ్చాడు. చొక్కా వేరే వేసుకుని కాస్త మాసిన పంచెను కట్టుకుని, పైపంచెను భుజం మీద వేసుకుని, అద్దం ముందు నిల్చున్నాడు తల దువ్వుకుంటూ.

తెల్లటి మీసాలు, లోపలికి పోయిన కండ్లు,

బుగ్గలు. జుట్టుంతా దాదాపు తెల్లబడిపోయింది. సగందాకా రాలిపోయింది. బట్టతల వచ్చినట్టుగా అన్పిస్తోంది. దవడ పండ్లు కొన్ని వూడిపోయాయి. గడ్డం మీద అడ్డేలుడు పొడ వుంటాయి, వెంట్రుకలు చూసేదానికి పిచ్చివాడిలా ఉన్నాడు.

అద్దంలో తన రూపం చూసుకునేప్పటికి బాధేసింది.

ఒకప్పుడు ఎట్లున్నే. ఒత్తుగా జుట్టున్నింది. మీసాలు మెలితిప్పితే నిమ్మకాయలు నిల్చేటిగా ఉన్నేయి. చానా బలంగా కండలు తిరిగి, బుగ్గలూ చూస్తానే ఆడోళ్లకు నచ్చేటిగా.

ఎంతమంది ఎంటపడింది. యిప్పుడే మయిపోయింది అదంతా... ఎందుకిట్లా అయిపోయిందా... అనుకున్నాడు రామచంద్ర. "ఏంబా, అద్దంలో చూసుకున్నింది చాలుగానీ, రా తిందువు, పెళ్ళి సంబంధం వస్తాండేది నీకా, నీ కూతురుకా" నవ్వుతూ అడిగింది రమణమ్మ.

> **యిప్పుడే పెండ్లాం బిడ్డల సాకలేక చస్తాండా, యింగో పెండ్లి చేసుకున్నేమనుకో, వుండే బొచ్చుగూడా రాలిపోతాది**

"నేను మొగోన్నే. సచ్చేదాంకా పెండ్లి చేసుకోవచ్చు"

"ఆఁ అవునవును అయితే యింగేం, ఎవురికయినా చెప్పి పెడతా, మా ఆయనకు పిల్లగావాలంట అని"

"ఏంది ఒదినా పిల్లంటాండవు? కుక్కపిల్లా, కోడిపిల్లా" అంటూ వచ్చినాడు సహదేవనాయుడు.

"రాబ్బా, సరిగ్గా వచ్చినావు. మీ అన్నకు పిల్లగావాలంట... పెండ్లి చేసుకుంటాడంట"

"మా అన్నకేం ఒదినా... రాజు. ఎందుకీరు పిల్లను" అన్నాడు సహదేవనాయుడు కుర్చీలో కూర్చుంటా.

"ఆఁహా... అయితే నువ్వా చేసుకోబ్బా పెండ్లి"

"ఆఁ అదొగటే ఒదినా తక్కువ. యిప్పుడే పెండ్లాం బిడ్డల సాకలేక చస్తాండా, యింగో పెండ్లి చేసుకున్నేమనుకో, వుండే బొచ్చుగూడా రాలిపోతాది, యాడికిన్నా ఎలబారంతా వుండావే"

"గడ్డం పెరిగిండాది. జుట్టు గూడా చూడు ఎంత పొడుగుందో. కండ్లల్లో పడుతాంది కత్తరించుకొని వద్దామని. సద్ది తాగుదువురా" అన్నాడు రామచంద్ర.

"వద్దన్నా... నేను యిప్పుడే తాగేసి ఎలబారినా బాయికాడికి... మా పిల్లోల్లు యిద్దరూ పోయిండారు. మడికి మందు స్ప్రే చేస్తాండాం"

"యిప్పుడా? "

"మేం మీకన్నా ఎనకగదాన్నా నాటిండేది"

"ఔనులే" అంటూ గబగబా రెండు గ్లాసుల సద్ది తాగినాడు.

"కుప్పం కాన్నించి మద్యాన్నాలకు వస్తారున్నా మా బామ్మర్ది గూడా వస్తాండారు. వాళ్లకు మద్యానాలకు అన్నం చేయద్దు ఒదినా. మా యింట్లో చేస్తాండాం"

"అదేమప్ప అట్ల... పెళ్ళి సంబంధం వస్తాండేది. మా యింటికా, మీ యింటికా? "

"ఎవరింటికయితే ఏముండాదిలే ఒదినా, మా బామ్మర్ది వస్తాండాడు గదా... వోని సాహసగాడు వస్తే మా యింట్లో తిండి పెట్టకపోతే ఎట్ల, అది చెప్దామనే వచ్చినా, వస్తాండావాన్న" అన్నాడు లేస్తా సహదేవనాయుడు.

"ఆఁ వస్తాండా. అదే గదా దోవ నాకూ. ఈ మంగలనాయాలు వూరికి వచ్చేదే మానుకున్నాడు. వాడు వొగడొస్తే చాలు... యిప్పుడు వూరంతా పోవాల మారేళ్లకు. ఏమే యిర్వై రూపాయలియ్యే" అన్నాడు రామచంద్ర.

"వాళ్లెందుకొస్తారింగ పల్లెకు. బంకు పెట్టు

కోని సుఖానికి మరిగినారు. అవసరం వున్నోడు బంకు కాడికి పోతాడు. దుడ్డిచ్చి సేయించుకుంటాడు. మంగళోనితో ఎవునికి అవసరం ఉండదు. బొచ్చున్నెంత కాలం పనే గదా...? "

"ఎవరి బాధలు వానియిలే, మన రైతులు ముందు మాదిరిగా మేర యాడిస్తాండారు. అసలు పంటలుంటే గదా మేర యిచ్చేదా నికి? " అంటూ భార్య యిచ్చిన డబ్బు తీసు కుని "పోయొస్తానే. పాపను ఆవుల కాడికి అంపీయద్దు...నేను బిన్ని వచ్చేస్తాలే..." అంటూ బయటకు నడిచాడు రామచంద్ర. సహదేవనాయుడు అప్పటికే వీధిలో ఉన్నాడు.

యిద్దరూ దారింటే నడవసాగారు.

కొండల చాటు నుంచి సూర్యుడు కొంచెం కొంచెం ఎగబాకుతున్నాడు.

గాటికాడ ఆవుల దగ్గర పాలపొదుగులు కుమ్ముతా దూడలు పాలు తాగుతున్నాయి.

"కుప్పమోళ్లు ఈ పొద్దు వచ్చే సంగతి మీరు ముందుగనే చెప్పింటే, మా పెద్దబిడ్డకు చెప్పం పిద్దు ఈ పొద్దు రమ్మని" సహదేవనాయు డుతో అన్నాడు రామచంద్ర.

"నాగ్గూడా తెలీదు గదా... రాత్రి చెప్పి నాడు ఫోన్ చేసి, పద్దన్నే వస్తాండాం అని. ఏముందిలేన్నా... వాళ్లు చూసి బిడ్డను నచ్చు కుంటే, మనమందరం మళ్లొగసారి కుప్పానికి పోయొద్దాంలే"

"అంతేలే, ఆపనే చేద్దాం"

దారికి అడ్డంగా వుడత పరిగెత్తుతో పోయింది. కొంగలు గుంపుగా ఎగురతాపో తాండాయి. యిద్దరూ కాసేపు మౌనంగా నడి చారు.

"నారు ఎట్లుండాదిన్నా..."

"నారుకేమప్పా బాగుండాది. దినమ్మా చూస్తాండావు గదా. యింగ నెల దినాల్లో నాట్లేయాల"

"చేతకు ఎప్పుడేస్తాండరు"

"ఎయ్యాల సహదేవా. దుడ్డుండద్దా? రామి రెడ్డి గొంతుమింద కూచ్చోనుండాడు దుడ్డిచ్చే యమని. మొన్నయితే యింటికొచ్చి కడ్డా యంగా అడిగేసిపాయ. ఎట్ల చేసేదో ఏమో" బాధగా చెప్పాడు రామచంద్ర.

"వడ్లొస్తానే యిస్తానని చెప్పగూడదా? "

"చెప్పినా యినలా. కొడుక్కుద్యోగం తీసి య్యాలంటా. తిరుపతిలో ఎవురో లక్ష కడితే వుద్యోగం యిప్పిస్తామన్నేరంట. అందుకని మేమియ్యాల్సిందాన్ని యిచ్చేయమంటాం టాడు."

"ఎంతుండాదిన్నా..."

"సుమారుగానే ఉండాది. అసలే నలభై వేలు. వడ్డీ కలుపుగోని అర్వైదాంకా వుండా ది. రెండేండ్లనించీ వడ్డీగూడా కట్టలా"

"రామిరెడ్డన్న ఈమధ్య చానా అన్నేయం మనిషయిపోయినాడులే. ఆయన్న కొడుకు డిగ్రీ చదవతాంటే అప్పుడే ఉద్యోగం ఎవురి స్తారంట..." దుడ్డడుగతాండేది అందుకు కాదులే"

"యింగెందుకు? కూతురుకు పెండ్లి చేస్తాం డాడా? "

"పెండ్లే... పాప పదో తరగతో, యింటరో చదవతాండాది"

"అయితే యింగ దేనికి" తెలుసుకోవాలనే కుతూహలం రామచంద్రలో. "ఎందుకేముం డాదినా... నువ్వు చేను రెండెకరాలు అడ మానం పెట్టిగదా దుడ్డు తీసుకోనుండావు"

"అవును..."

"ఆ చేను ఎవురి చేను పక్కనుంది"

మౌనంగా వుండిపోయాడు రామచంద్ర. కొద్దికొద్దిగా అర్థమవుతాన్నెట్లు వుంది.

"మీ చేనుండేది వాళ్ళ చేను పక్కన్నే. ఆ రెండెకరాలు అడమానం పెట్టుకునిందీ అందుకే. యిప్పటికిప్పుడే దుడ్డు యాట్నించి తెస్తావు నువ్వు. చేను అమ్ముకోమంటావు. చేను ఆయప్ప పేరుతో రాపించుకోని, ఆ పత్రాలు యాడన్నా పెట్టి దుడ్డు తెచ్చుకుంటా నంటాడు చూడు"

"......"

"లేకపోతే యిప్పుడు దుడ్డుతో పనేముం డాది..." పోనీ వడ్లో, చెరుకో వచ్చేదాకా ఉన్నిండచ్చు గదా. వూర్లో అంతా యిదే అను కుంటాండారునా, వోళ్ళు వచ్చి ఎంతగా అన్నా అడగనీ... నువ్వేం బాధపడద్దు, భయపడద్దు. పంటలో యిస్తాననే చెప్పు కడ్డాయంగా" సలహా యిచ్చాడు సహదేవనాయుడు.

"పరువు పోతాదే. యింటి ముందర నిలబ డుకోని వూరందరికీ యినపడేటిగా అరస్తాంటే, ఎట్లప్పా గమ్మునుండేది? "

"పరువు పరువు అనుకునే సస్తాండేది అంతా. పానం పోయినాంక పరువుంటేనేం లేకుంటేనేంనా. యింటి మందికొచ్చి అప్పు లోల్లు అరిసినారని నైతులంతా సస్తాండారు. కాదన్నా మనమేమన్నా ఎగ్గొట్టాలనుకోనుం టామా. జరక్కనే గదా. అట్లాంటప్పుడు ఎందుకు బాద పడాల, ఎందుకు సావాల? " ఆవేశంగా ప్రశ్నించాడు సహదేవనాయుడు.

రామచంద్ర మౌనంగా నడవసాగాడు. అత నిలోనూ ఏదో మథన.

"అప్పుడెప్పుడో పత్తి నైతులు ఆత్మహత్యలు చేసుకుంద్రి. వాళ్ళకంటే బతుకు తెరువు లేక సచ్చిపాయిరనుకో భయంతో. అనంతపు రంలో చెనిగి నైతులు సచ్చిపాయిరి. వాళ్ళకు వర్సగా పంటలు రాలేదని పాయిర్లే. ఇప్పుడు మన జిల్లాలో సస్తాండారు. ఈ మే నెల్లోనే ఆరేడుమంది సచ్చిపోయిరి. ఎందుకు సావల్ల చెప్పు...? సచ్చేదానికా అప్పులు చేసిండేది. బాగుపడాలనే గదా... వానలే... పంటల్లే... ఈ పొద్దయ్యేది చేపయితా. పది రూపా యలు యియ్యాల్సిన తావన ఒక రూపాయి యిస్తాం. సావడం ఎందుకు? " అన్నాడు సహదేవనాయుడు. ఆవేశం అలానే ఉంది.

చల్లని వుదయం కూడా వేడిగా ఉన్న ట్టుంది.

"సావక ఏం చేస్తారప్పా... ఎన్నాళ్ళని దైర్నంగా ఉంటారు? పదిమందికి అన్నం పెడతాండే నైతు, పదిమంది దగ్గర మాటలు పడతా దినమ్మా బతకాలంటే అయితదా? వానలు సక్రమంగా పడతాండాయా? బోర్లల్లో నీళ్లుంటాండాయా? గవర్నమెంటు ఏదన్నా సాయం చేస్తాండాదా? ఏ నమ్మకం పెట్టు కోని దైర్నంగా బతకమంటావు? " ఎదురు ప్రశ్నించాడు రామచంద్ర.

"..."

"పది రూపాయలు యియ్యాల్సిన తావన ఒక రూపాయి ఇచ్చి చెప్పుకోవాలంటే, ఒగ రూపాయి సంపాదన వుండాల గదా. ఈ ఆరేండ్లమంటి ఒగ రూపాయి ఎప్పుడు మిగు లువాసి అయితాండాది. వర్సగా అప్పులమీద అప్పులు చేసుకుంటూ పోతాంటే ఎన్ని తావల అప్పులు దొరుకుతాయి. ఎవురిస్తారింగ అప్పులు? పైసా సంపాదన లేకుండా, చేతిలో పైసా దుడ్డు లేకుండా ఎట్ల బతికేది? "

సహదేవనాయుడు సమాధానం చెప్పలేకపో యాడు. అంతవరకూ అతనిలో వున్న తెగిం పంతా ఆ మాటలతో లేకుండా పోయింది.

రామచంద్ర బీడీ వెలిగించాడు. పొగ ఎక్కువ పీలస్తానే దగ్గు విపరీతంగా వచ్చింది. కడుపును ఎడం చేత్తో పట్టుకుని కాస్త ముందుకు వంగి దగ్గాడు.

"అన్నా ఈ మద్దెలో ఎక్కువగా దగ్గతాం డావు. డాక్టరుకాడ చూపీగూడదా? "

"ఆc అదే పోతాదిలేప్పా. రేత్రిల్లో ఎప్పుడం టే అప్పుడు కరెంటు యిస్తాండారా. మంచు కు తడిసి, ఎండకు ఎండి... అంతేలే"

రామచంద్ర కాసేపు మౌనంగా నడిచాడు.

సహదేవనాయుడి పొలానికి వెళ్ళే చీలిక దారి దగ్గర ఆగి "ఎల్లొస్తానబ్బా" అని చెప్పి మారేళ్ళ వైపు అడుగులేశాడు రామచంద్ర.

అంతవరకు మాట్లాడతా వస్తాంటే తెలీలే దుగానీ, బాగా నీరసంగా వుంది రామచం ద్రకు. అడుగులు మెల్లగా వేస్తాండాడు.

ఒక్కొక్కరే అప్పులోల్లంతా గుర్తొస్తాండారు. అప్పులంతా లెక్కేసినాడు. లక్షల్లో వుండాది. తన ఆస్తిపాస్తులు లెక్కేసినాడు. యించు మించు అప్పులంతే వుండాయి.

పంటలు తల్చుకున్నాడు. రామిరెడ్డి రెండెక

రాల చేనుకు ఎసరుపెడతాండేది గుర్తుకు వచ్చింది. నీరసం యింకా ఎక్కువనిపించింది. అడుగులు తడబడతాం డాయి.

గుండెల్లో నొప్పిగా అనిపించింది.

సహదేవనా యుడి బాయికాడ నీళ్ళు తాగింటే బాగుండు. ఎందుకింత నీర సంగా వుండాది? పద్దన్నే తాగిన సద్ది చాల్లేదా. యింగో రెండు గ్లాసులు తాగిండా ల్సింది. రేపటెండకు నడస్తాన్నిందానికా... ఎన్నిసార్లు నడ్సాలా.... నాకేం కాదులే... ఈ ఎండొగలెక్క... పద్దన్నే సద్ది తాగకుండా ఎన్నిసార్లు మడి దున్నలా. అండ చెక్కలా... నీళ్ళు కట్టలా... ఏం కాదు ఏం కాదు... అప్పు లెంతుంటేనేం. నీళ్ళు బాగుండాయి కదా. కష్టపడతాం.. తీర్చేస్తాం... యింతగాదు, యింగింత అప్పున్నే సరే... అంతకంత అప్పున్నే సరే. తీర్చేస్తాం... ఏం భయం లేదు... ఏం దిగుల్లేదు... అనుకున్నాడు.



ఎర్రగొండ దగ్గరకు వచ్చాడు. అక్కడ దారి పక్కన బండలతో ఏర్పాటు చేసిన సత్రం ఉంది. దాని బండమీద కూర్చున్నాడు. అక్క డినుంచి మారేళ్ళ కనిపిస్తాంది. గుబురుగా వుండే చెట్లు... వాటి మధ్య యిండ్లు స్పష్టంగా కన్పించడంలేదు.

వెళ్దామని లేచి నిల్చున్నాడు. కళ్ళు తిరిగిన ట్టుగా అనిపించింది. మళ్ళీ అక్కడే కూర్చు న్నాడు. ఎదురుగా పొలిమేర సందు. నిలు వెత్తు రాశిగా పోసిండారు రాళ్ళు.

ఆ దారింటీ వచ్చిపోయేవాళ్ళు అక్కడొక రాయిని పెట్టి 'అమ్మ గంగమ్మ తల్లీ... నేను పొయ్యేపని అయ్యేటిగా చూడు... నాకే బాధ రాకుండా చూడు' అని మొక్కు కుంటారు.

అరరే... ఎంత తప్పు చేస్తాండా. గంగమ్మ తల్లికి మొక్కోకుండా పోతాండానే... అందుకే నేమో కండ్లు తిరగతాండేది అనుకుంటా మెల్లిగా లేచి నడచుకుంటా వచ్చి పట్టెడు రాయిని తీసుకోని రాళ్ళ కుప్పమీద వేశాడు.

పక్కనే వుండే తంగేడు రెమ్మలు తుంచి రాళ్ళ కుప్ప మీద పెట్టి రెండు చేతులు జోడించి 'అమ్మ గంగమ్మ తల్లీ... పొలిమేర సందు దాటతాండా... నన్ను చల్లగా చూడు తల్లీ. అప్పులన్నీ తీరిపోవాల. పంటలు బాగా రావాల. అప్పులన్నీ తీరినాయంటే గంగజాత రకు పొట్టేలు కొడతా' అని మొక్కుకున్నాడు. మళ్ళీ వచ్చి దద్దిలం కింద బండమీద కూర్చుని బీడీ ముట్టించాడు.

కొంచం సేపు సేద తీరాక లేచి మారేళ్ళ వైపు నడక మొదలుపెట్టాడు. యిప్పుడు ముందున్నంత నీరసం లేదు. కాస్త హుషారు గానే వున్నాడు. యిదంతా ఆ గంగమ్మ తల్లి చలవే అనుకున్నాడు.

చూసేంత దూరంలో మనిషి పొలకువ లేదు.

రామచంద్ర కండ్లకు చేతిని అడ్డుపెట్టుకుని పొద్దుకళ్ళ చూశాడు. ఏడున్నర అయింటా దేమో అనుకున్నాడు.

'గబగబా పోవాల. బిన్నే జుట్టు కత్తిరించు కోని వచ్చి మడికి నీళ్ళు పారగట్టి మధ్యాహ్నా నికంతా యింటికి పోవాల. మడికాన్నే నీళ్ళు పోసుకోవాల. ఈ సంబంధం కుదిరితే బాగుండు. కుదిరేటిగానే వుండాది. చిన్నమ్మ పున్నెం చేసుకునింది. అందుకే యిట్లా సంబం ధం వస్తాంది. వానిగ్గూడా మూడు ముళ్ళు ఏపించేస్తే... ఆడికి నా పని అయిపోయనట్టే. మళ్ళ యాడున్నే ఎవురూ అడగరు. చిన్నమ్మ పెండ్లికి పెద్దమ్మకి పెద్ద చైను చేపీవాల... లేకుంటే సరోళ్ళలో మానం పోతాది...

"అబ్బా..." అంటా రాయికి కాలు తగలు కోని ముందుకు పడబోయి నిలదొక్కుకు న్నాడు.

"అబ్బా స్స్స్..." అంటా కూర్చుని కాలు వేలును పట్టుకున్నాడు.

గోరు కదలినట్టుంది. రక్తం కారుతుంది.

మళ్ళీ కండ్లు తిరిగాయి. అక్కడే కూర్చుండి పోయాడు కొంతసేపు.

బండబారి దుమ్ము కొట్టుకుపోయిన పాదాల వంక చూసుకున్నాడు. ఈసారి ఎట్లన్నా గానీ చెప్పులు తీసుకోవాల. చెప్పు లుంటే యిప్పుడీ దెబ్బ తగిలిండదు కదా. అనుకుంటా చుట్టుపక్కల చూశాడు. చెట్లన్నీ ఎండిపోయినోటియే. ఆకులు పచ్చగా వున్నా వాటిల్లో పసరు లేదు.

నేలలోంచి మట్టిని తీసుకుని దోసిట్లో వేసు కుని కదిలించి నున్నటి మట్టిని గాయంమీధ వేశాడు.

"అబ్బ... బ్బా..బ్బా..." అనుకుంటా లేచి మళ్ళీ నడవసాగాడు జాగ్రత్తగా.

ముందంత వేగంగా అడుగులు పడటం లేదు. కాలు నొప్పి పెడతాన్నెట్టుంది.

కుడికాలు గదా తగిలింది. అప్పుడు కూతు రి పెండ్లి గురించి ఆలోచిస్తాన్నే... మొగోనికి కుడికాలు తగిలితే మంచిదంటారు. అయితే ఈ సంబంధం కుదిరిపోతాది అనుకున్నాడు.

అలా అనుకోగానే కాలు నొప్పి కూడా హాయిగానే అన్పించింది రామచంద్రకు.

దారి పొడవుకూ రకరకాల ఆలోచనలు.

మారేళ్ళకు చేరుకున్నాడు. వూర్లో అంతా పలకరిస్తాండారు. అందరితో మాట్లాడతా ముందుకు నడిచాడు. వూరి మధ్యలో రాగి చెట్టుకింద వుండాది బంకు. అక్కడే బస్సు ఆగేది. చుట్టుపక్కల పల్లెల వాళ్ళంతా వచ్చి అక్కడే బస్సు ఎక్కుతారు.

రామచంద్ర బంకులో కుర్చీలో కూర్చు న్నాడు. ఎదురుగా అద్దంలో తన ముఖం చూసుకున్నాడు.

"పేపర్ చదవతావాన్నా..."వెంకట్రమణ క్ష వరానికి సిద్ధమవుతూ అడిగాడు.

"ఏం చదవతాం లేబ్బా బిన్నే పోవాల. కరెంటొస్తాది. నీళ్ళు కట్టాల".

రామచంద్ర భుజాల దాంకా తెల్లపంచె కప్పాడు.

గ్లాసులోని నీళ్ళు చేతిలో పోసుకుని రామ చంద్ర తల తడపతా "మీ వూర్లో అంతా ఎట్లుండారన్నా" అడిగినాడు.

"ఏ వూర్లో అయినా ఎట్లుండారప్పా... మీ

# చతుర భాషితాలు

శ్రద్ధగా వినడం అలవాటు చేసుకో,
బాగా మాట్లాడలేని వారినుండి
కూడా లాభం పొందుతావు.

—ప్లూటార్స్

వికారమయిన మనస్సు కంటే
వికారమయిన ముఖమే మంచిది

—ఎల్లీస్

తాను సృష్టించిన కుసుమాలను
మానవుని చేతుల మీదుగా
గ్రహించడానికి నిరీక్షిస్తుంటాడు
పరమాత్ముడు.

—టాగూర్

విన్నది వినడానికి విసుగుండదు
చెవికి. చూడనిది చూడాలనిపి
స్తుంది కంటికి.

—అడెన్

జనన మరణాలకు మందు లేదు.
రెంటిమధ్య గల అవకాశం అనుభ
వించాల్సిందే.

—జార్జి

వైరి విద్వేషాలకంటే
ప్రేమాభిమానాలు
శక్తివంతమయినవనే సత్య
చైతన్యత లేనప్పుడు ప్రాపంచిక
సంస్థల ప్రయోజనం
నిష్ప్రయోజనం.

—డా. ఎస్. రాధాకృష్ణన్

ఒంటరిగా విచారం సహించగలం.
ఇద్దరుంటేనే సుఖం
అనుభవించగలం.

—హబ్బర్డ్

కాలం గతిస్తుంది. పేరు
ప్రతిష్ఠలు పెరుగుతాయి.
సామర్థ్యం ఉడుగుతుంది.

—జోల్డ్

సంపద కలిగినప్పుడు
మీ దోషాలను చెబుతూ,
ఆపదలో మనసారా చేయూత
నిచ్చేవాడే నిజమయిన మిత్రుడు.

—స్మిత్

డేగలు మౌనంగా ఉన్నప్పుడు
చిలుకలు కిలకిల లాడటం
మొదలు పెడతాయి.

—సర్ విన్‌స్టన్ చర్చిల్

నిరాశకు మరో పక్క
ప్రారంభమయ్యేదే జీవితం.

—జాన్‌పాల్ సార్త్రె

నమ్మడం కష్టం.
నమ్మక పోవడం అసాధ్యం.

—విక్టర్ హ్యూగో

వూర్లో ఎంతో, మా వూర్లో గూడా అంతే"

"అదెట్లన్నా... అన్ని వూర్లు ఒకటిగా ఎట్లుం టాయి? ఈ పొద్దు పేపర్ చూసినావా" అంటా దువ్వెన తీసుకుని జుట్టంతా ఒక పక్కకు దువ్వి కత్తెర చేతికి తీసుకున్నాడు.

"పద్దన్నే లేసినా... నేరుగా ఈడికే వస్తాండా. ఎప్పుడు చూస్తి పేపర్... మా వూరికి పేపర్ రాదు గదా!"

"అన్ని ఊర్లు ఒగతీరుగా యాడుండా యినా. ఒగో ఊర్లో ఒగో కతలే. ఈ పొద్దు పేపర్లో ఏసినారు చూడు..." అంటా జుట్టు కత్తరించేది ఆపేసి పేపర్ చూపించాడు వెంక ట్రమణ.

జిల్లా పేపర్‌లో. 'రుణదాత వేధింపులతో వడిశాకు తిని రైతు మృతి' అని వుంది. పేప ర్‌ను తిరిగి బెంచీమీద పెట్టేసి కత్తెర తీసుకు న్నాడు.

పుత్తూరు కాడంటన్నా... పరమేశ్వర మంగళం... ఆ బాబు నాయుడంట. ఆరేడు బోర్లేసినాడంట. నీళ్ళులే. మడంతా బీడే. అప్పులకూ వడ్డీలు. అప్పులోల్లు వచ్చి అడిగేది ఎక్కువయిందంట. నిన్న సాయంత్రం వాళ్ళ మడికాడికే పోయి వడిశాకు తిని ఆన్నే సచ్చి పాయనంట" అన్నాడు వెంకట్రమణ.

"ఎంతకాలమని చూస్తాడులే"

"సచ్చిపోతే అప్పులు తీరతాయన్నా? అట్ల యితే అప్పుల్లేని రైతు ఎవురో చూపిచ్చు నాకు. అప్పులుండాయని సచ్చిపోవాలను కుంటే రైతులంతా సచ్చిపోవాలా ఆ లెక్కన. తప్పుడు పనిన్నా అది. పెండ్లాం బిడ్డలుం టారు గదా. నువ్వాలోచించినావా అది. నీ పాటికి నువ్వు సస్తావు. అప్పులోల్లు వచ్చి యింటిమింద పడరా. వున్నిందంతా తలా కొంచెం పంచుకోని పోరా. నువ్వు సచ్చి సుఖ మేముండాది చెప్పు" అంటా పనాపేసి ప్రశ్నలు సంధించాడు వెంకట్రమణ.

"గుండె నిబ్బరం వుండద్దంటప్పా..."

"అదే ఎందుకుండదూ అంటాండా. పేపర్లో చూడన్నా, భార్యా బిడ్డలు ఎట్లేడస్తాండారో. బిడ్డలు నేదర్లుగా వుండారు. యిట్లా వోళ్ళు పెండ్లే చేసుకోకూడదన్నా" అంటా జుట్టు కత్తి రిస్తావుండాడు.

జుట్టు కత్తరించినంత సేపూ లొడలొడా మాట్లాడుతూనే వున్నాడు వెంకట్రమణ.

అతని మాటలయితే వింటున్నాడు కానీ. ఒక్కటీ మనసుకు చేరడం లేదు. యాంత్రి కంగా వూ కొడుతున్నాడు రామచంద్ర.

పేపర్లో వేసిందే రైతు మృతి చెందిన ఫోటో, అతని సుట్టకారం చేరి ఏడుస్తాండే భార్యా పిల్లలు, బంధువులే కన్పిస్తాండారు.

నా బిడ్డలకు మాత్రం ఆ గతి రానీను. ఎంత అప్పులున్నా సరే నేనే తీరస్తా. అప్పులు తీరిందాకా సావను. భార్యా బిడ్డలను దిక్కులే నోళ్ళ చేయను అనుకున్నాడు.

బుర్రుమనే శబ్దం వచ్చింది.

"సొసైటీ బేంకోళ్ళ జీపు వస్తాందేమో. ఈ పొద్దో రేపో వస్తాదంటాండిరి" అన్నాడు వెంకట్రమణ.

సొసైటీ వాళ్ళ జీపు అనే మాట వినగానే రామచంద్ర మనసు వికలమయిపోయింది.




"నాయనా... తినేసిపో. ఏయరవయితాదో యేమో" అంది శారద.

"పోతానుమ్మా. ముందుగా పోతే బిన్నే దున్నించుకోని వచ్చేయచ్చు. నారాయణరెడ్డి ట్రాక్టర్ ఒకటే వుండేది. ఈసారి నూతన కాల్వ చినరెడ్డోళ్ళ ట్రాక్టర్లు లేవు. కాపెట్టు కోని వుండకపోతే తేమ వున్నిట్టే చేను దున్నీలేము" అన్నాడు రామచంద్ర.

"అయితే గానీ లేబ్బా. ఎంచేపు తింటావు. కూర గూడా అయిపోతాండాది. తిరగవాత

పెట్టేస్తా. తినేసి పోదువు వుండు" అంది వంట గదిలోంచే రమణమ్మ.

రామచంద్ర వీధిలో కొచ్చి ఆకాశం దిక్కు చూశాడు. దట్టంగా మేఘాలు కమ్ముకోనుం డాయి. ఎప్పుడో, యింకాసేపట్లోనో వర్షం వచ్చేటిగా వుండాది. వుదయం నుంచి రెండు మూడుసార్లు పడిన వర్షంతో నేలంతా తడితడిగా వుండాది. చెర్లోకి కొన్ని నీళ్ళు వచ్చినట్టు వున్నాయి. కప్పలు బెకబెకమంటూ ఆనం దాన్ని వ్యక్తపరుస్తున్నాయి. వూరు వూరంతా వర్షం రావడంతో సందడిగా వుంది.

తండ్రి పోకపోక సంతకుపోయి తినుబండా రాలు తెచ్చినప్పుడు పిల్లల్లో వుండే ఆనందం, సందడిగా వుంది.

యిప్పుడే పోతే బాగుండు. ఆ పక్క దున్నేసి ఎల్లిపోయినాడంటే మళ్ళెప్పుడో వస్తాడు అనుకుని యింట్లోకి పోయి "నేను పోతాండాలేయ్యే. మళ్ళొచ్చి తింటా" అన్నాడు రామచంద్ర.

"కాలు నొప్పంటాండావు. నువ్వు పోకపో తేనేం వాన్నంపిచ్చు" అంది రమణమ్మ.

"వాన్నా... వానిమొగం వానికేం తెలుసు. ఓపిగ్గా ఆడ వుండాల. ఎంటబడి పిల్చుకోని పోయి దున్నించాల. ఈనట్లావోడు ఆడికి పోయినాడనుకో ఆరేసు కోని పొనుకోని నిద్ర పోతాడు. చల్లగా వుంటాది కదా ఆడ" అన్నాడు వ్యంగ్యంగా రామచంద్ర.

"నువ్వే అట్లంటే ఎట్టాబ్బా, వోన్ని దండిచ్చి పనిచేపించాల గదా మ్మేయ్. శారదా. మీ నాయనకు అన్నం పెట్టకపొయ్యి యిద్దువురా' ' అంది రమణమ్మ.

"కాదే... వాడేమన్నా సన్నబిడ్డా. మంచీ చెడ్డా తెలీదా..." వాన పడిందే. చేను దున్నిం చాల గదా. నాయనకు మోకాళ్ళ నొప్పులుం డాయే. ట్రాక్టరు కాడికి పోదామే అనే యిది వుండాల్నా లేదా? పెండ్లి చేసిందే యిబ్బుటికి పదిమంది బిడ్డలు పుట్టిందురు. యింగా తెలు సుకోక ఎట్ల...? " అన్నాడు రామచంద్ర కూతురు తెచ్చిన అన్నం గిన్నెను తీసుకుంటా.

"పెండ్లి చెయ్యలేదనేదే గదా వాని బాధ. ఆడాడ చెప్పుకుండాడంటేనే. మావోళ్ళు నాకు పెండ్లి ఎప్పుడు చేస్తారో ఏమో అని" అంది రమణమ్మ హాల్లోకి వచ్చి గోడకు ఆనుకుని కూర్చుంటా.

"వానెమ్మా గబ్బు నాకొడుకు అంత వయ సుండే ఆడబిడ్డుండాది. ఏమంట వానికంత తొందర. అంత యిదిగా వుంటే పెండ్లి చేసు కోని అత్తగారింటికే పొమ్మను వాన్ని" అరి చాడు రామచంద్ర కోపంగా.

"అబ్బా కొడుకులకు ముందు కోపం పెరక్కు స్తాది. మా అన్న కూతుర్ని అనుకోని గూడా అయిదేండ్లయితాండాది. ఆడ బిడ్డోళ్ళు ఎన్నా ళ్లు కాసుకోనుంటారు? రోజులు గడిసేలకు వోళ్ళు ఆయమ్మకి యాడన్నా చేసేస్తారేమో అని భయపడతాండాడీడు" అంది రమణమ్మ కొడుకును వెనకేసుకొస్తున్నట్టుగా.

"అదీ,అట్ల చెప్పు. ముందు వాళ్ళకు తొందర వుంటాది. చేస్తే చేసేయనీలే. మళ్ళేడా మనకు బిడ్డ దొరకదా. లోకమే మన్నా గొడ్డుపోయిండాదా. మనతో బంధు త్వం వుండాలనుకుంటే వుంటారు, లేకుంటే లేదు" అన్నం తింటూనే మాట్లాడుతున్నాడు రామచంద్ర.

"ఎంత కాలమయినానా... నీ కొడుకు ఉజ్జోగస్తుడా వాళ్ళు కాసుకోనుండే దానికి, పాప బాగుండాది, కట్నం తక్కువయినా ఫర్వాలేదని ఎవురన్నా వస్తే, యిచ్చేస్తే, ఏం చేస్తాం? " అంది రమణమ్మ భర్తతో వాదనకు దిగతా.

గడప దగ్గర కుచ్చోని తల దువ్వుకుంటా, అమ్మా, నాన్న మాటలు నవ్వుకుంటా వింటోంది శారద. అప్పుడప్పుడూ ఆర్నెల్లుగా ఆ యిద్దరి మధ్యా యిలాంటి వాదన జరుగు తోంది.

"నిన్ను గూడా వుద్యోగస్తునికే యిచ్చిం దేది... ఎందుకు సేద్యం చేసేవోనికి యిచ్చి నారు? వుద్యోగం లేకుంటేనేమి. నా కొడుకు బంగారమే" ఆవేశంగా అన్నాడు రామచంద్ర.

"ఏందన్నా బంగారమంటా వుండారు. యిబ్బుడు బంగారం రేటు బాగా పెరిగిం డాది..." అంటా వచ్చినాడు శివరాం.

"బంగారం కొనేంత యిది గూడానా ఈ బతుక్కు. వుండేటియి కాపాడుకుంటే చాలు. ఏందో మీ ఒదిన వూరికే వదరతాంటాది. చేను దున్నీలా" మాట దాటవేసినాడు రామ చంద్ర.

మసక చీకట్లు ముసురుకుంటాంటే, హాల్లో వంట గదిలో దీపాలు వేసింది శారద. పూజ గదిలోకి వెళ్ళింది దీపం వెలిగించడానికి.

"దున్నించాలన్నా. మా చేన్ల తిక్కు రేపో స్తానన్నేడు., మీరు దున్నించినారా? "

"లేదుబ్బా... యాడా... మీ అన్న ఆడికే ఎలబారతాంటే తినేసి పొమ్మని అన్నం పెట్టినా. అన్నం తిను శివరామా వుడుకు డుగ్గా పుల్లగూర చేసిండా" అంది రమణమ్మ.

"వద్దొదినా. యిబ్బుడే బాయికాన్నించీ వచ్చినా, నీళ్ళు పోసుకోని తినేసి వస్తాండా. చెయ్యి తెమ్మగూడా ఆరలా" అన్నాడు శివరాం కుర్చీలో కూర్చుంటా.

"ట్రాక్టర్ యాడ దున్నతండాది? "

"ట్రాక్టరా, యింగా ఎర్రగొండ కనం దగ్గరే వుండాది. వూర్లో వాళ్ళంతా ఆన్నే వుండారు. ఆట్నించి దున్నుకుంటా మీ చేన్లకల్లా వచ్చేలకు ఎట్ల లేదన్నే నడిజామయితాది"

"ఈయనకు ముడ్డి నిల్చలా యింటికాడ. పోవాల పోవాల అంటా ఎగరతాండాడు. యిన్నేవు గదాబ్బా, నిమ్మళంగా తిను, పోదు వుగానీ" అంది రమణమ్మ.

"ఎకరాకు ఎంతంట...? "

"ఎకరాకా... యింతకు ముందంటే నూతన కాల్వ చినరెడ్డోళ్ళయి వున్నేయి గదా. ఆయన నక్సలైట్లకు భయపడి పీలేరుకు కాపరం ఎళ్ళి పాయ. ట్రాక్టర్లూ పాయ. ఈ పక్కనుండేది యింగ ఈయనిది ఒగనిదే గదా. గంటకు ఇన్నూట ఎనభై చెప్తాండాడంట"

"నిరుడు యిన్నూట యాభయ్యేగదా, అంత పెంచినాడా ఒగటే సారి"

"డీజిల్ పెరిగిండాది అంటాండాడంట. ఏం చేద్దాం, మనకు అది తప్ప యింగోటి గతి లేదు. గొడ్లు ఎవురిండ్లల్లో లేవుగదా. వున్నోళ్ళు వాటితోనే దున్నుకుంటాండారు. లేనోళ్ళు, మనట్టావోళ్ళు ట్రాక్టర్ కోసరం కాపెట్టుకో నుండాం" అన్నాడు శివరాం.

"దుడ్డు పోతే పోయిందిలేప్పా, పని బిన్నే అయితాండ్లా" అంది రమణమ్మ.

"పని బిన్నేనే అయితాదొదినా. నువ్వు ఎంతయినా చెప్పు, మడకతో దుక్కి చేసినంత యిదిగా ట్రాక్టర్‌తో రాదు"

"ఎట్లొస్తాదిప్పా, గడ్డలు నిల్వకుండా గడ్డల మందే దున్నుకుంటాపోతాం" దాంతో బాగా దుక్కయితాది. ట్రాక్టర్ మడకలు రావు తెగ తాయేమోగానీ గడ్డలు ఎంతెంత లావుం టాయో చూసినావుగదా. అందుకే దాంతో అంత బాగుండదు"

"ఏం చేస్తాం. యింగ. వాన సరిగ్గా పడం దానికి ట్రాక్టరే మేలు. బిన్నే దుక్కి చేసేయ వచ్చు "

"యిత్తనం గింజలు ఎట్ల చేస్తాండారునా" ప్రశ్నించాడు శివరాం.

"ఇంట్లో అయితే లేవు. గవర్నమెంటోళ్ళు అగ్గవకు కాయలు ఇస్తాండారంటనే. అయ్యి తీసుకుందామనుండా. తగ్గిన కాడికి తగ్గినట్టే గదా"

"అయ్యి యాడొస్తాండాయినా? మండలా నికి చానా తక్కువ యిచ్చినారంట. రేపు పీలే రులో రైతులంతా ధర్నా చేస్తారంట. మనూర్లో గుడా యింటికొగరు పోవాలంటా న్నేరు. మనం పోదామా" అన్నాడు శివరాం.

"ఎందుకబ్బా.. అట్ల పోయినంత మాత్రాన యిస్తారంటావా...? "

"యిస్తారనే గదాన్నా. మనం యిబ్బుడు ఆగింతం చెయ్యకుంటే, ముక్కు మూలిగి వాళ్ళకు యిష్టమయినప్పుడు యిస్తారు. ఆయ రవకు అదును పోతాది. ధర్నాలన్నా చేస్తే కొంచెం బిన్నేయిస్తారు. దండిగా యిస్తారు" వివరించాడు శివరాం.

'యిబ్బుడు చేను దున్నించే దానికి పోతాండా గదా... ఏయరవయితాదో ఏమో పడుకొనేలకు. మళ్లా రేపు పీలేరుకు పోవాలంటే ఇబ్బందేమో!'

"బాలక్రిష్ణను అంపిచ్చన్నా"

"వాన్నా... ఎట్లనో చూస్తా. మీరెట్ల చేస్తాం డారు యిత్తనం గింజలు"

"మాకు నిరుటియి ఐదు మోటలుండాయి"

"నిరుడంతా జూల్లేగదా. యిత్తనానికి పనికొస్తాయా? " అనుమానం వ్యక్తం చేశాడు రామచంద్ర.

అన్నీ చెరిగేస్తే బాగా గట్టికాయలు ఐదు మోటలయినాయి. అయ్యి చాలవు. వెరాటకు ఇరవై శేర్ల యిత్తనం పప్పు ఎల్లతాది. ఏడెకరాలు ఏస్తాండాం. సుమారుగ యిన్నూరు శేర్లు కావద్దాన్నా. ఇంగో ఐదారు మోటల కాయలు గావాల"

"మాటలు పెట్టుకున్నేరా. యింతకు ముందు ఎగరతాంటివే బిన్నే పోవాలని. ఎలబారింగ" అంది రమణమ్మ.

"ఆడ ట్రాక్టర్ వచ్చిండదులే వొదినా, యిప్పుడే ఎందుకు" అన్నాడు శివరాం.

"సరేలేప్పా... నేను పోతాండా. పద్దన్నే పీలేరుకు పోవాలంటావా? " పైకి లేచి బీడీలుండాయా లేవా అని జోబులో చూసుకుంటా అడిగినాడు రామచంద్ర.

"పొయ్యొద్దాంనా... యింటికొగరొస్తారంట. దుడ్డు గూడా తీసకపోదాం. ఒకేళ వోళ్లు రేపే చెనిక్కాయలు యిస్తే, ఏసుకోనొద్దాం" శివరాం కూడా లేస్తా అన్నాడు.

భార్యకు పోయొస్తానని చెప్పి బయలుదేరాడు రామచంద్ర. పొలాలకు అడ్డంపడి నడుస్తున్నాడు. చెప్పుల్లేని పాదాలకు తడిమట్టి చల్లగా తగులుతా వుంది. అక్కడక్కడా పాదాలను పల్లేరుముల్లు చురుక్కుమనిపిస్తాండాయి... అవి గుచ్చుకున్నప్పుడంతా ఆగి వాటిని పాదం నించి తీసేసి మళ్లీ నడుస్తున్నాడు. తనకన్నా యిరవై బారల ముందు ఎవరో మనిషి పోతాన్నెట్టు అనిపించింది. రాత్రి ఎనిమిది గంటలు కావస్తా వుంది. ఆకాశమంతా మేఘాలు కమ్ముకోను

## నిశాచరులారా, పారాహుషార్

నైట్ డ్యూటీలు చేసే వాళ్లు, చదువుల కోసం నైటవుట్లు చేసే వాళ్లు నిద్రను దూరంగా ఉంచడానికి రకరకాలుగా ప్రయత్నిస్తుంటారు. ఇలాంటి వాళ్లు కాఫీ, టీ మీద ఆధారపడడం కద్దు. పదేపదే అవి తాగుతూ కళ్లు మూతలు పడకుండా చూసుకుంటుంటారు.

కాఫీలో ఉండే కెఫీన్ మెదడులో ఉండే నిద్రకు సంబంధించిన భాగాన్ని మొద్దుబరచి నిద్రరాకుండా ఆపుజేస్తుంది.

ఈ మధ్య టెక్సాస్ యూనివర్సిటీ మెడికల్ సెంటర్‌వాళ్లు పరిశోధనలు జరిపి,



మెదడులో కణాలు ఎక్కువగా పనిచేయటం వల్ల 'ఎడినోసైన్' అనే రసాయనం విడుదల అవుతుందని, అది తిరిగి కణాల్లోకి ప్రవేశించగానే మనకు జోల పాడినట్టు నిద్ర ముంచుకొస్తుందని చెప్తున్నారు.

అయితే, కెఫీన్ ఈ ఎడినోసైన్ రసాయనాన్ని తిరిగి కణాల్లోకి ప్రవేశించకుండా నిరోధించటం వల్ల మనకు నిద్ర దూరమౌతోంది. దీని వల్ల కొన్నాళ్ళకి కణాలు పనిచెయ్యడం మానేసి మనకు 'నిద్రలేమి' వ్యాధిని అంటిస్తాయని వారు హెచ్చరిస్తున్నారు. కాఫీ లేకున్నా బ్రతగ్గలం గానీ... నిద్రలేకుంటే...

న్నాయి. పున్నమి దగ్గర్లోనే వుండటంతో వెలుతురుగానే ఉంది.

ట్రాక్టర్ బుర్రుమనే శబ్దం వినిపించింది. రామచంద్ర నడకలో వేగం పెరిగింది.

ట్రాక్టర్ వద్దకు చేరుకున్నాడు. దాదాపు యిరవై మంది దాకా వున్నారక్కడ. రకరకాలుగా మాటలు సాగుతున్నాయి.

ఒకరి పొలం అయిపోతానే మరొకరి పొలం దున్నుకుంటా ట్రాక్టర్ పోతాంది. పొలం దున్నకం అయిపోయిన వాళ్ళు డబ్బు ఇచ్చేసి అక్కడినుండి వెళ్ళిపోతాండారు. వాళ్ళకు పక్కల పొలాల వాళ్ళొచ్చి జత కలుస్తాండారు.

రామచంద్ర మూడెకరాలు దున్నేప్పటికి తెల్లవారుజాముున నాలుగయింది.

అక్కడినుంచి కాళ్ళీడ్చుకుంటా యింటికి వచ్చాడు. ఎద్దులుండేవాళ్ళు ఒకరిద్దరు మడకలతో చేను దున్నుకోవడానికి తయారవుతున్నారు.

సాయంత్రం తిన్న అన్నం ఎప్పుడో అరిగిపోయింది. అప్పుడు మళ్ళీ కొంత అన్నం తిని పడుకున్నాడు. బాగా నిద్ర పట్టేసింది.

"ఏంబా... బా... ఏంబా..." అంటా చేతిమీద తట్టుతా రమణమ్మ పిలవడంతో బలవంతంగా కళ్ళు తెరిచాడు రామచంద్ర. అతని కండ్లు చింతనిప్పుల్లా వుండాయి.

"నిద్ర చాలినట్లు లేదే... శివరాం వచ్చినాడు. పీలేరుకు పోవాలంట"

వెంటనే లేచి కూర్చున్నాడు. మండుతున్న కండ్లను పులుముకున్నాడు. 'టైమెంత' అంటా గోడ గడియారంవైపు తిరిగి చూశాడు. ఏడున్నర... "ఏడీ శివరాం" అడిగాడు భార్యను.

"అప్పుడే రెండు తూర్లు వచ్చి పాయ. మారేళ్లకు పొయ్యేసి తొమ్మిది గంటల బస్సుకు పోదాం అన్నాడు. ఎనిమిది గంటలకు ఎలబారాలంట" అంది రమణమ్మ వంటగదిలోకి పోతా.

వంటగది తలుపుకు నేరుగా హాల్లో ఉండే రోటిలో పూరిమిండి ఏదో నూరుతోంది శారద. ఒకసారి వళ్ళంతా నెటికలు విరుచుకుని లేచి నిల్చున్నాడు రామచంద్ర.

మళ్ళీ వచ్చాడు శివరాం "ఏంనా పోదామా" అంటా.

"ఇప్పుడే లేచినా. సరిగా ఎనిమిదికి ఎలబారేద్దాంలే. శారదా వాడేడి" కూతుర్ని అడిగాడు కొడుకు గురించి.

"మడికి నీళ్ళు కట్టేదానికి పోయినాడు నాయనా..." బదులిచ్చింది శారద, రోట్లోని పూరిమిండిని కూర గిన్నెలోకి తోడతా.

"ఏంబా... వాన్నంపతావా? " రమణమ్మ వంటగదిలో నుంచి అడిగింది.

"ఆ... వాని మొగంలే. పీలేరుకు పోయినాడంటే ముందుగా వాడు సిన్మాకే పోతాడు. నేనే పోతాన్లే" అన్నాడు.

గబగబా కాలకృత్యాలు తీర్చుకుని, స్నానం చేసేసి, వున్న వాటిల్లో కొంచెం బాగున్న బట్టలే వేసుకున్నాడు. అన్నం తింటా వుండగా శివరాం, సహదేవనాయుడు, సత్తార్, అల్లా బాషా వచ్చి ఒకసారి ఇంట్లోకి తొంగిచూసి వీధిలో నిలబడుకోని మాట్లాడుకుంటా వుండారు.

రాత్రి సరిగా నిద్ర లేకపోవడం, తెల్లవారుజామున తినడం, తొందరగా పోవాలనుకోవడం వల్ల... అన్నం సహించలేదు రామచంద్రకు. కొంచెమే తిని చేయి కడుక్కున్నాడు.

"మధ్యాహ్నం వచ్చేలకు ఏయరవ అయిదాతో ఏమో... ఇంకొంచెం తినిండగూడదా"

"తినబుద్ధి కాలేదులెయ్యే..." అంటా పూజ గదిలోకి వెళ్లాడు. చెక్క బీరువా తాళం తీసి అందులోనించి రెండువేల ఐదువందలు తీసుకున్నాడు. భార్యకు పోయొస్తానని చెప్పి వీధిలోకి వచ్చాడు.

దాదాపు పదిమంది వున్నారు ఇంటి ముందు. మారేళ్లవైపు నడక మొదలుపెట్టారు.

వాళ్ళు మారేళ్ళకు పోయేటప్పటికి, అక్కడ ఇరవై ముప్పైమంది దాకా ఉండారు.

బస్సు తొమ్మిదింకాలుకు వచ్చింది. ఆ బస్సులో పీలేరుకు పోయాలకు పదిన్నర.

అప్పటికే బస్టాండ్ దగ్గరుండే మార్కెట్ యార్డ్ దగ్గర చాలామంది రైతులంతా ఉండారు.

అరగంటసేపు రోడ్డుమీద బైఠాయించారు.

రైతు నాయకులంతా ఆవేశంగా ప్రసంగించారు.

రైతులకు ఎంత పొలముందో అంతటికీ సరిపోయే అన్ని విత్తనాలు ఇవ్వాలన్నారు. సబ్సిడీ పెంచాలి, ఆయా మండల కేంద్రాల నుంచే విత్తనం కాయలు సరఫరా చేయాలని డిమాండ్ చేశారు.

తిరుపతి, మదనపల్లి, కడప, చిత్తూరుకు పోవాల్సిన బస్సులు, ఇతర వాహనాలు ఎక్కడివక్కడ నిలిచిపోయాయి. పోలీసులు వచ్చారు. ఒక దశలో తీవ్ర ఉద్రిక్తత నెలకొంది.

అక్కడి నుంచి అందరూ ప్రదర్శనగా మండల కార్యాలయానికి వెళ్లారు. అక్కడి కార్యాలయం ఎదురుగా ధర్నా నిర్వహించారు. అరగంట తర్వాత తమ డిమాండ్లతో కూడిన వినతి పత్రాలను ఎంఆర్ఓకు ఒకటి, ఎంపిడిఒకు ఒకటి ఇచ్చారు.

కలెక్టర్‌తో మాట్లాడి న్యాయం చేస్తామని అధికారులు హామీ ఇవ్వడంతో వెనుదిరిగారు.




ఆ రోజు జూన్ 3.

నిండు చందమామ ఆకాశం నుంచి కొంటె చూపులు చూస్తాండాడు. వెన్నెల పట్టపగల్లా వుండాది. వుండుండి ఒక్కోసారి చల్లటి గాలి వీస్తాండాది.

రామచంద్ర ఇంట్లో కూర్చుని లైటు వెలుతురులో అప్పుల చిట్టాను పరిశీలిస్తా వుండాడు. బోరు వేసిందానికి, టమేటాకు అయిన అప్పు ఇప్పుడు వేరుశనగకు అవుతాండే అప్పు ఈసారి చెరకు, వరిలో వచ్చే ఆదాయం లెక్కలేసుకుంటా వుండాడు.

"చిక్కుడు పూసి చిక్కుడు గాసినే... ఓ లచ్చిమిదేవి.

చిక్కుడు కొనలు ననల బారెనే.

బంగరంపు రంగనీధిలో ఓ లచ్చిమిదేవి భారీ కోలాటమేద్దమా..."

లయబద్ధంగా మోగుతున్న చప్పట్ల శబ్దంతో పాటు పాట విన్పిస్తాంది. రమణమ్మ, శారద, బాలకృష్ణ కూడా అక్కడకు వెళ్లారు. దాదాపు వూరు వూరంతా అక్కడే వుంది. రామచంద్ర ఇంట్లోనే కూర్చుని లెక్కలు చూసుకుంటా వుండాడు. అప్పటికే రెండుసార్లు వచ్చి పిలిచి వెళ్లారు.

"మామో... రా... మళ్ళ చూసుకుందువు. అంతా ఆడుంటే నువ్వేం చేస్తాండావీడ" అంటా వచ్చి రామచంద్ర చేయి పట్టుకుని లాక్కుని వెళ్ళాడు అల్లాబాషా.

దారిలో రాములవారి గుడి వద్ద నుంచి వస్తున్న అగరొత్తులవాసన చుట్టుపక్కల వ్యాపిస్తోంది. గుడి దగ్గర అరుగుల మీద, గోడల మీద మొలకలు పెట్టిండారు. నడీధి దగ్గరయ్యే కొద్దీ పాట, చప్పట్లు మాటలు గట్టిగా వినపడుతున్నాయి.

"ఏంనా... ఎన్నిసార్లు చెప్పంపేది..." అన్నాడు శివరాం.

"ఏందో లేప్పా... యింగా నేనేమన్నా పిల్లోన్నా..." అన్నాడు నవ్వుతా రామచంద్ర.

"రామిరెడ్డి మామకంటే పెద్దోనివా నువ్వు..." అన్నాడు సహదేవనాయుడు.

జక్కీక వేస్తున్న వాళ్లలోనించి అప్పుడే పక్కకు వస్తున్నాడు రామిరెడ్డి

సుమారుగా డెబ్బై ఏండ్లుంటాయి ఆయనకు. అంత వయసులో కూడా చిన్న పిల్లలతో సమానంగా ఎగరడం ఆశ్చర్యం అనిపించింది రామచంద్రకు.

చుట్టూ బండలమీద, యింటి ముందు అరుగుల మీద కొంతమంది కూర్చుని

వున్నారు. కొంతమంది నిలబడుకోని వుండారు. ఆడవాళ్ళు, మగవాళ్ళు కలిసే జక్కీక వేస్తాండారు. ఒకరు పాట పాడుతుంటే మిగిలిన వాళ్ళంతా వంత పాడుతున్నారు.

రామచంద్రను ఎప్పటివో...పాతిక ముప్పై ఏళ్ళనాటి జ్ఞాపకాలు చుట్టుముడుతున్నాయి.

అప్పుడు మొలకల పున్నమి నెల వస్తే చాలు, అందరికీ ఎంత సంతోషమో..

అమావాస్య పోయి పడమర చందమామ కనిపించిన రోజు నుంచీ, సాయంత్రాలు పిల్లలు వీధుల్లో చేరి ఆటలాడేవాళ్ళు. చంద్రుడు దినదినానికీ పెరుగుతా ఆకాశంలో రాత్రుల్లో వుండే సమయం ఎక్కువయ్యే కొద్దీ పిల్లలు కూడా రాత్రుల్లో ఆడే సమయాన్ని పెంచుకునే వాళ్ళు.

రకరకాల ఆటలు పిల్లల సంఖ్యను బట్టి.. వాళ్ళలో స్నేహాలను బట్టి ఆటలు ఆడేవాళ్ళు. పున్నమి యింక ఐదారు రోజులుండాదనంగా రాత్రుల్లో సందడి ఎక్కువయ్యేది.

పిల్లలతో పాటు ప్రాయపోల్లు ఆటల్లోకి దిగేవాళ్ళు. అబ్బాయిలంతా చెడుగుడు ఆడితే అమ్మాయిలంతా సారసక్కా సవరాబండి ఆడే వాళ్ళు. అందరూ కలిసి 'ఉప్పరాపట్టి' ఆడేవాళ్ళు. పున్నమికి రెండు రోజులు వుండాదనంగా పెద్దలంతా వీళ్ళతో జత కలిసేవారు. పిల్లలు ప్రేక్షకులయ్యేవాళ్ళు. నడివీధంతా పెద్దలతో నిండిపోయి వాళ్ళ ఆటపాటలతో వూరు వూరంతా పులకించేది. ఆడా, మగా భేదం లేకుండా అంతా కలిసి జక్కీక వేసేవాళ్ళు. మొలకల పున్నమీ రోజయితే సందేళ పొలాల దగ్గరనుండే చిన్నచిన్న గుళ్ళ దగ్గరా, పెద్దల సమాధుల దగ్గరా, రాముల వారి గుడిలో కొబ్బరి కాయలు కొడతారు. వారం దినాల ముందునించి చిన్నచిన్న కుంపట్లలో పప్పుదినుసులు నానేసి అమ్మాయిలు మొలకెత్తిస్తారు. అవి ఎంతబాగా మొలకొస్తే అంత మంచి మొగుడు వస్తాడని నమ్మకం. వాటిని తీసకపోయి గుడివద్ద పెట్టి, కొబ్బరి కాయ కొట్టి, కొన్ని మొలకలు తుంచుకుని తల్లో తరుముకుంటారు.

గుడి దగ్గర కొట్టిన కొబ్బరికాయను చిన్న ముక్కలు చేసి, బెల్లం కలిపి అందరికీ పంచుతారు. ఎనిమిది లోపలే అన్నం తినడం కూడా పూర్తిచేసి వీధిలోకి చేరిపోతారు. యిక అప్పటి నుంచి ప్రారంభమవుతుంది కోలాహలం. పాటలు... మాటలు... ఆటలు... తెల్లారేదాకా ఆగదు.

అదంతా గుర్తొచ్చి 'ప్ఛ్'.

అదంతా ఒక



ఎర్రికాలం" అనుకున్నాడు రామచంద్ర.

"ఏం మామా., యింటికొచ్చి అన్నిసార్లు పిల్వాల్నా" అన్నాడు సత్తార్.

"యింగా మనం పిల్లోల్లమారా"

"దినమ్మా ఆడతాండామా? సమచ్చరానికి ఒకసారే గదా. యింతకు ముందయితే రెండు వారాలు ఎగిరేవాళ్ళం. యిప్పుడు ఒక దినం వచ్చి రెండు గంటలు ఆడుకునే దానికి కూడా పాలుమాలతా వుండారే" అన్నాడు రామిరెడ్డి.

"ఏందో మామా ఆ రోజులు వేరులే. అప్పు డంత నిమ్మళం యిప్పుడుందా? మనసుకు నిమ్మళం వుంటే ఆటయినా, పాటయినా" యాష్టపోయాడు రామచంద్ర.

"ఔన్లే యింతకు ముందు పిల్లో లంతా చెర్లో ఆడతాండిరి. మా యింటెనకాల దిబ్బల కాడ ఆడతాండిరి. యిప్పుడు చెరువంతా రబ్బర్ చెట్లుండాయి. దిబ్బల కాడాంత అదేందో గడ్డి అల్లుకోనుండాది. ఏలు పెట్టేంత సందుగూడా లేదు. మనుషులు మారతాన్నెట్టే అయ్యి గూడ మారతాండయేమో..."

"ఔను కదా మామా... కొరముట్లు వాడతాంటేనే బాగుండేది. లేకుంటే



చిలుం పడుతాండ్లా. అంతేనేమో యియ్యికూడా.."

"పిల్లోల్లను యింట్లోనించి బయటకు రానిస్తే గదా. ఆడోళ్ళకు టివి పిచ్చి పట్టుకునింది"

పాటయిపోయినట్టువుంది. చప్పట్లు ఆగిపోయాయి. గసగా వుందేమో, చాలామంది నుంచినీళ్ళు తాగుతున్నారు. కొంతసేపట్లోనే అందరూ గూమిగూడినారు. యిద్దరిద్దరు ఒకరి కుడిచేతిని మరొకరు పట్టుకోని గుండ్రంగా నిలబడుకోనుండారు.

"నేనెయ్యాలబ్బా..." అంటా వచ్చింది జఫూర్.

"ఆడ మీ మామ వుండాడు చూడు. పట్టక రా పో" భర్తను చూపించింది రమణమ్మ.

జఫూర్ పరుగున పోయి రామచంద్ర చేయిపట్టుకోని "రా మామా జక్కీక ఏద్దాం" అంటా లాక్కుపోయింది.

"నానించి కాదుమ్మే" అని అంటా వున్నా వినిపించుకోలా...

అందరూ... "రా మామా... రాన్నా.. చిన్నాయనొస్తాండాడు" అనరస్తాండారు గట్టిగా యింక తప్పదనుకోని "తాలు వుండుమ్మే" అని తన చేతిని విడిపించుకున్నాడు. పంచెను పైకి మడతబెట్టి నడుము వద్ద గట్టిగా బిగించి కట్టుకున్నాడు. పై పంచెను తలకు చుట్టుకున్నాడు. అందరూ కోటలు పట్టుకోని రామచంద్ర కోసరమే కాసుకోనుండారు. జఫూర్ కుడి చేతిని తనచేత్తో పట్టుకుని "ఏద్దామా" అన్నాడు.

"ఆఁ.." అన్నారంతా.

'తూరుపు కొండలకు నా మరిదీ... వాడు తుమ్మేటగాడమ్మా నా మరిదీ' పాటెత్తుకుంది నమిషా. అందరూ వంత పాడుతున్నారు

అందరూ ఒక్కసారిగా అటువాళ్ళు యిటు, యిటువాళ్ళు అటు తిరిగి చేతులు వదిలేసి చప్పట్లు చరస్తాండారు. చప్పట్లు చరుస్తూనే ఒకరి చుట్టూ ఒకరు తిరుగుతూ పక్క మనిషికి చేయి అందిస్తా గుండ్రంగా తిరగతాండారు.

అది ఎలా వుందంటే సూర్యుని చుట్టూ భూమి తిరిగినట్టుగా వుంది.

ఆరేడుసార్లు చప్పట్లు పడ్డాక అందరూ కుదురుకున్నారు.

అందరూ ఒకేసారి చప్పట్లు వేస్తున్నారు... ఆ శబ్దం ఒక లయలా వుంది.

"ఎవురన్నా పాడండి పాట..."

"రామచంద్రన్నో... పాడూ నువ్వు.."

"నానింటి కాదుమ్మా. మీరే ఎవురన్నా పాడండి"

"నమిషా. నువ్వు పాడు"

"నమిషా నువ్వు పాడు... పాడు..." అన్నారంతా

"తూరుపు కొండలకు నా మరిదీ

వాడు తుమ్మేటగాడమ్మా నా మరిదీ" పాటెత్తుకుంది నమిషా.

అందరూ వంత పాడుతున్నారు. పాటకు చప్పట్లు తోడు కావడంతో వినసొంపుగా వుంది. పాటయిపోయింది. చప్పట్లు అలానే వేస్తూ ఒకరి చుట్టూ ఒకరు తిరుగుతూ, పక్కవాళ్ళకు చేతిని అందిస్తా, గుండ్రోతంగా తిరగతావుండారు.

"యింగా నీకు పెండ్లే కాలా, మరిది యాట్నించి వచ్చినాడుమ్మే" అడిగింది శ్రీదేవి.

ఆ మాటలకు అందరూ నవ్వారు. నమిషాకు సిగ్గు వచ్చేసింది.

"అదో... ఎవరిదో చప్పట్లు కలవలా... బాగెయ్యాల" అన్నాడు నర్సింహులు.

"పాట పాడండి. పాటుంటే హుషారుంటాంది... నర్సిమ్ములు నువ్వు పాడూ"

"నేనా..."

"ఆఁ... నువ్వే పాడు..."

"నేనా..." అని కాసేపాగి పాటందుకు

న్నాడు నర్సింహులు.

"సెర్లోటి బాపన్నయ్య జపమే జేయంగా
జపమే జేయంగా... ఓ రామయా...
మాలోల్ల పిల్లమింద మనసే పడిందీ
మనసే పడిందీ ఓ రామయా...

యిలా దాదాపు అన్ని కులాలను చెప్తా పాట సాగింది.

మధ్యలో వచ్చిన వాళ్ళు జత ఉంటే వాళ్లతో కలుస్తాండారు... పాటయి పోతానే గస వస్తాండే వాళ్ళు పక్కకు పోతాండారు.

దాదాపు అర్ధరాత్రి దాంకా జక్కీక వేశారు. అదయితానే అందరూ ఉప్పరాపట్టి ఆడాల న్నారు. ఆడేవాళ్లంతా పద్దెనిమిదిమంది తేలి నారు. తొమ్మిది తొమ్మిది మంది రెండు జట్లుగా విడిపోయారు.

శివరాం వాళ్ళ యింటికాన్నించి బకెట్‌తో నీళ్ళు తెచ్చారు. చెంబుతో నీళ్ళు ముంచుకుని మూడు బారల వెడల్పు, పది బారల పొడ వుతో నలుచదరంగా వచ్చేటిగా వీధిలో నీళ్ళు పోశారు. అడ్డంగా మరో ఎనిమిది పట్టిలు నీళ్లతో గీసినారు. వాటికి మధ్యలో నిలువునా యింకో పట్టి గీసినారు.

నిలువు పట్టిలో ఒకరు నిలబడుకోనుం టారు. అడ్డ పట్టిల్లో ఎనిమిది మంది నిలబ డుకోని ఉండారు. యిటుపక్క నుండేవాళ్ళూ వాళ్లను తప్పించుకుని ఆ చివరకు పోయి, ఒక్కరయినా సరే... అక్కడి మట్టిని తీసుకుని ఈ చివరకు రావాలి. పట్టిల్లో నిలబడుకో నుండే వాళ్లు చేతికి చిక్కితే ఔట్.

పద్దన్నే చెరకు తోట సుట్టకానికి పోవాలని రామచంద్ర యింటికి పోయి పడుకున్నాడు.

యింటికి వచ్చి పడుకుంటానే మళ్ళీ అప్పులు, వడ్డీలు, పంటలు, రాబడి, పెట్టు బడి... అంతా కళ్ళలో మెదలతా ఉండాది. ఎప్పటికో నిద్ర పోయాడు. భార్యాపిల్లలు ఎప్పుడొచ్చి పడుకున్నారో కూడా తెలీదు.

ఇంకా మసకచీకట్లు కమ్ముకొనే ఉండాయి.

రెండు రోజుల ముందు వాన పడ్డంతో వాతావరణం చల్లగా ఉంది. తూర్పున ఎర్ర పట మెగిరింది. రామచంద్ర పొలం వద్దకు వెళ్లేటప్పటికి వెలుగు రేకలు పరచుకుంటా ఉండాయి.

చెరకు తోట ఏపుగా పెరగతాండాది. వరి ఎన్ను వంగతాండాది. వరినారు పచ్చగా నిగ నిగలాడతాండాది.

రెండెకరాల నేలలో కాపయిపోయిన టమేటా చెట్లు ఎండిపోయిండాయి. ఒకటీ రెండు చెట్లలో జీవమున్నట్లు పచ్చటి ఆకులు తెలుపుతాండాయి. తొట్టి దగ్గర ముఖం కడు క్కున్నాడు. అంతలో తోట సుట్టడానికి కూలీ లు వచ్చారు. మాలవాడ నుంచి నలుగురు, తమ పల్లె నుంచి యిద్దరు వచ్చిండారు. అందరూ చెరకు తోటను చుడుతున్నారు.

ఏపుగా పెరిగిన చెరకు గడలను ఆరేడిం టిని కలిపి, కింద వైపున్న ఆకులను తాడు మాదిరిగా చుడుతున్నారు. చెరకు ఆకులు తగిలి వాళ్ళ ఒళ్ళు గీసుకుపోతాంది. అయినా అది మామూలే అన్నట్లున్నారంతా. వాళ్లతో జత కలిశాడు రామచంద్ర.

"ఈసారి తోట బాగుండాదినా, ఎట్ల లేదన్నా ఎకరాకు ముప్పై గోనెలు అయితాది బెల్లం" అన్నాడు రమణయ్య.

"అంతేడయితాదిరా"

"లేదన్నా అయితాది. మేము ఎన్ని తోటలు సుట్టిండ్లా. నెలనించీ రెండో సుట్టకా నికి దినమ్మూ పోతాండాం. మనూర్లోనే కాదు, సుట్టు పక్కల ఊర్లలో గూడా తోట ఈ మాదిరిగా లేదు" అన్నాడు రమణయ్య, తను అన్నది నిజం అన్నట్లుగా.

ఆ మాటలు రామచంద్రలో ఆనందం నింపాయి. "నీ నోటి పున్నేన పంట బాగొస్తే చాల్లేరా. కొన్ని కష్టాలన్నా తీరతాయి. ఈసారి టమేటాలు దెబ్బతీసె" దిగులుగా చెప్పాడు రామచంద్ర.

"పోనీలేన్నా, ఏది ఎంత రుడమో అంతే. నీ కొగనికే కాదుగదా... ఎంత మందిది పోలా. ఈ నష్టమంతా చెరుకులో పూడి పోతాదిలే" ధైర్యం చెప్పాడు రమణయ్య.

"ఏం పూడతాదో ఏమో... టమేటాలు గన రేటున్నింటీ ఈసారి ఆ రెండెకరాలు మడి నాటేదానికి చేతిలో దుడ్డు ఉన్నిండు. యిప్పుడు ఒక పైసా లేదు. మడి చేడకెయ్యా లంటే మళ్లీ అప్పు చెయ్యాల. ఎంత కాలమని అప్పులు చేసి సేద్దిం చేస్తాం. ఎంత కాలం అప్పులు దొరకతాయి? "

"అందరూ అంతేగదన్నా, సేద్దిం చేసేటోళ్ళు అప్పు చెయ్యంది ఎవురు? "

"అట్ల అప్పుల మీద అప్పులు చేసి, తీర్చలేక, పరువు పోతాందనే రైతులంతా సస్తాండేది"

"ఔన్నా కాంగ్రెసోళ్ళు ఏదో పెట్టినారంటనే అదేందో చెప్పినారునా. పేపర్లో దినమ్మూ ఏస్తాండారు. ఆత్మహత్యలు చేసుకోవద్దండి. మీకేమన్నా అప్పులుంటే మాకు ఫోన్ చేయండి. మేమొచ్చి ఆదుకుంటాం అని ఫోన్ నెంబర్లు ఏస్తాండారంట. ఒగటి ఎమ్మార్వో దుట, యింగోటి కలెక్టర్ ఆఫీసులోదంట. ఆ నెంబరుకు ఫోన్ చేసి నాకు అప్పులుండాయి, నేను సచ్చిపోతాండా, నన్ను ఆదుకోండి అంటే చాలంటనే ఎమ్మెల్యే వచ్చేస్తారంట వోళ్ళు.. నిజమేనా? " ప్రశ్నించాడు లక్ష్మయ్య.

నిజమే అన్నారెవరో.

రామచంద్ర బీడీ తాగడం కోసం చెరకు తోటలోనించి బయటకు వచ్చాడు. వరి మడి వద్దకు వచ్చి బీడీ వెలిగించాడు.

వరి మడిలో తడి వుందిగానీ, నీళ్ళు లేవు. ఆ కయ్యను చూస్తాంటే రామచంద్రకు గుండె కాల్చినట్టుగా వుండాది. వారం దినాలనుంచి బోర్లో నీళ్ళు తగ్గినాయి. ఎవురితో చెప్పుకోలా ఆ మాట. నీళ్ళు చాలక నాలుగు దినాలకు ఒక తడి కడతాండాడు. నీళ్ళు తగ్గినాయనే సంగతిని బయటకు చెప్పుకోలేక మనసులో పెట్టుకోలేక తనలో తనే బాధపడుతున్నాడు.

వడ్లు నారు పోశాడు కానీ, నీళ్ళతో భయ పడతా వుండాడు.

మధ్యలో నీళ్ళు నిల్చిపోతే ఏం చేయాల.

కనీసం చెరకు వచ్చేదాకా వున్నా బాగుండు. దాంట్లో దుడ్డు వస్తాది. మళ్ళీ యింగో బోరేసి ఎట్లోగట్ల చేయచ్చు యియ్యి ఆయరవదాంకా వచ్చేటిగా లేవే అని దిగులు పడతా వుండాడు. నీళ్ళు బాగుండాయని రెండు మూడు పంటలు తీస్తే అప్పులన్నీ తీరిపోయి బిడ్డలకు పెండ్లి చేయొచ్చని అనుకున్నాడు. కూతురుకు మాసువుల్లో కుప్పం అబ్బాయితో పెండ్లి చేయాలని అనుకున్నారు. ఈ నీళ్ళను చూస్తాంటే అసలకే మోసం వస్తాండాదే అని బాధపడ్డాడు. ఒక్కసారిగా నోరంతా చేదుగా అయినట్టనిపించింది. దూరంగా కూతురు సద్దితీసుకోని వస్తా కనిపించింది. గుండెలను మెలిపెట్టినట్లయింది. ఏం కాదు...నీళ్ళు మళ్ళ బాగొస్తాయి. మొన్నేగదా వాన పడింది. యిం క వానలు పడతాయి... నేల శాంతగిస్తాది. బోర్లో ముందు మాదిరిగానే నీళ్ళొస్తాయి అని తనకు తనే ధైర్యం చెప్పుకున్నాడు.

"రా నాయనా సద్ది తాగుదువు" శారద పిల్చింది.

తొమ్మిది గంటలు కావస్తాంది. ఎండ చిర చిరలాడుతుంది. మూడు రోజులు ముందుప డిన వానకు చెట్లన్నీ పచ్చగా కళకళలాడతాం డాయి. నేలంతా పచ్చిక మొలస్తాంది. వుండుండి వీస్తాండే గాలికి చెరకు ఆకులు కదలి చప్పుడు చేస్తాండాయి. ఆకు కొట్టేసిందే కానుగ చెట్లనుంచి వేలు లావుతో, మూడు నాలుగు మోరల పొడవుతో తీగల్లాగా కొమ్మ లు వచ్చిండాయి. వాటి లేతాకుల పచ్చదనం సూర్యరశ్మి పడుతుంటే మరింతగా తళతళలా డుతోంది. ఆ చెట్టు కింద ఎంతో చల్లగా వుండాది. రామచంద్ర కడుపులోకి సద్ది చల్లగా పోతాంది. కానీ మనసే కాలతాన్నెట్టు వుంది.

"బాలక్రిష్ణ ఏం చేస్తాండాడు" అడిగాడు కూతుర్ని. ఎందుకో కొడుకు మింద అకార ణంగా ప్రేమ పుట్టుకొచ్చింది రామచంద్రకు.

చెప్దామా, వద్దా అన్నట్టు కాసేపాగి "యింటికాడ లేదు నాయనా" అంది.

పోసీలే, నేనున్నెంత కాలమయినా వాడు సుఖంగా వుండనీ. నేను పోయినాంక వాని కెట్లా ఈ తిప్పలు తప్పవు అనుకున్నాడు.

"అమ్మేం చేస్తాందాది...?"

"అన్నం చేస్తాన్నింది. గోగాకు పెరక్కర మ్మని చెప్పింది నాయనా"

"పెరుక్కోపోమ్మా" అన్నాడు కూతురితో.

చెరకు తోటలో చుట్టూ గెనం వారంటీ గోగాకు మొక్కలు నడుమెత్తువుండాయి. శారద గోగాకు కోసుకొచ్చింది. సద్ది తెచ్చిన క్యారేజీని తీసుకుని, గోగాకు సంకలో పెట్టు కుని యింటిదారి పట్టింది. రామచంద్ర బీడీ వెలిగించి తాగుతా కూతురు కనిపించేంత దూరం చూస్తానే వున్నాడు.

ఎందుకో కూతుర్ని చూస్తావుంటే అతడి కళ్ళలో నీళ్ళు తిరిగాయి. కండ్లు మసక బారాయి. కళ్ళ నీళ్ళు తుడుచుకున్నాడు.

మాటలు చెప్పుకుంటా తోట చుట్టుతాండా రంతా.

పొద్దు ఎగబడే కొద్దీ తోటలో వుడికిపో తోంది. కొలిమిలో పెట్టినట్టుగా వుంది వాళ్ళ పరిస్థితి. వళ్ళంతా చెమట. చెరుకాకు గీసుకు పోయిన చోట మంట.

"రమణా...అది మోటర్ గదా...యిను" అన్నాడు రామచంద్ర.

అందరూ చేస్తున్న పనిని ఆపేశారు కొంత సేపు.

"ఔన్నా..." అన్నాడు రమణయ్య.

"నేను మడికి నీళ్ళు పారగడతా... మీరు చుడతాండండి" అని తోటలోంచి బయటకు వచ్చాడు రామచంద్ర. పక్క పొలం కాడ మోటర్ పోతాంది. రాజయ్య మిరప తోటకు నీళ్ళు కడతాండాడు.

ఎంచేపయిందో ఏమో కరెంటొచ్చి అను కుంటా పోయి స్విచ్ వేశాడు. మోటార్ శబ్దంతో పాటు నీళ్ళూ బయటకు వచ్చాయి. కాసేపట్లోనే నీళ్ళు కాలవంటే పోయి కయ్యిలో పడ్డాయి.

పైపులోనించి దుంకుతాండే నీళ్ళనే చూస్తా కూర్చోనుండాడు రామచంద్ర.

ఈ నీళ్ళతో ఎన్నెన్ని తంటాలు పడ తాండాం. నీళ్ళుంటేనే సేద్దిం. నీళ్ళు లేకుంటే. పంట లేదు. పంట లేకుంటే దుడ్డు లేదు. దుడ్డు లేకుంటే బతుకు లేదు. బతుకుండా లంటే... నీళ్ళుండాల. నీళ్ళ కోసం ఎంతెంత కష్టాలు. ఎన్నెన్ని గొడవలు. ఎంతమంది అన్నల దమ్ముళ్లు తలలు పగల గొట్టుకోలేదు. నీళ్ళ కోసం కూనీలు గాలేదు. కాపురాలు కూలి పోలేదు. అప్పులయి పోలేదు. ఓరి భగమంతుడా... ఇంగయినా నీళ్ళు బాగుండే టిగా చూడు. నా బిడ్డలకు పెండ్లిండ్లయ్యేటిగా చూడు. అప్పులు తీరిపోయి రుడం లేకుండా సావాల స్వామీ అనుకున్నాడు రామచంద్ర. అతని కండ్లల్లో నీళ్ళకోసం గొడవలు పడి నోళ్ళు, నరుక్కున్నోళ్ళు, వేరుభాగాలు పోయి నోళ్ళు మెదలతాండారు. నాకన్న దమ్ములు లేరు. ఒగడే కొడుకు. ఆ బాధ లేదులే అను కున్నాడు.

"న్నో రామచంద్రన్నో, నీళ్ళు సన్నంగా వస్తాండాయి" కేకేసినాడు— నీళ్ళు తాగను పోయిన ఖాసిం.

## 'సమ్'బంధం!

సంఘసేవకులకు బిరుదులిచ్చే కమి టీలో దుగ్గిరాల కూడా ఓ సభ్యుడు. ఒక సారి దువ్వూరి సుబ్బమ్మగారికి ఏమని బిరుదివ్వాలా అని అంతా తెగ ఆలో చించి చివరికి 'దేశబాంధవి' ఇద్దామని ఖాయం చేశారు. ఆ తర్వాత మరో దేశ భక్తుడికి 'దేశబాంధవ' ఇద్దామని ఒకా యన సూచించాడు.

వెంటనే దుగ్గిరాల 'వద్దొద్దు. ఆవిడకు దేశబాంధవి ఇచ్చి, ఈయనకు దేశబాం ధవ ఇస్తే జనం వీళ్లిద్దరికీ ఏదో సంబం ధం ఉందనుకుంటారు' అని నిర్మొహమా టంగా చెప్పారు. అంతే! సభ్యులంతా ఘొల్లున నవ్వారు. తర్వాత ఆ దేశభక్తు డికి అదికాక మరో బిరుదేదో ఇద్దామని నిర్ణయించుకున్నారు.

రామచంద్రకు మొదట అర్థం కాలేదు, అతను చెప్పింది.

"న్నో, నీళ్ళు సన్నంగా వస్తాండాయి" మళ్ళీ అరిచాడు ఖాసిం.

ఆ మాటలు వింటానే గబగబా లేచాడు రామచంద్ర. కరెంటు వీగ్గా వస్తాందేమో అనుకుంటా పరుగు పరుగున వెళ్ళాడు మోటారు దగ్గరకు. నీళ్ళు దాదాపు నిలచిపో యాయి. మోటర్ బుర్రుమనే శబ్దం వస్తాం దంతే. స్విచ్ ఆఫ్ చేసినాడు.

రామచంద్ర గుండె వేగం పెరిగింది. "కరెంటు వీగ్గా వస్తాందేమో" అన్నాడు. తన గొంతు తనకే సరిగా విన్పించడం లేదు.

"బాగా దప్పిగ్గా వుంటే నీళ్ళు తాగదామని వస్తిన్నా. చూస్తే సన్నగా వస్తాండాయి నీళ్లు... నిన్నరిసినా" వివరించాడు ఖాసిం.

"కరెంటు వీగ్గా వుండాదేమో..."

"లేదన్నా ఆడ రాజన్నోళ్ళ మోటర్ పోతాం డాదే. కరెంటు బాగానే వుండాది" అన్నాడు పక్క పొలంవైపు చేతిని చూపిస్తా.

రామచంద్రకు గుండె వేగంతో పాటు, వంట్లో వణుకూ మొదలయింది. బోర్లో నీళ్ళ యిపోయినాయి.

"లేదు లేదు నీళ్ళుంటాయి" అనుకుంటా మెల్లగా వెళ్ళి వణకుతున్న చేత్తో స్విచ్ వేశాడు.

మోటార్ బుర్రుమంటూ శబ్దం చేసింది కానీ పైపులోనించి నీళ్ళు రాలేదు.

"నీళ్ళు రాలేదన్నా" అన్నాడు ఖాసిం.

స్విచ్ ఆఫ్ చేస్తా అక్కడే కూలబడ్డాడు రామచంద్ర. నిలువెల్లా చెమట్లు.

"అన్నా... అన్నా" అరస్తాండాడు ఖాసిం దగ్గరకు వచ్చి పట్టుకుంటా.

"ఏమయింది... ఏమయింది" అంటా వచ్చి నారు తోట చుడతాండే వాళ్ళంతా.

రామచంద్రకు కళ్ళు తిరుగుతున్నట్టుగా వుంది.

తను భార్యా బిడ్డలతో పాటు ఏదో లోత యిన అగాధంలో పడిపోతున్నట్టు అన్పి స్తోంది. సహాయం చేయమని అరుద్దామను కుంటా వుంటాడు, కానీ నోరు పెగలడం లేదు. గుండెల్లో మెలిపెట్టినట్టు నొప్పి.

ముఖాన చల్లగా నీళ్ళు పడ్డంతో మెల్లగా కళ్ళు తెరిచాడు.




"వాళ్ళు ఈరంటబ్బా..." అంది దిగులుగా రమణమ్మ.

"రెండు తళ్ళన్నా యిమ్మనగూడదా, సగం గింజయినా అయితాది. నూకలో ఎయ్యో ఒగటి బీటికి పోకుండా వస్తాయి" అన్నాడు రామచంద్ర.

"అడిగినాను. ఒగ తడికి గూడా ఈన న్నేడు. వాళ్ళకే చాలడం లేదంట" యింట్లో గోడకు ఆనుకుని కూర్చుంటా అంది రమ ణమ్మ.

అప్పటికి బోరులో నీళ్ళయిపోయి వారం రోజులయింది.

రామచంద్ర పొలం పక్కన వుండేది రాజయ్య పొలమే. అతని బోరులో నీళ్ళు బాగా వస్తాండాయి. వీళ్ళకన్నా స్థితిమం తుడు. మొదట్నించీ వీళ్ళ పొలాన్ని కాజేయా లని చూస్తాండాడు. యిదే మంచి అవకా శంగా భావించాడేమో, నీళ్ళు ఒక్క తడి కూడా యివ్వనన్నాడు. యింక చుట్టుపక్కల కిలోమీటరు దూరంలో ఎవ్వరికీ నీళ్ళు లేవు. వున్నా అవి వాళ్ళ సేద్యాలకే చాలడం లేదు. వారం రోజుల నించీ రాజయ్యను అడుక్కుం టా వుంటారు-నాలుగు తడులు నీళ్ళివ్వమని. ఊర్లో వాళ్ళతో అడిగించాడు. తనే పోయి అడిగాడు. చివరగా రమణమ్మ చేత గూడ

అడిగించాడు. ఎందరడినా రాజయ్య మాత్రం నీళ్ళు యివ్వను, నాకు చాలవు అని ఖచ్చితంగా చెబుతున్నాడు.

ఒకపక్క వరి ఎండిపోతోంది. యింక నాలుగు రోజులు తడి పారకుంటే పంటను వదులుకోవాల్సిందే. అందరూ అయ్యో అనే వాళ్ళేగానీ, ఆదుకునే వాళ్ళు ఒక్కరూ కన్పించడం లేదు. రకరకాల సలహాలు యిచ్చారు. రామచంద్ర మనసులో అవన్నీ గజిబిజిలా కదులుతా వుండాయి.

మళ్లా బోరేయాలంటే దుడ్డు గావాల. దుడ్డు యింగెవరిస్తారు. యిప్పటికే వుండే దంతా అడమానంలో వుండాది.

అప్పటికీ ఐదారు మందిని అడిగి చూశారు. ఎవురి దగ్గరా దుడ్డు లేదంట. కొందరు వున్నా లేదని చెప్పారని అర్థమయ్యింది. ఎంఆర్‌ఓకు గానీ, కలెక్టర్‌కు గానీ ఫోన్ చెయ్యమన్నేరు.

చాలామంది రైతులు ఫోన్‌లు చేస్తాండారంట. దినమ్మూ పేపర్లలో వొస్తాందంట ఆఫీసర్లంతా వూర్లోకి వస్తాండారంట. పేపర్లో వస్తే పరువు పోదా. అప్పులోల్లు వచ్చుడగతాండారు. బోర్లో నీళ్ళు లేవనేలకు దినమ్మూ యింటిమీదికి వస్తాండారు. ఎవురికి ఏమని చెప్పేది. శివరాం చెప్పినాడు. అదేదో 'మారటోరియం' అంట. బేంకులోల్లుగానీ, అప్పులోల్లు గానీ రైతును బాకీ కట్టమని అడగకూడదు. అట్లడిగితే పోలీసోల్లు కేసు పెడతారట. అయితే అప్పిచ్చిండే వాళ్లమీద పోలీసోల్లకు చెప్పచ్చా..? అన్నేయంగదా. బతకలేక, బతకాలని అప్పుచేసి, అప్పిచ్చిన వాళ్ళమీద కేసు పెట్టచ్చా అయితే యింగేంది దోవ.. దోవ ఏముండాది?

ఎంఆర్‌ఓకు ఫోన్ చెయ్యడమేనా?

ఫోన్ చేస్తే గుణముంటాదా... ఎక్కువ అవసరంలే. యాభై వేలిస్తే చాలు. యింగో బోరు ఏసుకోవచ్చు. బోర్లమీద బోర్లు ఏస్తాంటే నీళ్ళు యాన్నించి వస్తాయి? ఎయ్యకపోతే పంటలు ఎట్ల పండతాయి? చేతిలో దుడ్డుంటే ఎన్ని బోర్లయినా ఏసుకోవచ్చు

యిప్పుడు బోరెయ్యాలంటే దుడ్డు ఎట్లా? బోరెయ్యకపోతే బతుకు ఎట్ల?

చెరకు తోట ఏమయితుందో ఏమో. మడి వాడుమొగం పెట్టిండాది.

శారదలో వారం ముందుదాంకా వున్న పెళ్ళికళ పోయింది. బాలకృష్ణలో ముందరి ఉత్సాహం లేదు. రమణమ్మ నీరసంగా వుంటాంది. యియ్యంతా నీళ్ళు లేకనే గదా.

దుడ్డు లేకుంటే, బోరేయకుంటే, నీళ్ళు లేకుంటే, పంట రాకుంటే... పాణం తీసుకోవాల్సిందేనా. అంతేనా... యింగేం చేయాల. అప్పులోల్లకు ఏం చెప్పాల? బిడ్డలకు పెండ్లిండ్లు ఎట్ల చెయ్యాల... ఏం చెయ్యాల.

పాణం తీసుకోవాల్సిందేనా. తీసుకుంటే... గవర్నమెంటు ఒకటిన్నర లక్ష యిస్తాదంట. యిస్తే యింగ ఒకటి కాకుంటే రెండు బోర్లేసుకుంటారు. ఒకదాంట్లో పడకపోయినా యింగోదాంట్లో నీళ్ళు పడతాయి.

ఇంట్లో అంతా సుఖంగా బతుక్కొంటారు.

బతికుండి పంటల్లేక... దిగులు పడి... ఎండిపోయి... తినీ తినక, గోర్చి గోర్చి.. గుటుక్కు మనేదానికన్నా యిప్పుడే సస్తే... ఇంట్లో అంతా బాగుపడతారు...అంతా బాగుపడతారు. ఒక్కన్ని చస్తే చాలు... కుటుంబమంతా బాగుపడతాది. ఒక్కన్ని చస్తే చాలు... కుటుంబమంతా బాగుపడతాది.

"బా... ఏంబా... తిందువు లెయ్" పిలిచింది రమణమ్మ.

అప్పటిదాకా అచేతన స్థితిలో ఉండి సచేతనంగా ఆలోచిస్తున్న రామచంద్ర ఉలికిపాటుగా భార్య వైపు చూశాడు. ఆ చూపుల్లో వెర్రితనం కనిపించిందేమో ఆమెకు "బా... ఏంబా... తిందువు లెయ్..." అంటా భర్తను కుదిపింది.

"తినాల్నా..." అన్నాడు.

నెల రోజులు జ్వరం కాసిన మనిషిలా మాట్లాడుతున్నాడు.

"తినవా... పొద్దు చూడు... ఎంతెక్కిందో

## శునకమూ హ్యాట్సాఫ్!



'జాలి గుండె లేని మనిషికన్న కుక్కమేలురా' అన్నాడో సినీ కవి. ప్రేమయనే పాలుపోసి పెంచితే వాటికన్న నమ్మకమైన, స్నేహపాత్రమైన జంతువు మరొకటి లేదని పలుమార్లు రుజువయింది. కాని కుక్కలు కూడా ప్రేమయనే పాలు పోసి మానవుడిని (అదేలెండి.. శిశువును) బతికిస్తాయనే అరుదైన సంఘటన కెన్యాలో జరిగింది. అక్కడ ఏ తల్లో ఒక బిడ్డను కంది. రెండు వారాల్లోపే మాతృప్రేమ హరించుకుపోయిందో, మరే కారణమో తెలియదు గాని; ఆమే చేసిందో, ఆమె వాళ్లే చేశారో అదీ తెలియదు గాని మొత్తానికి ఆ బిడ్డ అడవి పాలయింది. అదే సమయంలో ఓ కుక్క కూడా కూనలకు జన్మనిచ్చింది. తన పప్పీలకు ఆహారవేటలో పడ్డ ఆ కుక్క కంటికి పసిబిడ్డ కన్పించింది. మురికిపట్టిన నల్లటి బట్టలో చుట్టి ఉన్న ఆ శిశువును చూడగానే శునక హృదయం ద్రవించిపోయింది కాబోలు, ఆ బట్టతోనే బిడ్డను నోట కరుచుకుంది. అలాగే బిజీ రోడ్లను దాటుకుంటూ, ముళ్ల కంచెల్లోంచి దూరిపోతూ తన కూనలున్న చోటికి చేరింది. నోటకరచి తెచ్చిన శిశువును తన కూనల పక్కన పడుకోబెట్టింది. తన యజమానురాలు మేరీ అధియంబో శిశువును చూసేవరకు పక్కనే కూర్చుని సంరక్షించింది. ఆవిడ వెంటనే శిశువుకు శుభ్రంగా స్నానం చేయించి ఆస్పత్రికి తీసుకువెళ్లింది. 3.3 కిలోల బరువున్న ఆ శిశువుకు ఆస్పత్రి సిబ్బంది ఏంజెల్ అని పేరు పెట్టారు. కనీసం రెండు రోజుల నుంచి ఏంజెల్ అడవిపాలయి ఉండవచ్చని వైద్యులు పేర్కొన్నారు. రోజుల ప్రాయంలో రెండు రాత్రులు చలిలో గడిపిన బిడ్డకు శ్వాస సంబంధ వ్యాధులు రాకుండా వైద్యులు చికిత్సాపరమైన జాగ్రత్తలు తీసుకున్నారు.

కెన్యా వంటి ఆఫ్రికన్ దేశాల్లో ఇలా తల్లులు బిడ్డల్ని వదిలించుకోవడం సర్వసాధారణమేనట. జనాభాలో 56 శాతం మంది పేదరికంలోనే మగ్గుతున్నారాయె మరి. మనదేశంలో, రాష్ట్రంలో రోజుల అనాథ శిశువులు కనిపిస్తే పీక్కుతినే కుక్కలకు అధియంబో గారి కుక్కచేత ప్రేమ, దయ, జాలి పాఠాలు బోధింపచేస్తే బాగుంటుందేమో! ◆

## ప్రేమే నేరమాయెగా...

'ప్రేమ కోసమై బిల్లు గోతిలో పడెనే పాపం పసివాడు' అని అతగాణ్ణి చూసి ముసిముసి నవ్వులతో కూనిరాగాలు తీస్తున్నారు అక్కడి వాళ్లు. అతగాడు మాత్రం ప్రేమ భాషణమే నేరమాయెగా అని వాపోతున్నాడు. అతడి పేరు డీటర్ హోమ్ బ్లట్టర్(30). జర్మనీలోని సార్ బ్రూకెన్‌వాసి. ఓ నాడతగాడు ఐదంతస్తుల భవనం పైకెక్కి ప్రియురాలితో ఫోన్ ముచ్చట్లలో పడి పరిసరాల్నే మరచిపోయాడు. చుట్టుపక్కల జరుగుతున్నదేమిటో గమనించలేనంత ప్రేమ మైకంలో కూరుకు

## అంతా చేపలోనే ఉందట!

'దీర్ఘాయుష్మాన్‌భవ' అని దీవించే పెద్దలు దాన్నెలా సాధించాలో మాత్రం తెలుపరు. బహుశా వాళ్లకీ తెలిసి ఉండదేమోలే అనుకుంటూ ఆ దీవెనతోనే సరిపెట్టేసుకుంటుంటాం. అడపా దడపా ఎవరో ఒక దీర్ఘాయుషులు ఇదే ఇదే మా జీవరహస్యం అంటూ పల్లవి పాడేస్తే అదే నిజం కాబోలనుకుంటాం. కానీ ఆ పల్లవి మన చరణంలో ఒదుగుతుందో లేదో మనకూ తెలియదు. ఇంకో విషయం యేమిటంటే ఆ పల్లవులన్నీ ఒక్కలాగే ఉండవు. శాకాహార పల్లవులు, మాంసాహార పల్లవులు, యోగా పల్లవులు... ఇలా ఎన్నెన్నో. ఇప్పుడు మనం చెప్పుకోబోతున్న బామ్మగారు మాత్రం మాంసాహార పల్లవి మహా చక్కగా పాడేస్తోంది. ఇంగ్లండుకు చెందిన కాన్‌స్టన్స్ బ్రౌన్ అనే ఆవిడ వయసు 98 ఏళ్లు. గత 80 ఏళ్ల నుంచి చేపలు, చిప్స్ తప్ప మరేమీ తినడం లేదట. కాయగూరలను అస్సలు ఆమె దగ్గరకే రానివ్వరట. చేపలు, చిప్స్ తింటూ కూడా ఇంత ఆరోగ్యంగా ఉండగలమనడానికి నేనే సాక్ష్యం సుమా అంటూ బోసినవ్వుల బడాయి పోతోంది ఇప్పటికీ. రెండో ప్రపంచ యుద్ధకాలంలో కూడ ఆమె తన హోటల్‌ను నిరాటంకంగా నడిపించిందట. వ్యాపార రంగానికి, స్థానిక సమాజానికి ఆమె అందించిన సేవలకు గుర్తింపుగా రాచగౌరవం ఆమెను వరించింది. ఈ గౌరవం తనను ఆశ్చర్యంలో ముంచెత్తిందని, ఇది తన కస్టమర్లకే చెందుతుందంటూ వాళ్లకు కృతజ్ఞతలు తెలుపుకుంటోంది బ్రౌన్. ◆





పోయాడు. రూఫ్ మీదున్న అతగాణ్ణి చూసి కిందకు దూకి ఆత్మహత్య చేసుకోబోతున్నాడని అపోహపడ్డ పోలీసులు ఏకంగా మెయిన్ రోడ్డును సీల్ చేసి ఫైర్ బ్రిగేడ్‌కు కబురు చేశారు. అతణ్ణి బుజ్జగించి ఆ ప్రయత్నం విరమింపచేసేందుకు ఎవరెవరినో పిలిపించారు. ఇంత జరుగుతున్నా గమనించని ఆ ప్రేమరోగి ప్రియా ఏమిటా సైరన్ శబ్దాలు అని ఆవలినుంచి ప్రియురాలు అడిగేసరికి ఉలిక్కి పడి పరిసరాల్ని పరికించాడు. తాను ప్రేమసరస్సులో ఈదులాడుతున్నానే తప్ప చావబోవడం లేదని మొత్తుకున్నాడు. పొరపాటు గుర్తించిన అత్యవసర సర్వీసుల సిబ్బంది నాలిక్కరుచుకుని తిరిగి వెళ్లిపోయారు. కాని తమ సమయాన్ని వృధా చేసినందుకు అతడికి వేలాది పౌండ్ల జరిమానా బిల్లును వడ్డిస్తామంటూ అధికారులు ఆనక చల్లగా చెప్పారు. ◆



గొడ్ల ఎల్లతోలతాండారు, లెయ్" అంది కాస్త గట్టిగా.

కూర్చున్న చోటునుంచి మెల్లగా లేచాడు. వంట్లో అస్సలు సత్తువ లేనట్టుగా చాలా నీర సంగా ఉన్నాడు. అస్సలు శరీరాన్ని కదిలించ లేక పోతాండాడు. నిద్ర లేచినప్పటినుంచి అక్కడే కూర్చుని ఉన్నాడు. కాళ్ళు పట్టకపో యిండాయి.

కొడుకు, కూతురు హాల్లో వేరుశనగ కాయలు వలుస్తాండారు. ఈసారి వాన పడిం దంటే అందరూ గింజలు వేస్తారు. యింకో రెండు మూడు వారాల్లో గింజలు వేస్తా రంతా. గింజలు వేయాలంటే మడకలకు, కూలీలకు దుడ్డు కావాలి. యిప్పుడే సచ్చిపోతే, ఆయరవకు గవర్నమెంటోళ్లు దుడ్డు ఇస్తారు. గింజలు ఏసుకునేదానికి యిబ్బందుండదు. అంతే అంతే... ఈ పొద్దే సచ్చి పోవాల అను కున్నాడు రామచంద్ర. అలా అనుకోవడంలో కాస్త శక్తి వచ్చినట్టనిపించింది. చావు తెగింపు అంటే అదేనేమో.

చక చకా పళ్ళు తోమినాడు. భార్యకు నీళ్ళు కాంచమని చెప్పి వేడివేడిగా పోసుకున్నాడు. అన్నానికి కూర్చున్నాడు.

"తిన్నేవామ్మా శారద... తిన్నేవ బాలకృ ష్ణా" అని బిడ్డలను పలకరించాడు.

వాళ్లు తిన్నామన్నారు. తింటే తిన్నేరులే మళ్ళీ కొంచెం తిందురు రాండి అని బల వంతం చేశాడు. భార్యను తనతో పాటు తిన మన్నాడు.

"ఏం భయపడకండి... అందరికీ అయింది మనకూ అవుతుంది. ఎమ్మార్వోకు ఫోన్ చేస్తాలే. రేపో మన్నాడో వోళ్లు సాయం అందిస్తారు.యింగో బోరేసినామంటే యిబ్బం దుండదు. చెరుకు బాగనే వస్తాది. ఈసారి వానలు బాగా పడతాయంటాండారు. చెనిగి బాగొచ్చి చెరుకు బాగొస్తే అంత బాధుండ దులే" అంటా యింట్లో అందరికీ ధైర్యం చెప్పాడు.

నిజంగానే యింట్లో అందరికీ దిగులుగా ఉండాది. బోర్లో నీళ్లు యింకిపోవడంతో యింక తమకు భవిష్యత్తే లేదనుకోని భయప డతాండారు. కాకపోతే ఆ అభిప్రాయాన్ని బయటకు వ్యక్త పరచలేదు. యిప్పుడు రామ చంద్ర మాటలతో అందరిలో కాస్త ధైర్యం వచ్చింది. వారం రోజులనుంచీ మౌనంగా అన్ని పనులూ చేసుకుపోతున్న వాళ్ళంతా తిరిగి గలగలా మాట్లాడసాగారు.

అన్నం తినేసి చేయి కడుక్కున్నాక, "బాయి కాడికి పోయొస్తాను" అని యింట్లోనించి బయట పడ్డాడు రామచంద్ర.

నేరుగా దిగ వీధికి పోయి అంగట్లో కాల్ కేజీ బెల్లమూ, వంద గ్రాములు పప్పులు తీసు కున్నాడు.

"పప్పులు బెల్లం కొంటూండావే... ఎవ రన్నా యింటికి వచ్చినారా? " అడిగాడు అంగడాయన.

"ఎవ్వురాలేదప్పా... నాకే"

"నీకెందుకన్నా దవడ పండ్లు వూడిపో యిండ్లా..."

"దవడ పండ్లా... వూడిపోతే అట్లే తిం టాను వాయ్...చిగుర్లు లేవా... కడుపు సుగ్గగినీ... పొడి దంచుకోని తిందామనిలే"

"కడుపు సుగ్గయితే కలకండ ఏసుకుంటే బాగా పని చేస్తాది. కలకండ లేదే... బెల్లం కన్నా చెక్కెర ఏసుకోని పొడి కొట్టుకోన్నా... మేలు" సలహా యిచ్చాడు అంగడాయన.

"ఏదయితేనేంలే... మనకు జబ్బు నయం కావాల..." అంటూ అక్కడి నించి బయటప డ్డాడు. పప్పులు, బెల్లం నిక్కరు జోబీలో వేసు కుని నేరుగా పొలం వద్దకు పోయాడు.

పదకొండు గంటలు దాటినట్టుంది. ఎండ తీవ్రంగా ఉంది. అంతా నిర్మానుష్యంగా ఉంది.

వడ్ల గింజలు గట్టిపడకుండానే ఎండిపో తాండాయి.

వరి కర్రలు ఎర్రబారతాండాయి... రెండెక రాల మడి... జానడు పొడవు గొలకలు.

ఎకరాకు యాభయి మోటలు- రెండెకరా

లకు నూరు మోటలు లెక్కేసిరంతా.

ఎండల కాలం కదా... ఒగ్గింజా జొల్లు పోదనిరి...

యిప్పుడు ఒగ్గింజా గట్టిగా ఉండదు... అంతా జొల్లే...

నలభై యాభై వేలు... కండ్ల ముందరే చేతికి అందకుండా పోతాండాది...

చెరుకు వాడుమొగం పెట్టలా యింగా... ఎంత కాలమని తట్టుకుంటాదిలే నీళ్ల లేకపోతే... ఐదు నెల్లకే మనిషెత్తుండాదని అంతా దిష్టి పెట్టినారేమో...

అన్నీ సక్రమంగా వచ్చింటే కూతురు పెండ్లి బాగా చేసిండచ్చు...

యిప్పుడేం చేస్తారింగ... శారదను ఆ పిల్లోడు పెండ్లి చేసుకుంటాడా...? వాళ్ల కట్నం ఎక్కువ అడగలా, పెండ్లి ఘనంగా చేసిస్తే చాలన్నారు. చేతిలో దుడ్డు లేకుంటే ఎట్ల చేస్తారు పెండ్లి...!

నేను సచ్చిపోతే...

పెండ్లి ఆగిపోతే...

నేను సచ్చిపోతే యిచ్చే ఒకటిన్నర లక్షలో పాప పెండ్లికి యాభయి వేలన్నా ఖర్చు చేయమని...జాబు రాయాల... రాయచ్చా... జాబు రాయగూడదు... జాబు రాస్తే దుడ్డు కోసరమే సచ్చిపోయినానంటారు... మళ్లీ దుడ్డు ఈకపోతే... వద్దొద్దు... చిన్న చీటీ గూడా రాసేది వద్దు...

వోని బతుకెట్ల...? బిడ్డను యిస్తాడా బామ్మర్ది... ఎందుకీయడు... చిన్నప్పట్నించీ అనుకొన్న సంబంధమే గదా... లక్ష రూపాయలు బిడ్డ పెండ్లికని బేంకులో ఏసి పెట్టినాడంట.

బేంకోళ్ళు యిస్తారు... అప్పులు తీరతాయి... నీళ్ళు పడతాయి... మిగిలిన అప్పులన్నీ ఒగటిరెండు సమచ్చరాలలో తీరిపోతాయి...వోడు సుఖంగానే బతికి పోతాడు...

రమణమ్మను తలచుకుంటేనే బాధ... ఒసే రమణీ...నా రమణీ... నన్ను క్షమించే... నిన్ను ఏమనేమాత్రం సుఖపెట్టలా... రెయ్యిం పొగులూ నీ చేత కష్టం చేపించినా...నీ నగలన్నీ కుదవ పెట్టినా... అయ్యి మునిగిపోతాండాయి... ఈ జన్మకింతే... పెండ్లిగాని బిడ్డల్ను యిద్దర్ని వదిలేసి పోతుండా... నన్ను తిట్టుకోవద్దే... ఏంచేసేది... ఎంతో బాగా బతకాలనుకున్నేం... పెద్దోళ్ళు తొగించిన బాయి ఎండిపాయ... పదకొండు బోర్లు ఏస్తిమి... అవ్వీ ఎండిపాయ... అప్పు చిక్కేటిగా వుంటే యింగో బోరు ఏసిందు... అప్పు చిక్కలా... నేను సచ్చినాక దుడ్డు యిస్తారుగదా... దాంతో బోరేయండి... నీళ్ళు పడతాయి... నేను చెప్తాండా గదా... సుఖంగా వుండండి... నేను లేనని నువ్వేమన్నా చేసుకునేవు... నేనేడికి పోను... నిన్ను, బిడ్డల్ను వదిలి నేనేడికి పోతానే... ఈ సుట్టకారమే తిరుగులాడతా వుంటాను... మీరంతా సుఖంగా వుండాల...

నేను సచ్చిపోతే యిచ్చే ఒకటిన్నర లక్షలో పాప పెండ్లికి యాభయి వేలన్నా ఖర్చు చేయమని... జాబు రాయాల... రాయచ్చా... జాబు రాయగూడదు...

అమ్మా... పెద్దమ్మీ... విజియా... నాయన నీకిచ్చిన మాట నిలుపుకోలేక పోయినాడమ్మా... పెద్ద సైను చేపికుండానే సచ్చిపోతుండాడు. నన్ను తిట్టుకోవద్దమ్మా... నీ కడుపున బిడ్డగా పుట్టి నీరుణం తీర్చుకుంటాను తల్లీ! మీ అమ్మా, చెల్లి, తమ్ముడు వుంటారు... పదింటి కొగనాడు వచ్చి పోతాండు. నేను లేనని రాకుండా వుండేవు... అత్తా, మామ, మొగుడు ఏమన్నా అన్నా సర్దుకోనిపో. ఈ జన్మకు మన రాతలు యింతే... అనుకున్నాడు రామచంద్ర.

అతనలా అనుకుంటూ వుండగానే కళ్ళ

నుంచి నీళ్ళు కారిపోతాండాయి... కన్నీళ్ళు తుడుచుకోవడం కూడా మరచిపోయి నిలబడుకోనుండాడు వరిమడిని చూస్తా...

చెట్టు నీడన కుచ్చోనున్నా ఉక్కపోతగా వుండాది... దాహంగా అనిపించింది రామచంద్రకు. అలవాటు ప్రకారం లేచాడు మోటార్ వేయడానికి బోర్లో నీళ్ళు లేని సంగతి గుర్తొచ్చి ఆగిపోయాడు... ఏమో నీళ్ళు వచ్చింటాయేమో... వచ్చింటాయేమో. టకామని నీళ్ళు లేకుండా పోయినాయి గదా...అట్లే టకామని నీళ్ళు వచ్చింటాయేమో...పోయి చూద్దాం... అనుకుని మోటార్ వద్దకు వెళ్ళాడు... మొలతాడుకున్న తాళంచెవితో, స్టార్టర్ వున్న బాక్స్ తాళం తీసి స్విచ్ నొక్కాడు... మోటార్ బుర్రుమంటూ శబ్దం చేస్తాందే గానీ పైపులోనించి నీళ్ళు రాలేదు. పొంగుతున్న పాలలో నీళ్ళు చిలకరించినట్టయింది. స్విచ్ ఆఫ్ చేసి, బాక్స్‌కు తాళంవేసి తిరిగి వచ్చి చెట్టుకింద కూర్చున్నాడు.

చెట్టుమీద కాకి ఒకటి కావ్‌కావ్‌మని అరస్తాంది...

వుత్తీత "వుత్తీ...త... వుత్తీ...,తో" అని అరస్తా పోయింది.

రామచంద్ర ఉలికి పడినాడు...

ఎవురికో మూడింది... ఎవురికో... నాకేనా... నాకేనా మూడిండేది...

ఎందుకు మూడింది... యింగా అర్వై ఏండ్లు గూడా కాలా నాకు...

ఆత్మహత్య చేసుకునేవాళ్లకు వయసుతో సంబంధం లేదు.

ఎందుకు సావాల నేను...

సేద్దిం చేసిందానికి... అప్పులు చేసిందానికి... అప్పులు తీర్చలేకపోయిందానికి... అప్పులుంటే భయ



మా... ఐపి పెడతా... ఐపి పెడితే అంద రిలో అవమానం కదా... మళ్ళ నీకు అప్పు పుడతాదా... అప్పు పుట్టకపోతే బోరేస్తావా... బోరెయ్యక పోతే సేద్దిం చేస్తావా... సేద్దిం చేయకపోతే అప్పులు తీరతాయా... ఐపి పెడితే వుండే ఆస్తులన్నీ యాలం ఏస్తారు... నా పేరుతో వుండేది రెండెకరాలే... అయితే నిన్ను నమ్మి అప్పులు యిచ్చి నోళ్ళను ముంచే స్తావా...? మోసం చేస్తావా...? లేదు లేదు... నేను మోసగాన్ని కాదు... ఎవురికీ ముంచను. నేనే సచ్చిపోతా... గవర్నమెంట్ దుడ్డిస్తాది... ఆ దుడ్డుతో నా కొడుకు బోరే స్తాడు... పంట బెడతాడు... బాకీలు తీరు స్తాడు... నువ్వెయ్యలేదా బోర్లు... పెట్టలేదా పంటలు... తీరినాయా అప్పులు... లేదు లేదు... ఎప్పుడూ యిట్లే వుండదు... మొబ్బు కొన్ని దినాలు, ఎన్నెల కొన్ని దినాలు వుంటుంది... అయితే నువ్వే సేద్దిం చేయి ఎన్నెల వచ్చేదాకా... నీళ్ళు లేవు... బోరే యను దుడ్డు లేదు... సస్తే... దుడ్డొస్తే కుటుంబం బాగుపడతాది... అప్పులయిపో యినా, కాపాడండని ఫోన్ చేసి... పేపర్లలో వచ్చి... అందరికీ తెలిసిపోయి... పరువు పోయినాంక బతికే ధైర్యం లేదూ... ముందే సచ్చిపోతా... ముందే సచ్చిపోతా... అనుకు న్నాడు రామచంద్ర.

నిక్కర్ జోబీని తడుముకున్నాడు. పప్పులు, బెల్లం చేతికి తగి లింది... వణికే చేత్తో వాటిని బయటకు తీశాడు.



నాలుక ఆరిపోయిండాది... చుట్టు పక్కలా తనను ఎవరైనా చూస్తాండారేమోనని పరిశీ లిస్తా బెల్లంముక్క ఒకటి నోట్లో వేసుకు న్నాడు.

దరిదాపుల్లో ఎవరూ కనిపించలా...

వణికే చేతుల్తోనే కొంతసేపు పప్పులు బెల్లం తిన్నాడు.

మెల్లిగా నడచుకుంటూ పోయి మోటార్ దగ్గర ఎండిన చెరుకాకులో పెట్టిండే కొడవ లిని తీసుకున్నాడు. కొడవలిని తీసుకుంటుంటే చేయి వణకడం యింకా ఎక్కువయింది.

చుట్టూ పరిశీలనగా చూశాడు... మనిషి అలికిడి లేదు. గెనం పక్కన ముష్టిచెట్లు ఎక్క డెక్కడ వుండాయో చూశాడు. ఎవ్వరికీ కన్పిం చదని చెరకుతోట దగ్గరుండే ముష్టిచెట్టు దగ్గ రకు పోయాడు. అక్కడికి పదిబారల దూరం లో పదిమట్ల లోతు బాయి వుంది. బాయి దగ్గర కపిలబారి, బాయిగడ్డ వుండాయి... కొడవలిని చెట్టు దగ్గరే పెట్టేసి బాయి దగ్గరకు పోయాడు.

చిన్నప్పుడంతా ఎన్ని నూర్లసార్లు బాయిలో దుంకి ఈత ఆడింటామో... ఎండకాలం వస్తే ఎంతమంది వచ్చే వాళ్ళో... యిప్పుడేడుండా యి నీళ్ళు... ఆ నీళ్ళంతా ఏమయిపోయినా యి...కొబ్బరినీళ్ల మాదిరిగా ఉండి మళ్లీ మళ్లీ తాగుదామనిపించే నీళ్ళేమయిపోయినాయి? పదిమట్ల లోతు నీళ్ళులేని బాయి... పైన్నుం చి దుంకేస్తే చావనా... చావనేమో... సొరం గం ఏస్తే... అవును సొరంగం ఏస్తే నేరుగా తలబొయ్యి కిందపడతాది... పగలతాది... పాణం పోతాది... యిప్పుడు చిన్నప్పటి మాదిరిగా సొరంగం ఏస్తానా...? ఎయ్య లేను...వద్దులే... బాయిలో పాణం పోయినా, పీనిగను గడ్డకు తియ్యాలంటే మెట్లు లేవు... దొరులంతా పడిపోయిండాయి. కాలు జారి పడిపోయి సచ్చిపోయినానని దుడ్డు ఈకుం టే... వద్దులే... ముష్టిచెక్కా బెల్లమే మేలు అనుకొని మళ్లీ వెనక్కు వచ్చాడు.

ముష్టి చెట్టు దగ్గరకు వచ్చి కొడవలి చేతికి

తీసుకున్నాడు.

సచ్చిపోయేముందు...ఒగ చెరకు తింటా... నేను పంట వేసింది... సోగ కదా... అయినా సరే... నా కష్టం... నాకు తీగానే వుంటాది... ఒగ చెరకు తింటా...

కొడవలితో గుమిలని ఒక చెరకును మొదలు వద్ద నరికి బయటకు లాగాడు... కొన ఆకులు యించి పక్కన వేశాడు... గొడ్డు తింటాదని... ఎండిన ఆకులు తీసేసి రెండు కణుపుల దాకా తిన్నాడు. తినబుద్ధి కాలా... ఏదో పిచ్చిపిచ్చిగా వుండాది... నాయ్యన్నీ నేనే తింటా... నేనే ఎందుకు తినగూడదు... సచ్చిపోయే ముందు అన్నీ తిని చస్తా... గోగాకు... ఎర్రకాయలు. ఒక్కాయ పెరుక్కున్నాడు. ఒక దబ్బ తీసి నమిలాడు... పుల్లగా వుండాది. మిగిలింది పారేశాడు... వరికయ్యలోకి వచ్చాడు... గొలకల్లోనించి వడ్లు చేతిలోకి దూసుకున్నాడు... కొన్ని నోట్లో పోసుకొని కసాబిసా నమిలాడు... వాటిల్లో బియ్యపు గింజలు ఏర్పడలేదు... పాలు కూడా లేవు... ఒకటి గొంతులోకి పోయింది. తుపుక్కుమని వుమ్మేసి ఆక్... ఆక్‌మని దగ్గి గొంతులోని దాన్ని కూడా వుమ్మేశాడు...

సచ్చిపోవాల... యింగ సచ్చిపోవాల... బిన్నే సచ్చిపోతే బిన్నే దుడ్డొస్తాది... చెనిగ్గింజలు ఏసేదానికి ఒగర్ని దుడ్డు అడుక్కునే పనుండదు... అనుకుంటా ముష్టి చెట్టు వద్దకు పోయాడు... కొడవలితో ముష్టిచెట్టు తాట పట్టెడు తీశాడు.

ఆ తాట అక్కడే పెట్టేసి దగ్గర్లోనే వుండే బండ వద్దకు పోయి అడుగు వెడల్పుండే రాయి ఒకటి, అరచేతికి అబ్బేటంత మరో రాయి తీసుకుని చెరకుతోట మధ్యలోకి పోయాడు... గబాగబా బెల్లం ముష్టిచెక్కా కలిపి దంచినాడు. అది దంచుతున్నంత సేపూ రామచంద్ర కంట్లో నీళ్ళు కారుతున్నాయి...

దారింటి ఎవురో పోతున్నారు... మాటలు వినిపిస్తావుండాయి... రామచంద్ర వూపిరి బిగబట్టి వదలకుండా కూర్చున్నాడు.

మనుషులు దూరమయ్యారేమో... మాటలు అస్పష్టంగా వినిస్తాండాయి.

ఎవరు... ఎవురోళ్ళు... ఎప్పుడో యిన్ని గొంతులేనే...

మారేళ్ళోల్లు గదా... మారేళ్ళోల్లే... యింగా సచ్చిపోవాల్ల... బిన్నే సచ్చిపోవల్ల... సచ్చిపోయే ముందు బీడీ తాగతా...ఒక బీడీనే...

తోటలో నించి బయటకు వచ్చి బీడీ వెలిగించాడు...

చేతుల నుంచి ముష్టి చెక్కా బెల్లం కలిసిన వాసన అదొక విధంగా వస్తావుంది. నోట్లో నించి బయటకు వస్తాండే పొగలో రకరకాల రూపాలు అస్పష్టంగా కన్పిస్తాండాయి. నాలుగు దమ్ములు లాగి బీడీముక్క పారేసినాడు. చుట్టూ ఒకసారి చూసినాడు. తడబడుతున్న అడుగులతో తోటలోకి నడిచాడు. కుచ్చోని ముష్టిచెక్క బెల్లం వుండను చేతిలోకి తీసుకున్నాడు.

భార్యా బిడ్డలు, సహదేవనాయుడు, శివరాం, బేంకులోల్లు, అప్పులు యిచ్చిండేవాళ్ళు... అందరూ కండ్లముందు మెదలతా వుండారు. వంట్లో వణుకు... చేయి గడగడా వణకతాంది... కళ్ళ నుంచి ధారాపాతంగా కారిపోతాండాయి...శరీరమంతా చెమటలు...

నేను చస్తే... నా కుటుంబం బాగు పడతాది... నా కుటుంబం బాగు పడతాది.

గుండెల్లో నొప్పిగా అనిపించింది... ఎడం చేత్తో రుద్దుకున్నాడు...

నొప్పి తగ్గలా... యింతకు ముందుకన్నా ఎక్కువగా వుండాది...

వళ్ళంతా చెమటలు పడతాండాయి... కుడి చేతిలోని వుండ జారిపోయింది.

అప్రయత్నంగా కుడిచేయి కూడా గుండెల మీదకు చేరుకుంది...

రెండు చేతులతో గుండెను గట్టిగా అదిమి పట్టుకున్నాడు...

కళ్ళముందు నక్షత్రాలు తళతళలాడతాండాయి...

తెరలు తెరలుగా నల్లటి పరదాలు...

మ్మేయ్... రమణి... బాలకృష్ణా... శారదా... విజయా...

నొప్పి... నొప్పి... అనుకుంటానే నేలకొరిగాడు...

## 11

పీలేరు వైపు నుంచి బస్సు వస్తున్న శబ్దం విన్పించడంతో టీ అంగడి దగ్గర కూర్చున్న బాలకృష్ణ గబగబా లేచి నిల్చున్నాడు. కాసేపట్లో "పొంయ్... పొంయ్..." అంటా వచ్చి బస్సాగింది. తెరచుకున్న డోర్‌లో నించి ముగ్గురు, నలుగురు దిగారు. ఐదారుమంది ఎక్కారు. బస్సు కదిలేంత వరకు తనక్కావలసిన వ్యక్తి దిగుతాడేమో అని ఆశగా ఎదురుచూస్తున్నాడు. కానీ తనకు కావలసిన వ్యక్తి అందులోనించి దిగలేదు.

"ఏమప్పా బాలకృష్ణా, ఆ సారు యిప్పుడే రాడని చెప్పినా గదా. టైమింగా తొమ్మిదిన్నరే... యింగ గంటకొస్తాడు. పదిన్నరకు పింఛా బండొస్తాదే, దాంట్లో వస్తాడు" అన్నాడు టీ అంగడాయన.

తిరిగి అరుగులాగా అమర్చిన బండమీద కూర్చున్నాడు.

అది కె.వి.పల్లె, మండల కేంద్రం. అక్కడే బస్సులు ఆగేది.

బస్టాపుకు ఎడమవేపున ఇండియన్ ఓవర్సీస్ బ్యాంకు వుంది. దాని పక్కనే మండల రెవెన్యూ కార్యాలయం వుంది. రెవెన్యూ కార్యాలయం వద్ద అప్పటికే పదిమందికిపైగా అధికారుల కోసం పడిగాపులు పడుతున్నారు.

అప్పటికే వచ్చిన అటెండర్ కొందరు అర్జీదారులతో ఏదో గుసగుసగా మాట్లాడుతున్నాడు.

రోడ్డుమీద అప్పుడొకటి, అప్పుడొకటి వాహనాలు వెళుతున్నాయి.

అప్పటికి రామచంద్ర చనిపోయి నెలవుతావుంది.

అప్పుల బాధ తాళలేక ముష్టి చెక్కా బెల్లం తిని ఆత్మహత్య చేసుకున్నాడని అన్ని

## వేళ్లకు, గుండెకూ లంకె

శతకోటి జబ్బులకు అనంతకోటి పరీక్షలు. ఒక జబ్బు నిర్ధారణకోసం ఇన్నిన్ని పరీక్షలు రాసి దుంపతెంచుతున్నారేమిటీ వైద్య నారాయణులు అని తిట్టుకున్నా పరీక్షలు చేయించుకోకా తప్పదు. వాటి బిల్లులు చూసి లబోదిబోమని మొత్తుకోకా తప్పదు. వైద్య పరీక్షలు సామాన్యులకు పెనుభారమైపోతున్న ఈ రోజుల్లో శాస్త్రవేత్తలు తక్కువ ఖర్చుతో, తేలికపాటి పరీక్షలతో వ్యాధిని ముందుగానే కనుగొనడానికి ప్రయత్నాలు సాగిస్తున్నారు. ఆ క్రమంలోనే అమెరికన్ శాస్త్రజ్ఞులు వేలి కొనలు పరీక్షించి గుండె జబ్బుల్ని కని పెట్టే విధానాన్ని కనుగొన్నారు.



శరీరమంతా వ్యాపించి ఉండే రక్తనాళాల చివరలు, వేళ్ళ చివరల వరకూ వ్యాప్తి చెందుంటాయి. రెండు డిస్పోజబుల్ ప్రోబ్స్‌ఫింగర్ టిప్స్‌కి అమర్చి రక్తనాళాల ఎండోథీలియం పనిచేసే తీరుని పరీక్షించి గుండె జబ్బుల్ని నిర్ధారిస్తున్నారు. ఎండోథీలియం రక్తనాళాల లోపలి గోడల్లో ఉంటుంది. ఇది రక్తప్రసరణ సులభతరం చేయటంలో తోడ్పడుతుంది. ఎండోథీలియం పనితీరుని బట్టి రక్త ప్రసరణ సరిగా ఉన్నదీ లేనిదీ తెల్సుకుని తద్వారా గుండె జబ్బులకి సంబంధించిన విలువైన సమాచారాన్ని ముందస్తుగానే తెల్సుకోవచ్చు.

మరింకేం, 20 ని॥లలో పూర్తయ్యే ఫింగర్ టిప్స్ పరీక్ష చేయించుకుని ముందస్తుగా జాగ్రత్తపడండి.

పేపర్లలో వచ్చింది. విషయం తెలుసుకున్న వెంటనే ఎమ్మార్వో, ఆరై, యితర సిబ్బంది కామిరెడ్డిగారి పల్లెకు వచ్చారు. రమణమ్మ, శారద, బాలకృష్ణ దగ్గర స్టేట్‌మెంట్ తీసుకున్నారు. వూర్లో యింకా యిద్దరు ముగ్గుర్ని విచారించి అప్పుల బాధతోనే చనిపోయాడని రాసుకున్నారు. తక్షణ సాయం కింద రెండు వేలు యిచ్చారు. త్వరలో ప్రభుత్వం ఒకటిన్నర లక్ష యిస్తుంది, ఒకసారి మండల కార్యాలయానికి వచ్చి అర్జీ యిచ్చి వెళ్ళమన్నారు.

రామచంద్ర దహనక్రియలు అవుతూనే అంత బాధలో కూడా తల్లీబిడ్డలు వచ్చి ఎమ్మార్వోకు అర్జీ యిచ్చి వెళ్ళారు.

తర్వాత వారం సబ్ కలెక్టర్ వచ్చి విచారణ జరిపారు. అప్పులున్న పత్రాలు చూశారు. మేటి రైతుల వాంగ్మూలం తీసుకున్నారు. వూర్లో యింకా కొంతమంది దగ్గర విచారించి పోయారు. అప్పటి నుంచి బాలకృష్ణ ఎమ్మార్వో కార్యాలయానికి రావడం యిది రెండోసారి.

జిల్లాలో అక్కడక్కడా వర్షం పడతాంది. వర్షం పడిన చోటంతా వేరుశనగ గింజలు వేస్తాండారు. 'యిక్కడా వాన పడుతుందేమో... ఆ సాయమేదో బిన్నే అందితే చెనిగ్గింజలు ఏసుకోవచ్చు లేకుంటే అప్పు గూడా పుట్టదు' అనుకోని మండలాఫీసుకు తిరగతా వుండాడు బాలకృష్ణ.

ఆరోజు పొద్దున్నే తొమ్మిది గంటలకంతా వచ్చేశాడు.

తొమ్మిదిన్నర అవుతున్నా అధికారులు రాలేదు.

అప్పటికే రెండు టీలు తాగాడు. రోడ్డు పక్కన కుచ్చోవడం విసుగ్గా వున్నట్టుంది. పేపర్ చూద్దామంటే ఒక్కోదాన్ని ఐదారు మంది పంచుకోనుండారు... అక్కడి నుంచి గ్రంథాలయానికి వెళ్ళాడు. ఆ సిబ్బంది కూడా అంతకుముందు పోయిన బస్సుకే వచ్చినట్టుండారు. తలుపుతీసి, కుర్చీలు బయటవేసి, కిందంతా చీపురుతో వూడుస్తున్నాడు నాగరాజు. పిల్లలిద్దరు రెండు కుర్చీలను ఆక్రమించుకుని పేపర్ చదువుతా వుండారు.

"ఏంబా.. బాలకృష్ణ... ఏమాయ పని? " పలకరించాడు నాగరాజు.

అతనక్కడ అటెండర్. అతనే లైబ్రేరియన్



కూడా... లైబ్రేరియన్‌ను పీలేరు లైబ్రరీకి ఇన్‌చార్జ్‌గా నియమించారు. అక్కడ మూడు రోజులు, యిక్కడ మూడు రోజులు పని చేస్తుంటాడు. వారంలో మూడు రోజులు ఆ గ్రంథాలయానికి సర్వాధికారి నాగరాజే. యిరవై సంవత్సరాల సీనియారిటీ వున్నా యింకా అతని వుద్యోగం పర్మనెంట్ కాలా. చదువుకునే రోజుల నుంచి బాలకృష్ణకు పరిచయం. ఈ మధ్యన రెవెన్యూ కార్యాలయానికి వచ్చినప్పుడంతా గ్రంథాలయానికి వచ్చి వెళుతున్నాడు. అతనికీ విషయమంతా తెలుసు. అందుకే చనువుగా పలకరించాడు.

"ఏమయితాదిన్నా... ఈ ఆఫీసర్లు సావనీరు, బతకనీరు" బలవంతంగా నవ్వతా అని ఒక కుర్చీలో కూర్చున్నాడు.

"ఏం చేద్దాం, వాళ్ళ చేతుల్లో తగులుకున్నేమంటే అంతేమల్ల" అన్నాడు నాగరాజు.

బాలకృష్ణ పేపర్లు అందుకొని తిరిగేశాడు. ఏ పేపర్ జిల్లా సంచిక చూసినా రైతుల ఆత్మహత్యల వార్తలే మొదటి పేజీ నిండా.

వాటికి తోడు హెల్ప్‌లైన్‌కు రైతుల ఫోన్‌ల వార్తలు...ఇంతప్పుంది... ఇంత ఆస్తుంది... వ్యవసాయంలో ఇంత నష్టం వచ్చింది. సాయం చెయ్యకుంటే ఆత్మహత్య చేసుకుంటా... పేపర్లంతా ఇవే వార్తలు... బాలకృష్ణకు వాటిని చూస్తానే మనసు వికలమయి పోయింది. పేపర్‌ను విసురుగా పక్కన పెట్టాడు.

"నాకు తెలిసీ యింత ఘోరం ఎప్పుడూ లేదప్పా- ఎవ్వరైనా బిడ్డలు చూడలేదని ముసిలోళ్ళు ఆత్మహత్య చేసుకునింది, అత్తగారింట్లో హింస భరించలేక ఆడోళ్ళు సచ్చిపోయింది చూసినాగానీ... అప్పులెక్కువయినాయని, బతకలేమని రైతులు చస్తాండేది యిప్పుడే చూస్తాండా..." అన్నాడు నాగరాజు.

"అందుకేన్నా... నేను గూడా ఈ వ్యవసాయం వద్దనుకుంటాండా"

"ఎందుకుప్పా... వ్యవసాయం చెయ్యకపోతే గవర్నమెంట్ దుడ్డు ఈదేమోనే"

"ఎందుకీదన్నా...? ఒకటిన్నర లక్ష యిస్తాది గదా"

"నువ్వు పేపర్ సరిగా చూస్తాండావా...? ఒకటిన్నర లక్ష చేతికి ఈరు... తొలీగా యాభైవేలు అప్పులోళ్లకు కడతారు"

మధ్యలోనే మాటలను అడ్డుకుంటా "మిగిలిన అప్పంతా" ప్రశ్నించాడు బాలకృష్ణ.

"చెప్తాండా గదా... మిగిలింది వాళ్ళకు సంబంధం లేదు. తొలీకంతు యాభైవేలు నేరుగా అప్పులోళ్ళకే కడతారు. మిగిలిన లక్ష వ్యవసాయానికి పెట్టుబడి కోసరం యిస్తారు... వ్యవసాయం చేయకపోతే అదీ ఈరు" వివరించాడు నాగరాజు.

"నేనింగా ఎట్లనో ప్లాన్ ఏసుకోనుంటి గదాన్నా" నీరసంగా అన్నాడు బాలకృష్ణ.

"ఏమి ప్లాన్..."

"......"

"ఏమి ప్లాన్ ఏసుకోనుంటివి"

చుట్టు పక్కల చూశాడొకసారి. పిల్లలు పేపర్ చదువుకుంటా వుండారు... పెద్దవాళ్ళెవరూ లేరు. కుర్చీలోంచి లేచి నాగరాజుకు దగ్గరగా పోయి "ఎవ్వరితో అనద్దన్నా. యింతవరకు మా యింట్లో గూడా ఎవ్వరికీ తెలీదు. నీకే చెప్తాండా తొలీగా" అన్నాడు తగ్గు స్వరంతో.

"నేనెందుకు చెప్తానెవరికన్నా... ఏంది విషయం" అన్నాడు నాగరాజు కూడా అదే స్వరంతో.

"నేను కొయ్యేటికి పోవాలనుకుంటాండాన్నా... పాస్‌పోర్ట్ గూడా చేపించినా... వారం పద్దినాల్లో వస్తాది. పీలేర్లో మా ఫ్రెండొగడు కొయ్యేటికి పోయిండాడు. వాడాడు షాపులో పని చేస్తాండాడంట. నాకు వీసా పంపతానన్నేడు. డెబ్బై ఎనభై వేలవుతాదంట. ఈళ్ళు దుడ్డు యిస్తే అట్లెళ్ళి పోదామనుకోనుంటి. నువ్వు చెప్పిందాన్నిబట్టి చూస్తే దుడ్డు చేతికి వచ్చేటిగా లేదే" దిగులుగా చెప్పాడు బాలకృష్ణ.

"చానా మంచి పని చేస్తాండావు... ఈడ

వానలు పడక, బోర్లేసినా నీళ్ళు లేక... ఎన్నేండ్లు కష్టపడినా వేస్టే... అట్ల పోయి మూడు నాలుగేండ్లు వుండేసి వచ్చేస్తే, మళ్ళ జీవితాంతం సుఖంగా బతికిపోవచ్చు."

"కొయ్యేటికి మా ఫ్రెండుకు జాబు గూడా రాసేసినన్నా... యిట్ల మానాయన చనిపోయినాడు, తొందర్లో గవర్నమెంటోళ్ళు ఒకటిన్నర లక్ష యిస్తారు. వీసా పంపినావంటే వచ్చేస్తానని... యిప్పుడు దిగులు పట్టుకుందే... సేద్యానికి తప్ప వేరేదానికి దుడ్డు ఈరంటా వుండావే... ఎట్ల చేయాలన్నా...!" అంటా తల పట్టుకున్నాడు...

"వూర్లో ఎవుర్నన్నా అడగ్గూడదా...!"

"వూర్లో ఎవురిస్తారున్నా... యిప్పటికే చానా అప్పులయిపోయింటే"

"ఎంతప్పున్నా వుండనీలే... కొయ్యేటికి పోతాండారంటే ఎంత గావాలన్నే యిస్తారు... అయిదు రూపాయల వడ్డీ గదా... కొయ్యేటికి పోతే అసలు గ్యారంటీ, వడ్డీ గ్యారంటీనే... అందుకని యిస్తార్లే... దానికేం భయంలేదు" ధైర్యం చెప్పాడు నాగరాజు.

"ఏమిస్తారో ఏమో..." గొణిగినట్టుగా అన్నాడు బాలకృష్ణ.

"ఎందుకీరుప్పా... కొయ్యేటికంటే దుడ్డిచ్చే వాళ్ళు చాలా మందుంటార్లే. నేను చెప్తాండా గదా. కొయ్యేటికి పోతాండాను, నెలకు పన్నెదు వేలు జీతం అంటే చాలు... మేమిస్తాం మేమిస్తాం అంటా ఎగబడతారు దుడ్డు యిచ్చే దానికి. ఇంతకీ మీ అమ్మకన్నా చెప్పినావా లేదా కొయ్యేటి సంగతి"

"చెప్పలేదన్నా... యింగ చెప్పాల... మా అమ్మ ఏమంటాదో ఏమో... అదొక పక్క భయంగా వుండాది"

ఈడ వానలు పడక, బోర్లేసినా నీళ్ళు లేక... ఎన్నేండ్లు కష్టపడినా వేస్టే... అట్ల పోయి మూడు నాలుగేండ్లు వుండేసి వచ్చేస్తే మళ్ళ జీవితాంతం సుఖంగా బతికిపోవచ్చు

"అనేదానికి ఏముండాదిలేప్పా... ఈడుండి ఎంతకాలం సేద్యం చేసినా యింతేగదా. ఒప్పుకుంటాదిలే... అద్దో... మోర్పు వస్తాండాది... ఎమ్మార్వో ఈబస్‌కే వచ్చేది..." చేతి వాచీ చూసుకుంటా చెప్పాడు నాగరాజు.

"అయితే నేను పోతాండాన్నా" అంటా చకచకా నడచుకుంటూ రోడ్డుపైకి వచ్చాడు. దూరంగా దుమ్ము తెరలు రేపుకుంటూ బస్సు వస్తోంది... గబగబా బస్టాపు వైపు నడక మొదలు పెట్టాడు. మధ్యలోనే దాటుకుని వెళ్ళింది బస్సు... పరుగులాంటి నడకతో వెళ్ళాడు బస్సు వద్దకు... అప్పుడే ఎమ్మార్వో బస్సు దిగతా వుండాడు.

"నమస్కారం సార్..." అన్నాడు రెండు చేతులు జోడించి బాలకృష్ణ. అతన్తోపాటు ఐదారుమంది నమస్కారాలు పెట్టారు.

ఎమ్మార్వో తలను పైకి, కిందకూ వూపుతా ఎవ్వరితోనూ మాట్లాడకుండా చకచకా నడుచుకుంటూ మండల కార్యాలయంలోని తన గదిలోకి వెళ్ళాడు. ఆయన వెంట పడిన వాళ్ళంతా గది ద్వారం ఆగిపోయారు. ద్వారం దగ్గర అటెండర్ నిలబడుకోని ఎమ్మార్వో గదిలోకి ఎవరినంటే వాళ్ళను పోనివ్వకుండా చూస్తా వుండాడు.

దాదాపు గంటసేపు నిల్చున్నాడు బాలకృష్ణ. లోపలనుంచి పిలుపు రాలేదు. ఎవరెవరో పోతాండారు, మాట్లాడి వస్తాండారు... అప్పటికే అంటెడర్‌తో నాల్గుగైదుసార్లు చెప్పాడు లోపలికి వెళ్ళాలని.

"వుండయ్యా... నీ మాదిర్తోనే వాళ్ళూ మనుషులే గదా" అన్నాడు అంటెండర్.

"నేను తొమ్మిదికే వచ్చినా..."

"నేను నిన్ను చూసింది యింతకు ముందే... వుండు యింకొంచేపు" అని ఆపేశాడు.

బాలకృష్ణకు తలనొప్పిగా అనిపిస్తాంది... బయటకు పోయి టీ తాగి వద్దామంటే బస్సు దిగినప్పుడు తనను చూశాడు కదా ఎమ్మార్వో, పిలుస్తాడేమో అనే ఆశ... ఎంతకూ పిలవక

పోవడంతో అటెండర్ మాటల్ను పట్టించుకో కుండా తనే చొరవగా లోపలకు దూరాడు.

ఎమ్మార్వో ఏవో కాగితాలు చూస్తాండాడు.

"నమస్కారం సార్..."అన్నాడు బాలకృష్ణ.

"ఆc... ఆc... ఏంబా... పద్దన్నే వచ్చి నావు... కుచ్చో.." అన్నాడు ఎమ్మార్వో.

"ఫర్వాలేదు సార్..." అని నిలబడుకోనే వుండిపోయాడు.

చాలాసేపు కాగితాలు చూస్తానే వుండిపో యాడు ఎమ్మార్వో...

పనయిందా... కాలేదా...

పనయితే బాగుండు...

అప్పులోల్లు యింటికొచ్చి అడగలేదుగానీ, వూర్లో అందరి దగ్గరా తప్పుడు కూతలు కూస్తాండారు... పరువు పోతాండాది... గవ ర్నమెంటు మాటలన్నీ అబద్దాలే అంటాండారు కొందరు... ఆఫీసర్లకు ఎంతెంతియ్యాల్నో... యాభయివేలన్నా పోతాదంటా వుండారు... పోతే పోయింది... మిగిలిందన్నా యిస్తే బాగుండు...

"ఏమయ్యా ఎట్లుండారు?" పలకరించాడు ఎమ్మార్వో.

"ఎట్లుంటాం సార్, మీరు దయ తల్చినా రంటే..." అని ఆపేసినాడు బాలకృష్ణ.

"నాదేముండాది...నా చేతుల్లో పనయి పో యిండాది... నేనేమో ఫేవర్‌గానే రాసినా... సబ్‌కలెక్టర్ ఎంక్వయిరీలో వేరే విధంగా తేలిందంటనే, మీ నాయన సచ్చి పోయింది ముష్టిచెక్కా బెల్లంతినేనా!" అన్నాడు ఎమ్మార్వో.

"ఆ పొద్దు మీరంతా వచ్చినారు, చూసి నారు గదా సార్... తోటలో నూరి పెట్టిండిన వుండలున్నేయి.."బాధగా చెప్పాడు బాలకృష్ణ.

తండ్రి మరణించింది నిజం... స్వచ్ఛందమ రణమా, ఆత్మహత్య అనేది కాదు... తండ్రి లేడన్న నిజాన్ని పదేపదే గుర్తు చేసుకోవడం బాలకృష్ణకు బాధగా వుంది.

"చూసినామయ్యా... మీ నాయనకు గుండె నొప్పి వున్నిందంటనే"

"గుండె నొప్పా...! లేదే"

"సబ్‌కలెక్టర్ ఎంక్వయిరీలో తేలిందంట... గుండె నొప్పి ఉన్నెట్టుగా...యింతకు ముందు ఒగటి రెండుసార్లు వచ్చిందంటనే... ముష్టి చెక్కా బెల్లంతింటే నోట్లో రక్తం వస్తాదం టనే... మీ నాయన చనిపోయినప్పుడు నోట్లో రక్తం రాలేదే..."

"..." స్థాణువులా చూస్తా వుండిపోయాడు బాలకృష్ణ.

"అయ్యన్నీ మాకెట్ల తెలస్తాయి... మీ వూళ్లో వాళ్ళు చెప్పిందేటియే..." అన్నాడు ఎమ్మార్వో.

'లేదు సార్... మా నాయన ఆత్మహత్య చేసుకున్నాడు' అని గట్టిగా అరచి చెప్పాలను కున్నాడు. కానీ నోరు పెగలక గుడ్లప్పగించి ఎమ్మార్వోనే చూస్తా వుండిపోయాడు.

"సబ్‌కలెక్టర్ మీ వూర్లో వాళ్ళు చెప్పినట్టే రాసిపంపారు. యింక కలెక్టర్ దయ, మీ అదృష్టం...మా చేతుల్లో అయితే ఏమీ లేదు'

"అయితే దుడ్డు రాదా సార్..." బలహీన స్వరంతో అడిగాడు బాలకృష్ణ.

"రూల్స్ ప్రకారం అయితే గుండె నొప్పితో అనే కాదు, ఏదైనా కానీ... అనారోగ్యంతో చని పోయినా, కుటుంబ తగాదాల వలన ఆత్మహత్య చేసుకున్నా డబ్బు రాదు. ఒకటి న్నర లక్ష వస్తాదని నువ్వయితే ఆశ పెట్టుకో వద్దు..."

"సార్సార్... ఎట్లాగట్ల చూడండి సార్... యిప్పుడు రెండెకరాలు మడి ఎండి పోయిం డాది... చేతికొచ్చిన పంట సార్... యింగ రెండు వారాలుంటే అయిపోయిండు... నీళ్ళయిపోయినాయి... చెరుకుతోట బాగుం డాది... నారు పోసినా మడి నాటాలని... ఎట్లాగట్ల ఆ దుడ్డు వచ్చేటిగా చూడండి సార్" వేడుకున్నాడు బాలకృష్ణ.

"మీది నిజమైన కేసని నాకూ తెలుసు... నేనేం చెయ్యలేనే... సబ్‌కలెక్టర్ చాలా స్ట్రిక్టు... యిట్లా కేసుల్లో ఏమనే మాత్రం అవి నీతి జరక్కుండా చూస్తాండారు. ఫైల్ కలెక్ట

ర్‌కు సబ్‌మిట్ చేసేసినారు... ఒగసారి కలె క్టర్‌తో మాట్లాడతా... మీ పరిస్థితి చెప్తా... నా చేతనయిన సాయం అది. అంతకు మించి నేనేం చేయలేను..." అన్నాడు.

"సార్... మా నాయన ముష్టిచెక్కా బెల్లం తినే చనిపోయినాడు సార్" అన్నాడు బాల కృష్ణ. అంతకుమించి మాటలు బయటకు రాలేదు... దుఃఖంతో గొంతు పూడుకుపో యింది.

"అరరే... యంగ్‌మాన్‌వి... అట్ల అధైర్యప డితే ఎట్ల... నేను కలెక్టర్‌తో మాట్లాడతా అన్నాను కదా... నీకేం భయం లేదు... మేముండాం" ధైర్యం చెప్పాడు ఎమ్మార్వో.

"యాభైవేలుగన యిచ్చింటే మా నాయన సచ్చిపోయేవాడు కాదు సార్"

"ఎలా యిస్తాం... హెల్ప్‌లైన్ ఫోన్ కూడా చేయలేదే..."

"మా వూళ్లో పదిమంది పైగా రైతులు అర్జీలు యిచ్చినారు, ఫోన్లు చేసినారు సార్... ఏమీ సాయం అందలా... అప్పులు అట్లే వుండాయి. యింగ నా పరిస్థితీ అంతే గదా సార్" నిలదీశాడు ఎమ్మార్వోను.

కుర్చీలో యిబ్బందిగా కదిలాడు ఆయన.

"తప్పకుండా ఏదో ఒగరూపంలో సాయం అందుతాదిలే... నువ్వేం దిగులు పడద్దు. ఈ పొద్దో రేపో కలెక్టర్‌తో మాట్లాడతా"

"నన్నెప్పుడు రమ్మంటారు సార్? "

"నువ్వేం రావద్దులే... నేనే చెప్పంపతా... లేకపోతే మేమే వస్తాంలే మీ వూరికి" అని ఎమ్మార్వో తిరిగి పేపర్లు చూడ్డంలో మునిగి పోయాడు.

"నమస్కారం సార్... వస్తాను సార్" అని అక్కడ నుంచి బయటపడ్డాడు బాలకృష్ణ.

రోడ్డు మీదకు వచ్చాడు...

మిట్టమధ్యాహ్నం. ఎండ జోరుగా వుంది.

ఒక్కసారిగా లోపల నుంచి ఎండలోకి వచ్చాలకు కళ్ళు తిరిగినట్టు అన్పించింది బాల కృష్ణకు. బాగా దాహంగా వుందేమో, హోటల్ వద్దకు పోయాడు.

"ఏమప్పా...ప్షనైందా" అడిగాడు మల్లయ్య.

"లేదన్నా... కలెక్టర్‌కు పంపినారంట కాగి తాలు... వస్తానే చెప్పంపతానన్నేడు. నీళ్ళ న్నా, బాగా దప్పికగా వుండాది" బండమీద కూర్చుంటా అడిగాడు.

చెంబుతో నీళ్ళు యిస్తా "ఎండలు తగ్గనే లేదప్పా... ఈళ్ళు చెప్పంపతామన్నేరు గదాని గమ్మునుండి పోవద్దు. పేపర్లలో చూస్తాం డావు గదా... అదేందో గ్రీవెన్స్‌డే అంట... మన మండలంలో ఆఫీసర్లంతా సోమవారం వుంటారే... అదేమాదిరిగా కలెక్టర్ గూడా సోమవారం అందరి బాధలూ యింటాడంట. ఒగోసారి అన్నే యిట్లాటియి శ్యాంక్షన్ చేసే స్తారంట. నువ్వాగ సోమవారం పోయి ఆయన్ను కలు... నీ పరిస్థితి చెప్పుకో... పన యిపోతాది" అన్నాడు మల్లయ్య.

నీళ్ళు తాగి చెంబు వెనక్కియిస్తా "కలెక్ట ర్‌ను కలుసుకోనిస్తారాన్నా... ఈడ ఎమ్మా ర్వోను కలుసుకోవాలంటేనే చాలాసేపు పడ తాందే" అనుమానం వెలిబుచ్చాడు బాలకృష్ణ.

"తిక్కానివిగా వుండావే. లైబ్రరీకి పోయి మంగళవారం పేపర్లలో చూడుపో... తెలు స్తాది. సినిమా టిక్కెట్ కోసరం లైనుగా నిల బడతాండ్లా... అంతే. ఒగ అర్జీ రాసుకోని పోయి లైన్లో నిలబడుకో అందర్తోపాటు లోప లికి అంపతారు"

"ఆ పని చేస్తాన్నా... లేకుంటే యిబ్బంద యితాది"

"మీ నాయన తెలివి తక్కువ పని చేసి నాడు లేప్పా... అప్పులుంటే సచ్చిపో వాల్నా... సరే...లే సోమవారం నేను చెప్పింది చేయి" అన్నాడు మల్లయ్య.

"సరేన్నా..." అంటా రోడ్డుమీదకు వచ్చాడు.

అందరి నుండి రకరకాల ప్రశ్నలు.. తన తండ్రి గురించి... అప్పుల గురించి... పంట ల గురించి... వేటినయితే తను చర్చించకూ డదు, మాట్లాడకూడదు అనుకుంటున్నాడో, వా టి గురించే తప్పని సరిగా మాట్లాడాల్సి వస్తోంది. తను చిన్నప్పట్నుంచీ తండ్రి చేసే

వ్యవసాయం చూస్తూనే ఉన్నాడు. తెలుస్తూనే వుంది. పేరుకు పెద్దరైతే గానీ మిగిలిందేమీ లేదు.

ప్రతి పంటలోనూ ప్రకృతితో యుద్ధమే...

అక్కడ గెల్చి పంట బాగొస్తే మార్కెట్‌తో యుద్ధం...

అక్కడ మాత్రం తప్పనిసరిగా ఓడిపోయే పరిస్థితే.

ఇన్నేండ్లకు, ఇంత పొలానికి... తమకు మిగిలింది అప్పులే.

అటువంటప్పుడు వ్యవసాయం చేయకుంటేనేం అనుకున్నాడు బాలకృష్ణ.

మంచి పంటలు పండించండి, ఫలానా పంటకు యింత ఇస్తాం, పెట్టుబడి అనే ప్రోత్సాహకం ప్రభుత్వం నుంచి ఉండదు. అదే ఫలానా ఫ్యాక్టరీ పెట్టండి, ఫలానా స్కూటర్ పార్ట్స్ తయారుచేయండి... సోపులు తయారు చేయండి, సిమెంటు రాళ్ళు తయారుచేయండి... మినరల్ వాటర్ తయారు చేయండి... లక్షలిస్తాం అంటా. అట్లాంటి వాటిని ప్రోత్సహిస్తుంది ప్రభుత్వం.

ట్రాక్టరు కొంటే సబ్సిడీ లోను అంటుందే కానీ జత ఎద్దులు కొనండి లోనిస్తానని చెప్పదు. అందుకే ఇక్కడ రైతుల ఆత్మహత్యలు, పశువుల హత్యలు... ప్రభుత్వం బ్యాంకులు ఎవరిని ఆదుకోవాల్నో, ఎవర్ని ప్రోత్సహించాల్నో, ఎవరికి సాయం చేయాల్నో... వాళ్లకే చేస్తే... రైతులకు ఈ గతి పట్టిందునా... దేశం ఈ మాదిరిగా వున్నిందునా... అనుకున్నాడు బాలకృష్ణ.

ఐదు నిమిషాల్లో బస్సు వచ్చింది. గబగబా ఎక్కేశాడు బాలకృష్ణ.

బస్సుతోపాటు బాలకృష్ణ ఆలోచనలూ పరుగులు తీస్తున్నాయి.

కాకపోతే బస్సుకు గమ్యం వుంది. ఆలోచనలకు గమ్యం లేదు...

నెలకు ముందుదాకా పెద్దగా బాధ్యతల్లేకుండా వుండేవాడు. తండ్రి మరణంతో ఒక్కసారిగా కుటుంబ వ్యవహారాలన్నీ చూడాల్సి వచ్చింది. తను కువైట్‌కు పోయి, బాగా సంపాదించి అమ్మా నాన్నను సుఖ పెట్టాలకున్నాడు.

తండ్రి హఠాత్తుగా చనిపోవడంతో అందరికన్నా ఎక్కువ బాధపడింది బాలకృష్ణే.

సేద్యం వద్దనుకున్నాడు గానీ తల్లి తృప్తి కోసం చేయక తప్పేట్లు లేదు. ఎట్లన్నా గానీ, కొయ్యేటికి పోవాల. దండిగా దుడ్డు సంపాదించాల. అమ్మను సుఖపెట్టాల' అనుకున్నాడు.

నూతన కాల్వ చిన్నరెడ్డేరిపల్లె దగ్గర బస్సు దిగి, తమ ఊరికి నడిచి వెళ్లాడు. నేరుగా యింటికి పోయి గబగబా చన్నీళ్ళు దిగబోసుకోని, కొంచెం అన్నం తిని, పొలం వద్దకు పోయాడు.

దూరంనించే వరికయ్యలో ఆవులు కనిపించాయి.

ఎవరివయ్యా... మాయ్యేనా. ఎవరన్నా తోలి మేపతాండారా అనుకుంటా అడుగుల

## 'స్వరాజ్య'పై విసుర్లు

బ్రిటిషర్ల నయవంచనకు ఆగ్రహోదగ్రులైె కాంగ్రెస్ నాయకుల్లో మూడొంతుల మంది శాసనసభా బహిష్కారం చేయాలని అనుకుంటున్న తరుణంలో తిరుచునాపల్లి జైలు నుంచి విడుదలయ్యారు దుగ్గిరాల. మోతీలాల్, చిత్తరంజన్‌దాస్ లాంటి కొందరు పెద్దలు స్వరాజ్యపార్టీ స్థాపించి శాసనసభలో ప్రవేశానికి యత్నిస్తున్నారని తెలిసి మండిపడ్డారు. వెంటనే వారి తీరును, ఆ పార్టీ ఏర్పాటును వెక్కిరిస్తూ ఈ కిచిడీ శ్లోకం చెప్పారాయన.

'నయాచే రిఫారం నవా స్టీలు ఫ్రేముం
న కౌన్సిల్ నతు ప్రీవీ కౌన్సిల్ పదం
నా స్వరాజార్తి హన్తాం ఆంగ్ల రాజ్యా
నిమన్తాం
ఫరంగీ ఫిరంగీ ధృగంగీ కరోతు'

వేగం పెంచాడు... పొలం దగ్గరయ్యే కొద్దీ ఆవులు స్పష్టంగానే కన్పిస్తావుండాయి. తమవే అవి.

కోతలు కోసి, కుప్పలు కొట్టాల్సిన సమయంలో గొడ్లను తోలి మేపాల్సి వచ్చింది... దగ్గర్లో అమ్మా, చెల్లీ ఎవరూ కన్పించలేదు. చుట్టూ ఒకసారి కలియజూశాడు.

బాయి పక్కన తమ తాత, అవ్వా సమాధులుండాయి. వాటి పక్కనే తండ్రి సమాధి. సమాధి మీద వేసిన పూల హారాలు ఎండిపోయి ఆవు మేస్తున్న వరి కర్రల్లా వున్నాయి.

సమాధి ఎదురుగా దీర్ఘ ముద్రలో రమణమ్మ కూర్చుని వుంది.

ఆ దృశ్యాన్ని చూడగానే బాలకృష్ణ మనసు వికలమయిపోయింది.




చిటపటమంటా చినుకులు సన్నగా పడతా వుండాయి... ఆకాశమంతా మబ్బులు కమ్ముకోనుండాయి. రెండు రోజులు వాన కురిసింది. ఆరోజే కాస్త తెరిపి యిచ్చింది.

మడకలు, ఎద్దులు వుండేవాళ్ళు గింజలు వేయడానికి వెళ్ళారు. శారద శివరాం వాళ్ళకు గింజలు వేయడానికి వెళ్ళింది. అందరూ పొలాల వద్దకు పోవడంతో వూరంతా నిర్మానుష్యంగా వుంది. అప్పుడప్పుడు కాకులు, కుక్కల అరుపులు తప్ప మరో శబ్దం లేదు. సమయం తొమ్మిది గంటలవుతావుంది.

"నేను మామోళ్ళవూరికి పోయొస్తామ్మా" అన్నాడు బాలకృష్ణ వంటగది గుమ్మం వద్ద నిలబడుకోని.

కొడుకువైపు ప్రశ్నార్థకంగా చూసింది గంజి వార్చుతున్న రమణమ్మ.

"వాన పడతాంది, అందరూ గింజలేస్తాండారు కదా. నేనొగసారి మామోళ్ళ యింటికి పోయొస్తా" అన్నాడు మళ్ళీ బాలకృష్ణ.

"ఎందుకురా" అందామె గంజి పాత్రను తీసుకుని కుడితి తొట్టి దగ్గరకు పోతా. బాలకృష్ణ హాల్లో కూర్చుని గోడకు వేలాడుతున్న తండ్రి ఫోటోను చూడసాగాడు.

గంజిని కుమ్మరించేసి వచ్చి "ఎందుకురా" అని మళ్ళీ అడిగింది రమణమ్మ.

"అదేమ్మా... అందురూ గింజలేస్తాండారు గదా - మనకు దుడ్డేడా దొరకలా" అందుకని అంటూ ఆపేశాడు.

"అందుకుని" రెట్టించి రమణమ్మ

"..."

"అందుకని మీ మామోళ్ళను అడగతానంటావా".

"..."

"వాళ్ళు యిస్తారంటవారా... బంధువుల దగ్గర అడిగి లేదనిపించుకుంటే బాగుండదు. సాయం చేసేవాళ్ళయితే ఈ పాటికే చేసిందురు. మన పరిస్థితి వాళ్ళకు తెలుసు గదా... మీనాయన చావుకు వచ్చిన్నేరు.. దినాలకూ వచ్చిన్నేరు.. 'ఏమ్మే, బావ సచ్చిపాయగదా... యింట్లో ఎట్ల చేస్తాండారు... ఏమన్నా సాయం గావాల్నా" అని అడగలా అట్లా వోళ్ళ దెగ్గరికి పోయి ఏమని అడగతావురా..." ప్రశ్నించింది రమణమ్మ.

తమకు సాయం చెయ్యకపోతే పోయారు, కనీసం మంచీ చెడ్డా కూడా విచారించలేదే అనే బాధుంది రమణమ్మ మనసులో.

"ఆ టయానికి లేదేమోమ్మా వాళ్ళ దగ్గర" మెల్లగా అన్నాడు బాలకృష్ణ.

"ఎందుకు లేదురా... వాళ్ళకు వూర్లో సేద్దెం వుండాది. టౌన్లో అంగడి వుండాది, స్టోరుండాది... వాళ్ళకేమన్నా దుడ్డు తక్కువా... ఒగేళ అప్పుడు చేతిలో లేకపోయినా యిట్ల అవసరం వుండాది. మా చెల్లోల్లకు యియ్యాల" అంటే ఎవరు ఈరు మీ మామకు ఇరవై ముప్పైవేలు. మనకు సాయం చెయ్యాలని

వాళ్ళకు లేదు... అట్లా వాళ్ళను అడిగి లేదని పించుకోని అవమానపడేదానికన్నా గమ్మునుండేది మేలు"

"మనకేం వాళ్ళు అప్పుగా యిచ్చేది వద్దమ్మా... తిరిపానికీ వద్దు... ఎట్లా మామా కూతుర్ని నాకేగద యిస్తామన్నేరు. లక్ష రూపాయలు బేంకులో ఏసినారంట గదా... కట్నం వద్దు యిప్పుడే యాభయి వేలిమ్మందాం. దాంతో గింజలు ఏసుకోవచ్చు, బోరూ ఏసుకోవచ్చు"

ఆ మాటలతో ఆలోచనలో పడింది రమణమ్మ.

"ఎట్లా ఈసారి పసల పండగపోతానే శారద పెండ్లి చెయ్యాలనుకున్నేం గదా... నేనూ అప్పుడే చేసుకునేస్తా. మిగిలింది పెండ్లికి యిస్తే చాలు" వివరించాడు బాలకృష్ణ.

"ఔను. ఇప్పుడు జులై. యింగో ఆరేడునెల్లే గదా... ఇస్తార్లే... మనకిచ్చేదే గదా... పొయ్యేసి రాపో" అంది రమణమ్మ.

"ఆ మహన్నబావుడు బతికున్నింటే మనకిన్ని తిప్పలున్నీండవు... ఆ పొద్దు ఆఫీసర్లంతా యింటికొచ్చి మాటలు చెబ్తే మీ నాయన సచ్చిపోయి మనల్ని గడ్డనేసినాడనుకుంటి... యింత దాంకా సాయం అందలా.. వూర్లో ఎవరో కడుపు మంటోళ్ళు వాళ్ళకు ఏమేమో చెప్పినారంటివి.. యింగ ఆసాయం వస్తాదో రాదో గూడా తెల్లా... మీ యిద్దరికీ గన పెండ్లయిపోయింటే, నేను గూడా ఏదో ఒగటి చేసుకోనుందు... ఆయనే పోయినాంక యింగ నేనుండి ఏం చేయాలి... నాకారాత లేకుండా చేసినాడు భగవంతుడు" అంది రమణమ్మ. అప్పటికే ఆమె కళ్ళలో నీళ్ళు నిండుకున్నాయి. భర్తను తలచుకున్నపుడంతా ఆమెలో దుఃఖం తెరలు తెరలుగా వస్తానే వుంది. పంటి బిగువున దుఃఖాన్ని ఆపుకుంటోంది.

బాలకృష్ణకు కూడా దుఃఖమే కానీ యింటికి వున్న ఒకే ఒక మగదిక్కుగా అందరూ పెద్దరికాన్ని ఆపాదించడంతో వీలయినంత వరకు గంభీరంగా వుండటానికి, ఏడ్వకుండా వుండటానికి ప్రయత్నిస్తున్నాడు.

"ఎప్పుడు పోయొస్తావు?" అడిగింది రమణమ్మ కాసేపటి తర్వాత.

"మనమిద్దరం పోతే బాగుంటాదేమోమ్మా"

"మనమిద్దరమా...?"

"ఔనుమ్మా... నేను పోయి ఎట్లడిగేది కట్నం దుడ్డు యిప్పుడే ఈండని, పెద్దోళ్ళుంటే బాగుంటాది కదా..."

ఆలోచనలో పడిపోయింది రమణమ్మ. ఆమె ఏమాలోచిస్తోందో కానీ కళ్ళనుంచి ధారాపాతంగా నీళ్ళు కారతండాయి. తండ్రి చనిపోయిందానికే అమ్మ ఏడుస్తోందని బాలకృష్ణ అనుకున్నాడు. తను ఏం మాట్లాడితే ఏ విధంగా స్పందిస్తుందో అర్థంకాక, గోడకున్న తండ్రి ఫోటోను చూస్తా మౌనంగా వుండిపోయాడు బాలకృష్ణ.

చాలా సేపటి తర్వాత పైటచెంగుతో కళ్ళు తుడుచుకుని, వీధిలోకి పోయి చీదేసి వచ్చి యధాస్థానంలో కూర్చుంది రమణమ్మ.

"మీ నాయన సచ్చిపోయి నెలయింతాం డాది... యింతవరకు నాకు కీడుగుడ్డ ఎయ్యలా మీ మామోళ్ళు..."

"సమచ్చరంలోపల ఎప్పడయినా పెట్టచ్చంట గదమ్మా..."

"ఔనురా పెట్టచ్చు జరుగుబాటు లేకుంటే సమచ్చరం దినాలు. మీ మామోళ్ళకు జరుగుబాటు లేదా... దిగవీధిలో ఉండేటి సిద్దన్న సచ్చిపోతే, ఆ వదినకు వాళ్ళ అన్నోళ్ళు తొలీ వారంలోనే పిల్చకపోయి కీడుగుడ్డ పెట్టలా... వూర్లో దినమ్మా ఆడోళ్ళంతా నన్నడగతాం డారు, 'మీ అన్నోళ్ళు రాలేదా, ఎప్పుడొస్తారు' అని" అంది రమణమ్మ ఏడుపు గొంతుతో.

"ఎందుకు పిల్చకపోలా" గొణుగుతున్నట్టుగా అన్నాడు బాలకృష్ణ.

"నీకు గుర్తుందో లేదోరా... మనం యిబ్బందుల్లో పడిన ఈ నాలుగైదేండ్ల నించే వాళ్ళు మనింటికి సరిగా రాంది. అంతకు ముందు నెలకు, రెండు నెల్లకు ఒగసారన్నా వచ్చిపోతా

న్నేరు. యిప్పుడు నన్ను పిల్చకపోయి కీడుగుడ్డ ఏసేదానికి వాళ్ళ దగ్గర లేక కాదు. నన్ను పిల్చకపోతే ఏదన్నా సాయం చేయ మంటానేమో అనే భయం... అంతే.. అట్లా తావుకు ఎట్లరా రమ్మంటావు నన్ను...? అసలు వాళ్ళొచ్చి పిల్చకపోయేదాకా. నేను ఆయింటి గడక తొక్కగూడదు. అది ఆచా రము" అంది రమణమ్మ, బలవంతంగా ఏడు పును ఆపుకుంటా.

చాలాసేపు తల్లీ కొడుకులు మాట్లాడుకో లేదు.

"యియ్యన్నీ ఆలోచిస్తాంటే, వాళ్ళ బిడ్డను గూడా మనింట్లో ఈరేమో అన్పిస్తోంది" అంది రమణమ్మ.

"అదెట్లమ్మా, మనం మాటనుకోని గుడా ఐదేండ్లు అయిపాయగదా... యిప్పుడెందు కీరు? " ఎదురు ప్రశ్నించాడు బాలకృష్ణ.

"ఎందుకీరంటే.. అప్పుడు వాళ్ళకన్నా మన పరిస్థితే బాగున్నింది. వాళ్ళు యాపారం పెట్టి నాంక బాగ సంపాదించ్చినారు. మనమేమో అప్పులయిపోతిమి. నువ్వు బాగా చదువ తావు. వుద్యోగం వస్తుంది అనుకోనున్నేరు. నువ్వు బాగా చదువుకోలా. మీ నాయన అప్పులెక్కువయినాయని కాలం చేసే. 'ఆడి చ్చినా మా బిడ్డ సుఖపడదు' అనుకోనుం టారు" అంది ఒక్కో మాటను నెమ్మదిగా.

"ఈకుంటే పోనీలే. నాకేం మల్ల పిల్లే దొర కదా? ఎందుకీరుమ్మా. పెద్ద మనుషులు లేరా... నలుగుర్లో పెట్టి మానం తీసేస్తా" ఆవేశంగా అన్నాడు బాలకృష్ణ.

"యిదంతా నా ఆలోచనేలేరా. ఒకసారి ఆడికి పోయ్యేసిరా తెలస్తాది. ఆడికిపోతే అర్థ మయిపోతాది గదా వాళ్ళు ఎట్లుండేది. నువ్వే అడుగు దుడ్డు అంది రమణమ్మ. ఏడ్వడంతో ఆమె మనసు కొంచెం తెరిపిన పడినట్టుగా వుంది. కుదురుగా మాట్లాడతా వుంది.

"ఎప్పుడు పొమ్మంటావుమా? "

"నీ యిష్టం, ఎంత బిన్నే పోయొస్తే అంత మంచిది గదా. మీ మామోళ్ళు దుడ్డు అంతో యింతో యిచ్చినా చెనిగ్గింజలు ఏసుకోవచ్చు" అంటా లేచి క్యాలెండర్ చూసి "ఈ పొద్దు బాగానే వుండాది. విదియగినీ.. ఈ పొద్దే ఎలబారు" అంది.

"సరేమ్మా, యాభయి వేలే అడుగతా. అంతలేదంటే యిప్పటికి ఐదారు వేలన్నా తీసుకోనొస్తా. చెనిగ్గింజలు ఏసుకున్నేమంటే, మల్ల ఎట్లనోగట్ల చేసుకుందాం" అన్నాడు బాలకృష్ణ.

చకచకా స్నానం చేసి, బయలు దేరాడు బా లకృష్ణ. నూతన కాల్వకు చేరేప్పటికి పదకొం డయింది. అరగంటలో బస్సొచ్చింది.

బస్సులో పీలేరుకు పోయాడు. అక్కడ మదనపల్లె బస్సెక్కగానే బయలుదేరింది.

యింటి దగ్గర బయలుదేరినప్పటి నుంచీ మరదలు శాంత గుర్తొస్తానే వుంది బాల కృష్ణకు. శాంత తనకన్నా ఎనిమిదేళ్ళు చిన్నది. చిన్నప్పుడు తామంతా అమ్మమ్మ వాళ్ళ యింటికి పోతూ ఉండేవారు. తనకు చిన్నప్ప ట్నించే శాంత తనకే అని చెప్పేవాళ్ళంతా. ఐదేండ్లకు ముందు ఒకసారి అందరూ కలిసి అనుకున్నారు. తమకిద్దరికీ పెండ్లి చేయాలని. అప్పటి నుంచి తనకు శాంతమీదున్న యిష్టం ప్రేమగా మారింది. శాంతకు కూడా తనంటే యిష్టమే. నాన్న చనిపోయినప్పుడు అందరూ వచ్చారు. అప్పుడేం మాట్లాడుకోలేదు.

తను శాంతతో మాట్లాడి చాలా రోజుల యింది. ఈ రోజు తనను చూస్తానే ఏమ నుకుంటుంది. అమ్మ చెప్పింది నిజమేనా. సాయంచేయాల్సి వస్తాదనే అమ్మను పిల్చక పోలేదా? అదే నిజమయితే యిప్పుడు దుడ్డు సాయం చేస్తారా. కనీసం మరదలిన యినా తనకిచ్చి పెండి చేస్తారా. అమ్మ చెప్పింది ఆలోచిస్తే. మామోళ్ళ మనసు మారినట్టే అన్పిస్తాంది. లేకుంటే వాళ్ళను డబ్బు సాయం చేయమని అడగాల్నా. వాళ్ళే చేయాల గదా. ఎందుకు యిట్లయినారు. దుడ్డు లేదనేనా? శాంత బాధపడదా. తను బాధపడడా. బాధపడి ఏం చేయాల.

పెద్దలు ఒప్పుకోక పోతే వాళ్ళక్కావలసింది దుడ్డేనా. దుడ్డేనా? కొయ్యేటికి పోతాను. బాగా సంపాదిస్తాను. అప్పుడీరా శాంతను. అన్నేండ్లు పెండ్లి చెయ్యకుండా పెడతారా. పెడతారు. పెడతారు. శాంత ఎదురు తిర గతాది. తన కోసం ఎదురుచూస్తాది. శార దకు పెండ్లి చేసేసి అత్తగారింటి అంపిచ్చేసి శాంతను పెండ్లి చేసుకోని అమ్మకు తోడుగా పెట్టి కొయ్యేటికి పోతాను. దండిగా సంపా దిస్తాను. యిలా రకరకాలుగా బాలకృష్ణ మనసులో ఆలోచనలు సుడులు తిరుగు తూనే వున్నాయి.

బస్సు మదనపల్లె చేరేప్పటికి రెండున్నర యింది.

బాలకృష్ణ బస్టాండు దగ్గర డజను అరటి పండ్లు, నాలుగు మూరల మల్లెపూలు, రెండు గులాబీలు తీసుకున్నాడు. అక్కడి నుంచి కాలి నడకన బయలుదేరాడు. బర్మా వీధిలో దూరి, పుంగనూరు రోడ్డులోకొచ్చి నడుచుకుంటా యిరవై నిముషాల్లో బచ్చిని కొండ దగ్గరున్న మామ గారింటికి చేరుకున్నాడు. యింటి ముందు చిల్లరంగట్లో చిన్నబామ్మర్ది కుచ్చోనుండాడు. వాడు బాలకృష్ణను చూడ గానే ఆశ్చర్యపోయాడు.

"బాగుండావా బావా?" అంటా పలకరిం చాడు. వాడితో మాట్లాడి యింట్లోకి అడుగు పెట్టాడు. యిల్లంతా సందడిగా వుంది తనను చూడగానే అత్త ముఖం మాడ్చుకుంది. మామ యిక తప్పదు అన్నట్టుగా మాట్లా డాడు. శాంతయితే కంటికే కనిపించలేదు. యింతకు ముందు ఎప్పుడన్నా వస్తే తనే యిల్లంతా వెతికి ఎక్కడున్నా పట్టుకుని మాట్లాడే వాడు. యిప్పుడెందుకో అంత చొరవ చూపలేకపోయాడు. అది తనకు అమ్మమ్మ యిల్లుగా చిన్నప్పుడు



ఆడిపాడుకున్న స్థలంగా అన్పించడం లేదు. హాల్లో కూర్చోడానికి ఖాళీ కుర్చీ కనిపించలేదు. కొత్తవాళ్ళతో ఏదో మాట్లాడతావుండాడు మామ. ఆ వాతావరణం ఏదో యిబ్బందిగా అనిపించింది బాలకృష్ణకు. తను తెచ్చిన పూలు, పండ్లు లోపల పెట్టి అంగడి వద్దకు వచ్చాడు.

ఒక్కసారిగా తన కాళ్ళ కింది భూమి కుంగిపోతాన్నెట్టుగా అనిపించింది బాలకృష్ణకు. తను విన్నది నిజం కాకపోతే బాగుండు అనుకున్నాడు

"ఏం బావా వచ్చేస్తివి. అన్నం తినవా?" అన్నాడు బామ్మర్ది.

"తిన్నేలే. యింట్లో వుండేవాళ్ళంతా ఎవర్రా" అనుమానంగా అడిగాడు బాలకృష్ణ.

చెప్పాలా వద్దా అని కాసేపు తటపటాయించి "శాంతక్కకు పెత్తనం వచ్చినారు బావా... ఈ పొద్దు నిశ్చితార్థం" అన్నాడు మెల్లగ.

ఒక్కసారిగా తన కాళ్ళ కింది భూమి కుంగిపోతాన్నెట్టుగా అనిపించింది బాలకృష్ణకు. "ఎందిరా" అన్నాడు బెంచీమీద కూర్చుంటా. తను విన్నది నిజం కాకపోతే బాగుండు అనుకుంటున్నాడు.

"శాంతక్కకు నిశ్చితార్థం బావా" అన్నాడు వాడు ఈసారి కాస్త గట్టిగానే.

శాంతకు నిశ్చితార్థమా...?

తనకిస్తానని చెప్పి తమకు మాట మాత్రం కూడా చెప్పా పెట్టకుండా వేరేవాళ్ళతో నిశ్చితార్థమా.

శాంత ఒప్పుకునిందా? ఒప్పుకోక ఏం చేస్తుంది.

యింతవమానమా...

దీనికి వీళ్ళకు యింతకు యింత చెయ్యాల...

ఈ నిశ్చితార్థం జరగకుండా చేస్తా... ఏమనుకుంటాండారో నా గురించి ఈళ్ళు... మంచికి మంచి, చెడ్డకు చెడ్డా అని తెలీదేమో... ఆడికి పోతా. నాకూ శాంతకు సంబంధం వుందని చెప్తా. నిజంగా సంబంధం లేకుంటేయేం... ఈ సంబంధం ఎగిరిపోవాల... శాంత బాధపడదా, అందరిలో అవమానం అయిందని. శాంత ఒప్పుకోనుంటేనే నిశ్చితార్థం పెట్టుకున్నారేమో. తనంటే శాంతకు యిష్టం కదా. ఎట్ల ఒప్పుకుంటాది. తన మీద ఎందుకు యిష్టం వుండాల. ఉద్యోగం లేదు. అప్పులతో నాయన పాయ. నేలున్నా నీళ్ళు లేవు. గింజలు ఏసుకునేదానికి ఐదారువేలు అడిగేదానికి వచ్చినాడు. అడక్క తినేదానికి వచ్చినాడు. తనను చేసుకుంటే శాంతకు అడక్కతినే గతేనా.. అట్లనుకోనేనా వేరే సంబంధం ఖాయం చేస్తాండారు. కొయ్యేటికి పోయి దండిగా దుడ్డు సంపాదిస్తా. దీనెమ్మట్లా సంబంధం వస్తాది. శాంత రాదు గదా. యిప్పుడేం చెయ్యాల. అమ్మ ముందే చెప్పింది. రాకుండా వున్నే బాగుండు. యిప్పుడేం చేయాల... ఏం మాట్లాడాలీడ... ఎల్లిపోతా... ఒక్కసారి శాంతను చూసి.. చూడనిస్తారా శాంతను... చూసి శాంత ఏడ్పు ముఖంతో వుంటే తనుండగలడా.. గొడవ చెయ్యడా... వద్దొద్దు. తన మామోళ్ళు అవమానం పాలు కాకూడదు... ఎళ్ళిపోతా... శాంతను చూడకుండానే ఎళ్ళిపోతా... అనుకుంటా పైకి లేచాడు బాలకృష్ణ. కండ్లు తడిబారుతున్నాయి. యింతకు ముందుదాకా వున్న ఆకలి యిప్పుడు చచ్చిపోయింది.

ఎవరికో సరుకులు యిస్తున్నాడు బామ్మర్ది. వాడికి పోయొస్తానని కూడా చెప్పలేదు. చెప్పడానికి గొంతు పెగలడం లేదు. నోరు తెరిస్తే గుండె పగిలేలా వుంది. నాలుగడుగులు ముందుకు వేసి వెనుదిరిగి మామ యింటిని చూశాడు కళ్ళనుంచి నీళ్ళు జలజల రాలాయి. మిద్దెమీద ఎవరిదో స్త్రీ రూపం అస్పష్టంగా కనిపించింది.

అక్కడి నుంచి చకచకా నడుచుకుంటూ బస్టాండుకు చేరుకున్నాడు. బస్సులేదు. బాగా నీరసంగా వున్నట్టుంది. సమయం నాలుగు దాటింది. తనేమీ తినలేదన్న సంగతి గుర్తొచ్చింది. ఆకలి లేదు. నీరసంతో ఆకలి సచ్చిపోయింది.

ఏమీ తినకుండానే బస్టాండుకు చేరుకున్నాడు. బాగా దాహంగా వుండటంతో రెండు ప్యాకెట్ల నీళ్ళు తాగాడు. పీలేరు బస్సు రావడంతో ఎక్కి కూర్చున్నాడు. బస్సు బయలుదేరింది. టికెట్ తీసుకుని సీట్లో వెనక్కి జారగిలబడి కూర్చున్నాడు. కళ్ళు మూసుకున్నాడు. నిస్త్రాణంగా మగతగా అన్పించింది... అలానే వుండి పోయాడు...

'నన్ను కొయ్యేటికంపిచ్చు. అంతకు మించి నిన్నేం కోరకోను. కొయ్యేటికి పోయ్యేది కుదిరిందంటే, కొండకు నడిచొచ్చి గుండు కొట్టించుకుంటా. కొయ్యేటికి పోయి లక్షలు కోట్లు సంపాదిస్తా... నేననుకుంటే ఏదయినా చేస్తా... అయితే శాంతను పెళ్ళి చేసుకోగలనా? ఎడతెగని ఆలోచనలు.

పీలేరులో దిగాడు. తను వెళ్లాలిసిన బస్సు లేదు. ఏవేవో బస్సులు వస్తున్నాయి, పోతున్నాయి.పింఛా బస్సు మాత్రం రాలేదు.

ఏడు గంటలయింది. చుట్టూ చీకట్లు చుట్టు ముట్టిండాయి.. చీకట్ని చెదరగొడుతూ బస్టాండులో లైట్ల వెలుతురు.

బస్టాండులో ఈ చివర నుంచి ఆ చివరకు , ఆ చివర నుంచి ఈ చివరకు నడుస్తున్నాడు. వేరుశనగ గింజలు వేసే అదును కావడంతో ఎక్కువమంది వాటి గురించే మాట్లాడుకుంటా వుండారు.

'మడి అమ్మితే...' హఠాత్తుగా కలిగిందా ఆలోచన.

అంతే... అంతే... మడి అమ్మాల్సిందే...

నీళ్ళు లేని మడి...ఆశలు రేపి ప్రాణాలు పిండతాండే మడి...మడి వుంటేనే గదా బోరేయాలన్పించేది... బోరేసి సేద్దిం చేయాలన్పించేది... మడే లేకపోతే... ఏ బాధా లేదు... అదే మేలు... అదే మేలు... తిండికి లేకుంటే పోయింది... అప్పులు కాకుండా వుంటాది... జనం పరుగులు తీస్తాండారు...పింఛా బస్సు...

బాలకృష్ణ పరుగున వెళ్లి ఎక్కాడు

ఎట్లన్నాగానీ... అమ్మను ఒప్పించాల... మడి అమ్మాల... అనుకున్నాడు.

అమ్మ ఒప్పుకుంటుందా... ఒప్పుకోక ఏం చేస్తాది... వేరే దోవలేదు... అని నిర్ణయించుకున్నాడు.

నూతన కాల్వ చిన్నరెడ్డేరిపల్లెలో బస్సు దిగి వూరిదోవ పట్టాడు... బాలచంద్రుడు ఎప్పుడో గుంకిపోయాడు. గాఢాంధకారం. తగ్గూ మిట్టా రాయీ రప్పా తెలీడం లేదు.

చీకట్లో తడుముకుంటా యింటికి చేరేప్పటికి పదిన్నరయింది.

అంత రాత్రిలో వస్తాడని రమణమ్మ అనుకోలేదేమో... కొడుకును చూస్తానే ఆశ్చర్యపోయింది. బాలకృష్ణకు బాగా ఆకలిగా వుంది కానీ తినబుద్ధి కాలేదు. తల్లి మాటలకు వూఁ... ఆఁ... అని సమాధానం యిచ్చి పడుకునేశాడు. పడుకున్నా కానీ ఆలోచనలు వదలలేదు. ఎట్ల చెప్పాల అమ్మకు... మామ కూతురి సంగతి... మడి అమ్మే సంగతి... చాలాసేపు ఆలోచిస్తానే వుండిపోయాడు...

ఎప్పటికో నిద్రపట్టింది... నిద్ర పట్టినంతసేపూ రకరకాల కలలు... శాంత... మామ... నాయన... అమ్మ... అక్క... చెల్లెలు... నాగరాజు... ఎమ్మార్వో... యింకా ఎవరెవరో కన్పిస్తాండారు... ఏదేదో చెప్తాండారు... అంతా అస్పష్టంగా విన్పిస్తాంది. ఏందో గజిబిజిగా వుంది.

తెల్లవారి రమణమ్మ నిద్ర లేపేదాకా మెలకువ రాలేదు బాలకృష్ణకు.

అప్పటికే పొద్దు పది బారలెక్కింది. శారద గింజలేయను వెళ్ళిపోయింది. బాలకృష్ణ వొళ్ళంతా ఒకటే నొప్పులుగా అనిపించింది. బద్దకంగా నిద్ర లేచాడు.

"పొద్దు చూడరా ఎంతెక్కిందో. ఈ యరవ

దాంకా పొనుకుంటారా? " అంది రమణమ్మ. అన్నగారింటి కాడ సంగతులు తెలుసుకోవా లని ఆతృతగా వుందామెకు.

కాలకృత్యాలు తీర్చుకుని, వేడి వేడి నీళ్ళతో స్నానం చేసి, ఉడుకుడుకు అన్నం, పప్పుతో తిన్నాడు.

అంతవరకు రమణమ్మ కూడా మౌనంగానే వుండిపోయింది.

ఏమడిగితే ఏమి వినాల్సి వస్తుందో అనే భయం పీడిస్తా వుందామెను.

కొడుకు తినడం అయ్యాక "ఏమయిందిరా, ఏమన్నేడు మీ మామ" అడిగింది రమణమ్మ కొడుకు ముఖంలోకి చూస్తా.

తనను కాదన్నట్టుగా మౌనంగా వుండిపో యాడు బాలకృష్ణ.

"ఏమన్నేడురా" మళ్ళీ అడిగిందామె

యిక తప్పదనుకుని మెల్లమెల్లగా అక్కడ జరిగిందంతా వివరించాడు.

అలా జరుగుతుందని ముందే వూహిం చింది రమణమ్మ కానీ ఎక్కడో ఆశ... అట్ల జరగదు. స్వంత అన్న... కూతుర్ని యిస్తా నని మాటిచ్చినాడు... మాట తప్పడులే అను కుంది. యిప్పుడిలా జరగడం విని తట్టుకోలేక పోయింది. ఎంత ఆపుకుందామన్నా ఏడుపు ఆగలేదామెకు. వలవలా ఏడ్చేసింది.

"ఎందుకంతగా ఏడుస్తావ్! నాకేమన్నా పిల్లే దొరకదా? దేశమేమన్నా గొడ్డు బోయిందా? వాళ్ళ జేజట్ల సంబంధం వస్తాదిలే" అన్నాడు కోపంగా బాలకృష్ణ. కోపంగా అరిచాడు కానీ, శాంత తనకు దక్కదన్న విషయాన్ని జీర్ణించు కోలేకున్నాడు. తల్లి ముందు ఏడిస్తే ఆమె మరింతగా బాధపడుతుందని, అతి కష్టంగా బాధను భరిస్తున్నాడు.

రమణమ్మ ఏడుపు ఆగలేదు. తల్లిని చూస్తే బాధేసింది బాలకృష్ణకు.

అరగంటపాటు ఏడిస్తే కానీ ఆమె బాధ తగ్గలేదు... అంతవరకు మౌనంగా వుండిపో యాడు బాలకృష్ణ. తను మడి అమ్మాలను కుంటున్న సంగతిని మెల్లగా చెప్పాడు.

రమణమ్మ అందుకు ఒప్పుకోలేదు. యింకా ఒక ఆడబిడ్డ వుండాది. పెండ్లి చేయాల... వున్నిదంతా అమ్మేస్తా పోతే ఎట్ల అంది.

మడి అమ్మకపోతే యిక తమకు బతుకే లేదని రెండెకరాలు అమ్మేసి చెనిగివేసి, బోరు వేస్తానని చెప్పడంతో రమణమ్మ ఒప్పుకుంది.

వారం రోజుల్లో మడి బేరం కుదిరింది...

రెండెకరాలను వెంకటమునే లక్ష రూపా యులకు కొనుక్కున్నాడు. మొదట యాభై వేలు, తర్వాత యిరవైవేలు ముందే యిచ్చాడు వెంకటముని. అదంతా పట్టుకొని యిస్తానని కూర్చున్నాడు. పెద్దలంతా సర్ది చెప్పి వెంకట ముని యాభైవేలు యిచ్చేటిగా ఒప్పించారు. ఆరోజే పీలేరు పోయి రాత కోతలు పూర్తి చేసుకుని యింటికి వచ్చినారు తల్లిబిడ్డలు. చేతిలో వేలల్లో డబ్బుయితే వుందిగాని ముగ్గు రిలోనూ ఆనందం లేదు. వస్తా వస్తా పీలే రులో బోరు వేసేవాళ్ళతో చెప్పేసి వచ్చాడు మరుసటిరోజు రమ్మని.

* * *

రిజిస్ట్రేషన్ పని ముగించుకుని ముగ్గురూ పీలేరు నుంచి యింటికి వచ్చేలకు యింటి దగ్గర పెద్ద కూతుకు విజయ తన రెండేళ్ళ పిల్లాడిని పెట్టుకోని వుంది.

"ఎంచేపయిందిమ్మా వచ్చి.. బాగుండారా" పలకరించింది రమణమ్మ.

"బాగుండావాక్కా... బావ బాగుండాడా" పలకరించారు శారద, బాలకృష్ణ.

బాలకృష్ణ అప్పటికప్పుడే వూర్లోకి పోయి, నాటుకోడి ఒకటి కొనుక్కొని, అప్సర్‌సాబ్ దగ్గర అలాల్ చేపించుకోని యింటికి తెచ్చాడు.

చపాతీలు, కోడికూర చేశారు. అందరూ గలగలా మాటలు చెప్తా వుండారు. రమ ణమ్మకు మాత్రం కూతురి రాక ఎందుకో భయంగా వుంది.

అందరూ తినేసి పడుకునే ముందు "మడి దుడ్డు యిచ్చినారామ్మా" అడిగింది విజయ ఉపోద్ఘాతంగా.

రమణమ్మ మౌనంగా ఉండిపోయింది.

"యిచ్చేసినారుక్కా..." బాలకృష్ణ జవాబిచ్చాడు.

"నాకు పెద్ద చైను చేపిస్తాండారా..."

అందరూ మౌనంగా వుండిపోయారు, ఒకరి ముఖాలు ఒకరు చూసుకుంటా...

"పెండ్లయ్యి నాలుగేండ్లయితాండది. పెద్ద చైను చేపిస్తామని మాటిస్తిరి. మా అత్తోల్లు అడగతాండారుమ్మా దినమ్మూ" మళ్ళీ మొదలు పెట్టింది విజయ.

కూతురి వైపు పరిశీలనగా చూసింది రమణమ్మ.

పెళ్ళికి ముందు అప్పుడే విచ్చుకున్న ముద్ద బంతి పూవులా వుండేది. యిప్పుడు వాడిపోయిన పూవులా వుంది. కొడుకును చిన్న కూతుర్ని చూసింది. అందరూ రమణమ్మనే చూస్తా వుండారు... ఒకసారి దీర్ఘంగా నిట్టూర్చింది.

"మాట చెప్పినాం... కాదంటాండామా... చూస్తాండావు గదా పరిస్థితి... ఎట్లా రోజులొచ్చినాయో చూడు... ఒగ పంటన్నా బాగొస్తే గదా... అంతకంతకూ అప్పులు పెరగతాండాయేగనీ తగ్గలా... అప్పులతోనే మారాజట్లా మీనాయన కాలం చేసి..." అని ఆపేసింది రమణమ్మ.

భర్త మరణాన్ని తలచుకున్నప్పుడంతా ఆమె గొంతు మూగ బోతుంది.

కాసేపు మౌనంగా వుండి "అందుకనే గదామ్మా... ఈ నాలుగేండ్లూ నేనూ అడగలా... మీకు తెలీదమ్మా మా ఆయన సంగతి... చూసేదానికి పైకి మెత్తగా వుంటాడుగానీ అంతా లోపల్లోపలే చేసేస్తాడు. నన్ను దినమ్మూ ఏపక తింటాండాడు అడగమని. యిప్పుడు లక్ష వచ్చింది గదా... నాకేం ఎక్కువ పెట్టద్దు. ముప్పై గ్రాముల్లో చేపీండి చాలు" అంది వేడుకోలుగా విజయ.

శారద, బాలకృష్ణ అమ్మను, అక్కను చూస్తా కూర్చోనుండారు.

"నిజమేమ్మా లక్ష రూపాయల్లో యాభైవేలు

## ఇరవైల్లో అరవై లెందుకు?

'అధిక బరువువల్ల కలిగే అనర్థాల్లో ఒకటి- డి.ఎన్.ఎ వయసు క్షీణించడం' అంటున్నారు బాగలూసా హార్ట్ స్టడీ శాస్త్రవేత్తలు.

32 సంవత్సరాలుగా వాళ్లు దీనిపై పరిశోధనలు సాగిస్తున్నారు. 1991లో వాళ్లు 49 మంది రక్తాన్ని పరీక్షించారు. మళ్లీ అదే వ్యక్తుల రక్తాన్ని 2004లో పరీక్షించారు. ఈ పరీక్షల్లో భాగంగా ఎత్తు, బరువు, రక్తంలో చక్కెర శాతం తెల్ల రక్త కణాల టీల్ మియర్ల పొడవు, క్రోమోజోముల చివరల పొడవులపై పరీక్షలు జరిపారు. అధిక బరువు కలిగినవారు ఇన్సులిన్ రెసిస్టెంట్లుగా మారటం, వాళ్లలో టీలో మియర్లు కుంచించుకు పోవటం కనుగొన్నారు. దీనివలన చిన్న వయసులోనే పెద్ద వయసు మీద బడ్డట్టు కన్పిస్తారని ధ్రువీకరించారు.




వత్తిడి, అధిక బరువు, ఇన్సులిన్ రెసిస్టెన్స్, వీటివల్ల ఫ్రీ రాడికల్స్ వృద్ధయి కణాల్ని క్షీణింపజేయడంతో టీలోమియర్ల ప్రమాణం తగ్గుతుంది. దీనివల్ల భారీకాయులు పిన్నవయసులో ఉన్నా పెద్దవాళ్లలా మారతారు. పోషక విలువలున్న ఆహారం, వ్యాయామం, మంచి జీవన విధానాల వల్ల మాత్రమే డి.ఎన్.ఎ నిత్యనూతనంగా ఉంటుంది.

అధిక బరువు ఆరోగ్యానికి అన్నివిధాలా చేటే సుమా!

ఎంగటముని బాకీకి ఒరతట్టుకున్నె. మనం ఆయప్పకు యింగా ఇరవైఎనిమిది వేలు బాకీ వుండాం. నీ పెండ్లి బాకీనే తీరలా..."

"యాభైపోతే యింగా యాభైవేలుండాది గదా... యిరవై వేలల్లో చేపీండి"

"ఎట్లమ్మే... వున్ని దుడ్డుతో నీకు నగ చేపిస్తే... యింగ ఈళ్ళిద్దర్నీ ఏం చేసేది? "

"నాకిచ్చే యిరవై వేలతో ఈళ్ళకు పెండ్లి చేసేస్తావా? మీ బాధలన్నీ తీరిపో తాయా...? " కోపంగా ప్రశ్నించింది విజయ.

"ఏందిమ్మే అట్ల మాట్లాడతావు. యిరవైవే లకు యింకొంచెం ఎగేసి బోరేయిస్తే, నీళ్ళు పడితే సేద్దిం చేస్తాం... రెండు మూడు పంటలు వస్తే బాకీలు తీరతాయి. వాళ్ళకు పెండ్లీ చేయచ్చు నీకు చైనూ చేపీయచ్చు.. వుండే దుడ్డు నీకిచ్చేస్తే మేమంతా పస్తులతో సావాల్సిందే" అంది రమణమ్మ.

"అంతేలే... నేను పరాయి దాన్నయిపో యినా... ఆడవాళ్ళ దెగ్గిర ఎన్నెన్ని తిట్లు తింటాండానో మీకేం తెలుసు... అమ్మలక్కల అడగతాండారు... ఆ మాటలు పడేదానికన్నా ఏ బాయిలోనో దుంకి సచ్చేది మేలు" అంది ఏడుస్తా విజయ.

బాలకృష్ణకు బాధ, ఆవేశం వచ్చాయి. పోనీ, యిచ్చెయ్‌మా... అందామనుకున్నాడు. యిచ్చే స్తే... తమ పరిస్థితి తలచుకోని మౌనంగా వుండిపోయాడు.

కూతురి ఏడుపు చూడగానే రమణమ్మ కండ్లలో కూడా నీళ్ళు తిరిగాయి...

ఏమీ చేయలేని నిస్సహాయ స్థితి...

"యింగో సమచ్చరం ఓపిక పట్టమ్మా... తప్పకుండా చేపిస్తాం" అంది రమణమ్మ.

చాలాసేపు ఎవ్వరూ మాట్లాడలేదు.

"బోరేయ్యకుంటే చెరుకు తోట ఎండిపో తాది. దానికే ముప్పైవేలు అయితాది. చెని గ్గింజలు ఎయ్యాల. నన్నేసాబ్‌కు, ఐదువేలి య్యాల. యాభైవేలు ఈటికే చాలేటిగా లేదు" అవసరాన్ని వివరించింది రమణమ్మ.

దోమ కుట్టిందేమో... మంచి నిద్రలో వున్న పిల్లాడు కేర్‌మంటా ఏడుపు ఎత్తుకు న్నాడు. వాడిని ఒడిలోకి తీసుకుని సముదా యిస్తాంది విజయ...

కూతుర్ని ఎలా సముదాయించాలా అని ఆలోచిస్తాంది రమణమ్మ.



ఆగస్టు నెల మొదలయ్యి మూడు వారాల వుతోంది.

తొలీగా గింజలు వేసిన వాళ్ళ వేరుశనగ మొక్కలు ఏపుగా పెరిగి పచ్చగా కళకళలాడ తాండాయి. చేతిలో సమయానికి డబ్బులేక అదును తప్పి వేసిన రమణమ్మ పొలంలో కూడా వేరుశనగ మొక్కలు పచ్చగానే వుండాయి. కాకపోతే ముందేసినవి నెలలు నిండాక పుట్టిన పిల్లల్లా వుంటే వెనకేసినవి నెలలు నిండక ముందే పుట్టిన పిల్లల్లా వుండాయి. వాటి మధ్య కందిసాల్లు అడుగె త్తుండాయి... అల్సంద, అనప, పెసలు తీగ లు ఇంకా అల్లుకోలేదు. కనుచూపు మేరంతా పచ్చగానే కన్పిస్తాంది... వెనక కురిసిన వాన లకు చెరువుల అడుగులోకి కొన్ని నీళ్ళు చేరాయి... కార్తీకం వానలు నమ్ముకుని వున్న కొద్దినీళ్ళకే చాలామంది వరి నాటారు. కొంత మంది కాయగూరలు సాగు చేశారు.

ఆకాశంలో మేఘాలు ఒకదాన్నొకటి వెంబ డిస్తా పోతుండాయి. వాటిని అనుసరించి ఎండ, నీడ ఒకటి మార్చి ఒకటి నేలమీద పర చుకుంటా ఉండాయి. పొలాల గట్లు దగ్గర కాపరులు పశువులను మేపుతాండారు. పది మంది కూలీలు తొలిక్కట్టెలతో వేరుశనగ పొలంలో కలుపు మొక్కలు తవ్వుతాండారు. వాళ్లతో పాటు రమణమ్మ, బాలకృష్ణ కూడా

తవ్వుతాండారు. పొలం గట్టు వారంటీ జెర్సీ ఆవులను శారద మేపుతూ ఉంది.

పొద్దు పడమర తిరిగింది.

"అమ్మా, నేను తోట కాడికి పోతా. మూడు గంటలకు కరెంటొస్తాది" అని చెప్పి బాలక్రిష్ణ తోట దగ్గరకు వచ్చాడు.

నెల రోజులు జ్వరం వచ్చి కోలుకున్న వాడిలా ఉంది తోట...

మడి అమ్మిన డబ్బుతో వేసిన బోరులో ఒకటిన్నర యించి నీళ్లు పడ్డాయి... దానికి కంప్రెజర్ మోటర్ బిగించారు. చెరుకు తోటకు ఆడికాడికి సరిపోతాండాయి నీళ్ళు...

ఆరు వందల అడుగుల లోతు బోరేసినా, తక్కువ నీళ్ళు పడ్డంతో, కువైట్‌కు పోవాలని ఖచ్చితంగా నిర్ణయించుకున్నాడు బాలకృష్ణ. వాళ్ళ అమ్మ దగ్గర ఆ ప్రస్తావన యింకా తేలేదు.

యింతకు ముందు వరి నాటిన దాన్ని దున్నేసి ఈసారి వేరుశనగ వేశారు. చేన్లో ఉన్నతంగా కలుపు మొక్కలు లేవు...

చెనిగి పక్కన పచ్చగా నిగనిగలాడతాండే వరి పైరును చూస్తే బాధేసింది బాలకృష్ణకు.

తాము వెంకటమునికి అమ్మిన నేలది.

వెంకటముని దగ్గరనుంచి వారానికే లక్షా పది వేలకు రాజయ్య కొన్నాడు దాన్ని.

తమకు వరికి రెండు తడులు నీళ్లివ్వమన్నా ఇవ్వలేదు రాజయ్య. యిప్పుడు ఏకంగా రెండె కరాలూ సాగు చేశాడు. అప్పుడు రెండు తడులు నీళ్ళిచ్చి వరి పంటను కాపాడిన్నా తన తండ్రి చనిపోయేవాడు కాదేమో... యింక ఎన్ననుకోని ఏం లాభంలే... మనిషి పోయినాక అనుకున్నాడు...

కరెంటింగా వచ్చినట్టు లేదు.... రాజయ్య మోటార్ నడవడం లేదు.

చెరకు తోటలో తిరగతా కొత్తగా వచ్చిండే మోసులు పెరకడం మొదలు పెట్టాడు.

"ఎవ్వరుబ్బా తోటలో..." దారిలోనించీ కేకే శాడు సహదేవనాయుడు.

"నేను చిన్నాయనా..." బదులిచ్చినాడు బాలకృష్ణ.

"ఏం చేస్తాండావప్పా..." అంటా తోట దగ్గ రకు వచ్చాడు.

బాలకృష్ణ తాను పెరికిండే మోసులను సంకలో పెట్టుకుని, తోటలోనించి బయటకు వచ్చి "ఆవులకు మోసులు పెరకతాండా చిన్నాయనా" అన్నాడు.

బాలకృష్ణ ముఖం పీక్కు పోయిండాది. కండ్లు గుంతల్లోకి పోయిండాయి. తండ్రి చని పోయాక సగానికి సగం తగ్గిపోయాడు.

"ఎందుకు బాలకృష్ణ అంత తగ్గిపోతాం డావు... అద్దంలో చూసుకున్నావా నీ మొగా న్ని... ఎంత పీక్కపోయిండాదో" అన్నాడు సహదేవనాయుడు.

ఆ మాటలకు బాలకృష్ణ సమాధానం చెప్ప కుండా మౌనంగా ఉండిపోయాడు.

"యింటికుండే మగ దిక్కు నువ్వే... ఎసనం పెట్టుకోని యిట్లయిపోతే ఎట్ల... మీ అమ్మను చూసినావా ఎట్లుందో... పరకపుల్ల మాదిరిగా అయిపోయిండాది. నువ్వు ధైర్యం గా తిరుగులాడితే కదా..." హితబోధ చేశాడు.

"ఎంత ధైర్నంగా ఉండాలనుకున్నా కావటం లేదు చిన్నాయనా... బింకంగా నవ్వుతా ఉంటాండాను గానీ, సేద్యాన్ని అప్పులను తల్చుకుంటే భయమయిపోతాది ఒగోసారి"

"అట్ల భయపడితే ఎట్ల... యిది కాదని యింగేం పని చేస్తావు...? పోనీ ఆస్తి అమ్మే సి టౌనుకు పొయ్యి యాపారం చేసుకుం టావా..."

"లేదు చిన్నాయనా... ఆస్తంతా అమ్మేసినా అప్పులకు చాలదు... అదీ లెక్కేసినా... ఇప్పు డు ఐదెకరాల్లో చెనిగి ఏసినాం. ఈ ఎకరా చెరుకు తోట ఉంది. ఇల్లుండాది. అంతా అమ్మినా మూడు లక్షలన్నా రావేమో..."

"మనూరు రోడ్డుకు దగ్గరగా ఉండింటే, నేలకు రేటుండిండు... ఆస్తి అమ్ముకోని పోవాల్సినంత యిది ఏముండాదిలే... అప్పు లోల్లు నీ యింటిమీదికొచ్చి అడగరు. గవర్న మెంటు ఆర్డరేసిండాది. కష్టపడి సేద్దిం చేసి



నిదానంగా తీర్చుకోవచ్చులే"

"ఎప్పటికి చిన్నాయనా, మాసువుల్లో శారద పెండ్లి చేద్దాం అనుకున్నాం గదా... వాళ్లు కట్నం వద్దు, పెండ్లి బాగ చేసిమ్మన్నేరు... బిడ్డను అంత హీనంగా అత్తగారింటికి పంపలేం కదా... లక్షన్నా కాదా...? "

"అవుతాది...ఎందుక్కాదూ... చెరుకు తోటలో ఎంతలేదన్నా పద్దైదు ఇర్వై గోనెల బెల్లం అయితాది. రేటు బాగుంటే నలభై యాభై వేలొస్తాది... యింగేడన్నా అంతప్పు చేస్తే పెండ్లయి పోతాదిలే... దిగులేం పెట్టుకోవద్దు" అంటా యింటికి పోవడానికి సిద్ధమయి నాడు సహదేవనాయుడు.

"నేనొగపని చేయాలనుకుంటా ఉండాను చిన్నాయనా..."

"ఏం పనిప్పా..." అంటా బాలకృష్ణ ముఖంలోకి అనుమానంగా చూశాడు.

"ఎవరికీ చెప్పలా...అమ్మగ్గూడా చెప్పలా..."

వాళ్ల నాయన చనిపోయిందానికి నష్ట పరిహారం రాలా... వీడు ఉత్తరం రాసి పెట్టి ఆత్మహత్య చేసుకోడు కదా అని భయపడ్డాడు సహదేవుడు. చెప్పడానికి బాల కృష్ణ తటపటాయిస్తా ఉంటే అతడి అను మానం యింకా ఎక్కువ బలపడతాంది.

"ఏం చేయాలనుకున్నేవు..." అడిగాడు బాలకృష్ణ ముఖంలోకి చూస్తా.

"కొయ్యేటికి పోవాలనుకుంటాండా...? "

"కొయ్యేటికా..."

"ఔను చిన్నాయనా. ఈడ రేయింప గలు మన్నులో ఎన్నేండ్లు పొర్లాడినా ఆడి కాడికే గదా... ఆడ ఐదేండ్లు ఉండేసి వస్తే అప్పులన్నీ తీరిపోతాయి. మళ్ళ బాగ బతుక్కోవచ్చు"

"నిజమే, నమ్మకస్తుడయిన ఏజెంటు దొరి కితే బాగనే ఉంటాది. కారు డ్రైవర్లకు బలే గిరాకీ అంటనే. కారు తోలడం నేర్చుకుం టావా? "

"లేదు లేదు... పీలేర్లో చదువుకునేటప్పుడు

మా క్లాస్‌మేట్ ఒగడున్నాడు శ్రీరాములు. వాడు యిప్పుడుండేది కొయ్యేట్లోనే. వాడే చెప్పింది లక్ష రూపాయల దాకా అయితా దంట. షాపులో పని. నెలకు పద్దైదు వేలు జీతం. అన్నము, రూము వాళ్లదేనంట"

"నెలకు పద్దైదు వేలా... ఈడ ఎన్ని దినాలు కష్టపడితే అంత వస్తాది? అయితే ఆ పని చెయ్యి. నీ ఫ్రెండు మంచోడేనా? "

"వాడేమో మంచోడే... వాడే వీసా పంప తానన్నేడు. వాడు చెప్తేనే పాస్‌పోర్ట్ చేపిం చినా..."

పీలేర్లో ఏజెంట్లుండ్లా వెంకట్రమణ... ఆయ న్నడిగినా... అంపతానన్నేడు..." ఉత్సా హంగా చెప్పాడు బాలకృష్ణ.

"వెంకట్రమణనా... ఫర్వాలేదులే... ముందే ఒప్పందం చేసుకో దుడ్డు కాడ. కడాన తిరగబడతాడు లేకుంటే..."

"అంతా అయింది చిన్నాయనా. వీసా డెబ్బై వేలంట. ఫ్లైట్ టిక్కెట్, మెడికల్ అంతా కలుపుకోని లక్షవుతాదంట..."

"అట్ల పోయి బాగుపడితే అంతకన్నా కావ లసింది ఏటుండాది... నువ్వు గన పోయి నిలదొక్కుకున్నావంటే మా పెద్దోన్ని గూడా అంపిచ్చేస్తా..."

"యిప్పుడు ఎట్ల పోవాల్నో అర్థం కాలా... దుడ్డు లేదు గదా చిన్నాయనా..."

"దుడ్డా... కొయ్యేటికి పోవాలంటే యాడ యినా దొరుకుతాదిలే. ముందు నువ్వు అమ్మను ఒప్పించు..."

"అందుకే చిన్నాయన్నా నీకు చెప్పింది... శివరాం చిన్నాయనకు గూడా చెప్పిండా. వీసా యింగ రెండు మూడు వారాల్లో వస్తాది. దుడ్డు ఎవర్నిన్నా అడగాల కదా... ముందే అమ్మకు చెప్తే బాగుంటాది..."

"సందేళకాడ మాట్లాడదాంలే... దుడ్డు దొర కతాది... ఆ భయమేం వద్దు... యింటికి పోతాండా పనుండాది" ధైర్యం చెప్పి వెళ్ళిపో యాడు సహదేవనాయుడు.

ఆ రాత్రి బాలకృష్ణ తోటలో నుండి వచ్చి స్నానం చేసి భోంచేయబోతుండగా శివరాం, సహదేవ నాయుడు వచ్చారు.

అన్నం గిన్నెలో పెట్టి తీసుకొచ్చి బాల కృష్ణకు యిస్తా "అన్నం తినండిబ్బా" అంది రమణమ్మ శివరాం, సహదేవనాయుడులతో.

"వద్దొదినా... యిప్పుడే తినేసి వస్తాం డాం" అన్నారిద్దరూ.

బాలకృష్ణ కుర్చీలో కూర్చుని, స్టూలు మీద గిన్నె పెట్టుకోని అన్నం తింటున్నాడు. రమ ణమ్మ గోడకు ఆనుకుని కూర్చుని టివి చూస్తా వుంది. ఎవ్వరూ మాట్లాడటం లేదు.

బాలకృష్ణ శివరాం, సహదేవనాయుడి వైపు చూసి మాట్లాడండి అన్నట్టుగా కళ్ళతో సైగ చేశాడు.

"ఒదినా... పాప పెండ్లి ఎట్ల చేయాలను కోనుండారు" అడిగాడు సహదేవనాయుడు.

రమణమ్మకు అర్థం కాలేదేమో. అయోమ యంగా చూసింది వాళ్ల వైపు.

"అదేప్పా నాకూ దిగులుగా ఉండాది. ఈ వూర్లో మా బంధుగులుండారు గానీ ఒగరూ ఉప్పురాతి సాయం చేయరు. బంధుగులు కాకపోయినా ఏదన్నా ఆపదొస్తే మీరన్నా తోడుంటాండారు. ఎట్ల చేయాలో మీరే చెప్పండి" అంది రమణమ్మ.

ఆ మాటలతో తాము చెప్పాలనుకున్న దానికి మార్గం దొరికినట్లయింది వాళ్లకు.

"బాలక్రిష్ణను కొయ్యేటికి అంపితే బాగు పడ తారొదినా" అన్నాడు సహదేవనాయుడు, అసలు విషయంలోకి వస్తా.

రమణమ్మ వూహించని విషయమది. ఒక్కసారిగా నిశ్చేష్టురాలయింది.

"ఈడ ఎన్నేండ్లు సేద్దం చేసినా యింతే గదా. వానలు పడందానికి నీళ్లు లేందానికి, పంటలు పండతాండాయా? ఒకవేళ పండినా తిండికి, వడ్డీకి సరిపోతాది గానీ అసలేమన్నా తీరతాదా. శారద పెండ్లి చెయ్యాలంటే హీన మన్నే లక్షన్నా కాదా. కొయ్యేటికి పోతే, రెండు సమచ్చరాలుంటే అప్పులన్నీ తీరిపోతాయి. మళ్లీ రెండు సమచ్చరాలుంటే... ఆ దుడ్డుతో

లక్షణంగా బతుక్కోవచ్చు" చెప్పుకు పోతు న్నాడు సహదేవనాయుడు.

"వోన్ని పంపిస్తే మేమెట్ల ఉండేది" అంది రమణమ్మ.

శారద కూడా వాళ్లు చెప్పే మాటలను ఆశ్చ ర్యంగా వింటాంది.

"మీకేం ఒదినా. కూలీలు పెట్టి సేద్దిం చేయించండి. యింగో పని చేయొచ్చు బాల కృష్ణ ఆడికిపోయి దుడ్డంపుతాడు గదా... మీరీడ అంతా కోరుకు చెప్పేసి జెర్సీ ఆవుల మేపుకుంటాన్నే చాలు" శివరాం అన్నాడు.

"మీ అన్న పాయ... నా అన్నదమ్ముల చూస్తే అట్ల... యింటికి ఉండే మగ దిక్కు ఈడొగడే. ఈన్ని గూడా కొయ్యేటికి అంపి చ్చేస్తే ఎట్లని" దిగులుగా అంది రమణమ్మ.

"ఎట్లేముందొదినా... అందరం యింట్లోనే ఉంటే అప్పులు తీరతాయా? అప్పులు తీర్చక పోతే అవమానం గదా. అసలు శారదకు పెండ్లి ఎట్ల చేస్తారు. బాలకృష్ణ అంతా మాట్లాడినాడంట... నెలకు పదైదు వేలంట జీతం. అన్నం, యిల్లు అంతా వోళ్ళదే. సమ చ్చరానికి రెండు లక్షలు. మూడు సమచ్చరా లుంటే ఆరు లక్షలు... ఉండేలకు యింగా జీతం పెరగతాది. ఐదు సమచ్చరాలు ఉండేసి వస్తే చాలు మళ్లీ కాలు మింద కాలే సుకోని కూచ్చోని తినచ్చు"

కొడుకు వైపు చూసింది రమణమ్మ. అన్నం తినేసి తలొంచుకోని కూర్చొని ఉండాడు. చాలా సేపు ఆలోచనలో పడిపోయిందామె.

"నువ్వు యింగేం ఆలోచించద్దు వొదినా... బాలకృష్ణకు యింగా పెండ్లి గూడా లేదు కదా... పెండ్లన్నా అయ్యింటే యిబ్బంది"

"బిడ్డ పెండ్లి కాలా గదా" అంది కూతురి వైపు చూస్తా.

"బిడ్డ పెండ్లికి మేమంతా లేమా! దుడ్డుంటే చాలు, బిడ్డ పెండ్లి ఎవురు లేకున్నే అయిపో తాది. ఆర్నెల్ల జీతంతో నువ్వీడ శారద పెండ్లి ఘనంగా చేయొచ్చు"

"నువ్వేమనుకోనుండావురా? " అడిగింది కొడుకును.

"అనుకునే దేముండాదిమ్మా... నాయన బతికుండగానే కొయ్యేటికి పోవాలనుకున్నే... నూతన కాల్వకు క్రికెట్ ఆడను పోతాండాను. అని చెప్పి పోయిందంతా ఆడుకోను కాదు, పాస్ పోర్ట్ గురించె... ఆట్నించి అట్నే పీలే రుకు పొయ్యేసి వచ్చినా. యింగొక సమ చ్చరం నాయన ఓపిక పట్టుకోనున్నంటే, నేను కొయ్యేటికి పోయి సంపాదించి అంపిచ్చుందు. సేద్యం గురించి బాగా తెలిసిన నాయన గూడా పాయ. రెండెకరాలు మడీ అమ్మే స్తిమి. ఎంతకాలం చేస్తే అప్పులు తీరతాయి. ఈడ ఎన్నేండ్లకు బాగు పడతాం!" ఒక్కో మాటా మెల్లగానే చెప్పినా చాలా స్పష్టంగా చెప్పాడు బాలకృష్ణ.

"బేంకుల్లో లోన్లిస్తాండారంట గదా..." అంటా ఆపేసింది.

"లోన్లా- ఎవురికిస్తాండారొదినా? ఉద్యోగ స్తులకిస్తాండారు. ట్రాక్టర్లు కొంటామంటే యిస్తాండారు. సేద్యానికి ఈలా. పాతప్పులు కట్టించుకున్నేంక, కొత్తయి ఈము పొమ్మం టా ఉండారు. ఎగవీధి చంద్రన్న అట్లే గదా... పాతప్పు కట్టేస్తే కొత్తప్పు యిస్తామ నేలకు పెండ్లాం బొట్టు, చైను కొదవపెట్టి పదివేలు కట్టినాడంట. అది కట్టినాంక నువ్వు డిఫాల్టర్వు, లేటుగా కట్టినావు. నీకు లోను యిచ్చేదానికి రూల్సు ఒప్పుకోవు అన్నే రంట. చంద్రన్నయితే లబో దిబోమని మొత్తుకుంటా వుండాడు. లోనంటే అప్పే గదా ఒదినా... లోనిచ్చినా ఏం చేస్తాం... ఈడ నీళ్లుండాల కదా. నీళ్ల లేకపోతే దుడ్డున్నే, నేలున్నే పంటబెట్టలేం కదా" అన్నాడు శివరాం.

"పంపించాలన్నా దుడ్డు కావద్దా"

"దుడ్డుదేముండాదిలే వొదినా... కొయ్యేటి కంటే యిచ్చేవాళ్ళు దండిగా ఉంటార్లే"

"యింగ నేనేం చెప్తాను... ముందే మీరంతా మాట్లాడుకోనుండారు. వానిష్టం. దేనికయినా వాడే గదా మాకు దిక్కు" అంది

రమణమ్మ.

తల్లి తన కువైట్ ప్రయాణానికి అంగీకరించడంతో ఆనందమయింది బాలకృష్ణకు.

యింతలో కరెంటు పోయింది. యిల్లంతా చీకటి అలుముకుంది.



14

అది అక్టోబర్ నెల రెండో వారం.

బాలకృష్ణకు వీసా వచ్చేసిందాది. మెడికల్ గూడా అయిపోయింది. ఫ్లైట్ టిక్కెట్ కూడా బుక్ చేసేసినారు. వారం దినాల్లో బయలు దేరాల.

పద్దన్నే లేస్తానే నేరుగా పొలం దగ్గరకు పోతాండాడు బాలకృష్ణ.

ఈ మధ్య ఎందుకో ఎంతసేపూ పొలం దగ్గరే వుండాలనిపిస్తాంది. అతనికి బహుశా ఆ వూరిని, ఆ మనుషులను, ఆ పొలాలను వదిలి వెళుతున్నందుకేమో...

ఆ రోజు రమణమ్మ కూడా వస్తాననడంతో పొద్దున్నే పొలం దగ్గరకు పోలేదు. ఒకేసారి సద్ది తాగేసి, ఆవుల తోలుకోని ముగ్గురూ బయలుదేరారు.

'వుండండిక్కో... నేనొస్తాండా..." అంది శివరాం భార్య భారతి.

ముగ్గురూ ఆగారు. చేతుల్లో వుండే పగ్గాలను ముందుకు పోవడం కోసం ఆవులు గుంజతాండాయి. ఆకాశంలో ఒక్క మబ్బుతునకా లేదు. సూర్యుడు శుభ్రంగా స్నానం చేసి వచ్చినట్టున్నాడు. తళతళలాడతాండాడు. భారతి కూడా రెండు ఆవులు తోలుకొని వచ్చి వాళ్ళతో కలిసింది.

అందరూ నడవసాగారు.

"ఏమక్కా... పద్దన్నే ముగ్గురూ ఎలబారినారే" అడిగింది భారతి.

"యింటికాడుండి ఏం చేయాల్లే... వానలు పడతాంటే చేన్లు బాగుంటాండె... పోబుద్దయితాండె... నేనయితే చేనికాడికి పోయి నెలయితాండాది. చూద్దామని పోతాండా..." అంది రమణమ్మ.

"మా చేనికాడయితే వారంటీ మటిగ్గింజలు, బెండ గింజలు నాటినాం. అయ్యి మొల్చి బాగొచ్చిన్నాయి. యిప్పుడు పూత పూస్తాండాయి... వాన పడితేగదా... పూతంతా రాలి పోతాంది... నాగ్గూడా చేనికాడికి పోబుద్దే కాదు"

"గొడ్లగ్గూడ మేత లేకుండా పోతాండాది"

"ఔనుక్కా... బాలకృష్ణ కొయ్యేటికి పోతాందేది విజయ వాళ్ళకు చెప్పినారా...?"

"చెప్పినాం భారతి..."

"వస్తాదాక్కా..."

"ఎందుకు రాదు... వస్తాది..."

"ఆపొద్దు అలిగిపోయిందంట గదా... మా ఆయన చెప్పినాడు"

"ఆడబిడ్డలు అమ్మానాయన మింద గాక పోతే యింగెవరి మీద అలగతారు...? మనోడు చెప్పేసి వచ్చినాడు. ఈడు ఎలబారే దినానికి యిద్దరూ వస్తారంట. మా అల్లుడు గూడా కొయ్యేటికి పోవాలంట. పాస్‌పోర్ట్ చేపించుకుంటాను, వీసా అంపమని చెప్పినాడు బాలకృష్ణతో"

"అదేమక్కా అట్ల... వాళ్ళకు సేద్దిం బాగుండాదంటా వుంటివే"

"సేద్దిమంటే నీళ్ళుండద్దా? నీళ్ళు లేకపోతే ఎంత ఆస్తివున్నె ఏం లాభం? పొయ్యిరానీలే రెండేండ్లు, బాగు పడతారు"

"నిజమేలే, ఈడ ఎంతకాలం చేసినా ఏం లాభంలే. పోతానే ఆడ పనిలోకి పోతా వాబ్బా" బాలకృష్ణను అడిగింది భారతి.

"అంతేగదా చిన్నమ్మ... మనం ఆడికి పోతాండేది వూరు చూసేదానికి కాదుగదా. పోతానే పనిలోకి పోతా..." నవ్వుతా చెప్పాడు బాలకృష్ణ.

"వీలు చూసుకొని నాగ్గూడా వీసా అంపీబ్బా... నేనూ వచ్చేస్తా" అంది భారతి దిగులుగా.

"నీకేం చిన్నమ్మా... నువ్వెందుకు పోయేది? " అడిగింది శారద.

"పోకపోతే ఎట్లమ్మా... మా ఆయనేమో వుత్త తిక్కమాలోకం. ఎంతసేపూ అన్న అన్న అంటాంటాడు. కష్టం చేసేదంతా ఈయన, సుఖమనుభవించేదంతా ఆయన. మీ చిన్నాయనా, నేనూ రెయింపోగులూ గొడ్డు మాదిరో కష్టపడతాండామా... వంటికి సరైన గుడ్డలే, కడుపుకు సరైన తిండిలే. ఆయనేమో యిప్పుడు అప్పులు చూపిస్తాండాడు. ఎప్పటికి తీరేది అంతంత అప్పులు... కొయ్యేటికి పోతే రెండేండ్లు అట్లు కండ్లు మూసుకుంటే అప్పులన్నీ తీరిపోతాయి" అంది భారతి.

"శివరాం ఒప్పు కుంటాడా" అంది రమణమ్మ.

"ఎందుకు ఒప్పుకుంటాడు... ఒప్పుకోడు. ఎట్లోగట్ల ఒప్పించాల. నన్ను కొయ్యేటికి అంపకపోతే పదేండ్లయినా బాకీలు తీరవు. యింగా యిద్దురు నేదర బిడ్డలుండారు. వోళ్ళ గురించి గూడా ఆలోచించాల కదా".

"నిజమేలే, మనూర్లో ఈ రెండేండ్లలోనే ఐదారుమంది ఆడోళ్ళు పోయిండాల్ల కొయ్యేటికి".

ఆడ ఆడోళ్ళను బాగా చూడరంట. చానా గలీజు పనులంతా చేపిస్తారంట. మనబ్బోడు పోతాండాడు గదా... ఆడంతా చూస్తాడు... సక్రమంగా వుంటేనే పంపీబ్బా...

"పొయ్యినారు... కొందరు చెప్పేది, ఆడ ఆడోళ్ళను బాగా చూడరంట. చానా గలీజు పనులంతా చేపిస్తారంట. మన బ్బోడు పోతాండాడు గదా... ఆడంతా చూస్తాడు... సక్రమంగా వుంటేనే పంపీబ్బా.. లేకుంటే యిలావరిగా జాబన్నా రాయి, క్యాసెట్టన్నా పట్టి పంపిచ్చు" అంది భారతి.

"పంపిస్తాలే చిన్నమ్మా..."

"పంపిస్తాడులే... నీగ్గాకపోతే యింగెవరికి పంపతాడు. ఆడికి పోతానే మంచిగా వుండే తావన చూసి వీసా పంపీ బాలకృష్ణ... ఒగూ రోళ్ళం... పద్దన్నే నిద్రలేస్తానే మొగాలు చూసుకునేటోళ్ళం... ఆ మాత్రం ఒకరికొగరం సాయం చేసుకోకపోతే ఎట్ల..." అంది రమణమ్మ, తన కొడుకు అప్పుడే కువైట్ కు పోయినట్లుగా భావిస్తా.

"మాగ్గూడా చానా అప్పుండాదంటక్కా. మా యింట్లో మొగోళ్ళు ఆడోళ్ళకు చెప్తేగదా అప్పుల గురించి. ఎంతసేపూ అన్నాదమ్ముళ్ళే గుసగులాడుకుంటా వుంటారు. అంతంత అప్పు ఎందుకయింటాది...? యిదంతా ఆయన మోసం గాకపోతే" బావమీద ఆరోపణ చేసింది భారతి.

మళ్లీ తనే చెక్కా బెల్లంతినే గదా పోయిందేది. గవర్నమెంటోడు దుడ్డీలేదే మీకు... ఎందుకు? " ప్రశ్నించింది భారతి.

భర్త మాట ఎత్తగానే రమణమ్మ మదిలో ఏ భావాలు మెదిలాయోగానీ, మౌనంగా వుండిపోయింది.

"మా నాయన సచ్చిపోయింది గుండె నిల్చి పోయంట చిన్నమ్మా., ముష్టి చెక్కా బెల్లం తిని కాదంట. ఆఫీసర్లు ఎంక్వయిరీకి వచ్చినప్పుడు మనూర్లో ఎవరో అట్ల చెప్పినారంట. ఎంత ప్రాప్తమో అంతేలే"అన్నాడు బాలకృష్ణ.

"అయ్యన్నీ ఎవురో గిట్టనోళ్ళ మాటల్లేమీ. నీకుతెల్దా... మీ మామ ఏ పొద్దన్నా గుండెల్లో నొప్పని అన్నేడా? సినిమాలు, టీవీల్లో చూస్తాండాంగదా. తొలీగా రెండు సార్లు గుండె నొప్పి వస్తాది... మూడో సారి గదా పాణం పోతాది. ఈయనకు గుండెనొప్పయితే తొలీగానే ఎట్ల పాణం పోతాది" అంది రమణమ్మ.

"అవును నిజమే గదా... ఆ మాట అడగ లేదా వోళ్ళను...? " అంది భారతి.

"అదంతా ఏం లేదుమ్మా, నేను డాక్టర్ను

అడిగి కనుక్కున్నే. గుండెనొప్పి ఎక్కువగా వస్తే ఒకసారికి గూడా పాణం పోతాదంట" అన్నాడు బాలకృష్ణ.

అతని మాటలను నమ్మలేదు ఆ యిద్దరూ.

దారి పొడవుకూ ఏవేవో మాటలు..

తమ పొలం వెళ్ళేదారి వద్ద ఆగిపోయింది భారతి. నేను యిట్ల పోతాండానుక్కా... నేను చెప్పింది..., అదే కొయ్యేటికి పొయ్యే సంగతి ఎవరికీ చెప్పద్దు" అంది.

"మేమెందుకు చెప్తామమ్మా... చెప్పంలే" అని తమ పొలం వైపు నడక సాగించారు.

దార్లో కుంట... కుంటలో కొందరు గొడ్లను, గొర్రెలను తొలి మేపతాండారు.

ఎండ చురుగ్గా వుండాది.

పొలాల్లో వేరుశనగంతా వాడుమొగం పెట్టిండాది. దారి పక్కన కరెంటు తీగల మీద కూచ్చోని శకునం పిట్ట తోక వూపు కుంటా అరస్తాండాది. టెలిఫోన్ పోల్ పైన రంధ్రం దగ్గర పాలపిట్టలు రెండు కూచ్చోని ముచ్చట్లాడుకుంటా వుండాయి. కంపచెట్ల మీద తీండ్ర తీగలు అల్లుకోనుండాయి.

పొలం వద్దకు చేరుకున్నారు తల్లీకొడుకులు.

అదును తప్పించి వెనక పడిన వానకు గింజలు వేయడంతో చెనిగి చెట్లంతా వాడు మొగం పెట్టిండాయి. యింకో వారం దినాల్లో వాన రాకపోతే ఎండిపోయేటిగా వుండాయి. కంది, అల్సంద, అనప, పెసలు చెట్లు కూడా మొగం పెట్టిండాయి.

పొలం పక్కనుండే బీడు జాగాలో ఆవు లను తోలింది శారద.

ఒకసారి చేనంతా కలతిరిగింది రమణమ్మ. చేనును చూస్తాంటే బాధగా వుండాదా మెకు. కనీసం యిత్తనం గింజలు కూడా రావే మో అనుకుంది. ఆమె ముఖంలో బాధ, భవి ష్యత్ పట్ల భయం స్పష్టంగా కనిపిస్తాం డాయి...

"ఏమ్మా అట్లుండావు" అడిగాడు బాలకృష్ణ.

"చూడరా చేనెట్లుండాదో. యింగా వారం దినాలు వాన పడకపోతే గొడ్లు తోలాల్సిందే" అంది చెనిగి చెట్లను చూపిస్తా.

"మనం ఏం చేస్తాం లేమ్మా... అందరి చేన్లూ యిట్లే వుండాయి"

"కనీసం యిత్తనం కాయలు గూడా రావేమో. ఎంతెంత ఖర్చు చేసినా యిత్తనం కాయలకు, ఎరువులకు, దున్నకాలకు, తొగడా నికి అంతా నేలపాలే గదా. ఆ దుడ్డుకు యింకొంచెం ఎగేసి మీ అక్కకు చైను చెప్పి చిన్నే పోయిండు" అంది బాధగా రమణమ్మ.

"ఎందుకమ్మా బాధపడతావు? నేను కొయ్యేటికి పోతాండేది అందుకే గదా. వానలు సక్రమంగా పడి పంటలు బాగా పండతాంటే నేనూ పోయిండను కదా"

"వానలు సక్రమంగా పడింటే మీ నాయన ఎందుకు కాలం చేసిండు. ఎప్పుడేగానీ ఒగ జబ్బున్నోడు కాదు మీనాయన... అట్లావోడూ పాయనే" భర్తను తల్చుకుని కంటతడి పెట్టింది రమణమ్మ.

"బాధపడద్దు గమ్మునుండుమ్మా. ఎప్పటిక యినా ఎవరయినా పోయ్యేవాళ్ళమే కదా. కొంచెం ఎనకా ముందుంటామంతే. ఏడిస్తే సచ్చిపోయినోళ్ళు బతికొస్తారా" ఓదార్చాడు బాలకృష్ణ.

"ఈ భూమిమీద మేకు కొట్టుకోని బతకా లనేం లేదు. అన్నీ బాగున్నింటే మీ నాయన యింగా ముప్పై నలభై ఏండ్లు బతికుండు. మీ నాయన కన్నా ముసిలోళ్ళు వుండ్లా వూర్లో... రామిరెడ్డి పెదనాయన్ను చూడు. మా నాయన కన్నా పెద్దోడంట. యింగా బతకాల్సిన మనిషి పాయనే అని బాధ"

"సరేలేమ్మా, ఎవురికి ఏది ప్రాప్తమో, అంతే ప్రాప్తమయితాది. అంతకంటే ఎక్కువ కావా లంటే మనకు ఎట్ల దొరకతాది. పోయినో ళ్ళను తల్చుకోని బాధపడేదానికన్నా, వుండే వోళ్ళం ఆరోగ్యం కాపాడుకుంటా గుండె దిటవు చేసుకోనుంటే చాలు" వేదాంత ధోర ణిలో అన్నాడు బాలకృష్ణ.

తల్లీ బిడ్డలు చెట్టు నీడకు చేరారు.

ఏమేం చెయ్యాలో, ఎవరికి ముందివ్వాలో

చర్చించుకుంటూ కూర్చున్నారు.

చూస్తాండంగానే వారం దినాలు అయిపోయాయి...

మధ్యలో ఒకరోజు అరపదును వానపడింది. ఆ వానకే కండ్లల్లో వున్న ప్రాణాన్ని నిలువెల్లా నింపుకున్నాయి పైర్లన్నీ. యింగా పదును వాన పడింటే బాగుండు అనుకున్నారు రైతులంతా.

ఆరోజు శనివారం... బాలకృష్ణ బయలుదేరాల్సిన రోజు.

ముందురోజే విజయ, ఆమె భర్త వచ్చారు. శనివారం సాయంకాలానికి యిల్లంతా బంధువులతో నిండిపోయింది. మేనమామకు చెప్పనే కూడదనుకున్నాడు. శివరాం, సహదేవ నాయుడు 'పోయి చెప్పుపో. ఎంత కాదనుకున్నా మీ అమ్మకు రక్త సంబంధం కదా. ఏదన్నా ఆపదలో ఒకసారి కాకపోయినా ఒక సారయినా ఆదుకుంటారు' అని నచ్చ చెప్పడంతో మూడు రోజుల ముందు పోయి చెప్పేసి వచ్చాడు బాలకృష్ణ. దాంతో శనివారం వాళ్ళూ యిద్దరు వచ్చారు.

పొద్దుట్నించీ యింట్లో అంతా హడావిడిగా వున్నారు. శనగపిండి కేజీ, బియ్యం రెండు పావులు వేసి మురుకుల పిండారు. వేరుశనగ గింజలు కేజీ తీసుకొచ్చి వేయించి వుప్పూకారం పెట్టారు. మైసూర్‌పాక్ చేసినారు... మామిడికాయ, నిమ్మకాయ వూరగాయలు గాజు సీసాల్లో వేసి ప్లాస్టిక్ కాగితాలు పెట్టి మూతలు బిగించారు.

యిల్లంతా సందడిగా వుంది. బంధువులంతా ఒకచోట కూడినందుకు అందరిలో ఆనందం. తమలో ఒక వ్యక్తి రెండు మూడేళ్ళు కంటికి కన్పించనంత దూరం పోతాన్నం దానికి బాధ.

బాలకృష్ణకు పొద్దుట్నించీ తీరిక లేకుండా వుంది.

పది కొబ్బరి కాయలు తీసుకొచ్చాడు.

పొద్దున్నే నిద్ర లేస్తానే తలస్నానం చేసి కొత్త గుడ్డలేసుకోని గర్నిమిట్టకు, అట్నించి అట్టే చీనేపల్లికి పోయి కొబ్బరికాయలు కొట్టుకోనొచ్చినాడు. పల్లెలో రాముల వారి గుడి వద్దా కొట్టినాడు. బాయి దగ్గరకు పోయి తండ్రి సమాధి దగ్గరా కొబ్బరికాయ కొట్టాడు. అక్కడ మాత్రం ఉద్విగ్నతకు లోనయ్యాడు.

'మళ్ళా వస్తానో రానో... ఎందుకు రాను.. ఎంతమంది పోయొస్తాండ్లా... చదువు రానోళ్ళంతా పోయొస్తాంటే... డిగ్రీదాకా చదువుకున్న నాకేం భయం... దేశంగాని దేశం... మన భాష గాదు.. మనవాళ్ళు గాదు... ఆపదొస్తే ఆదుకునే మనుషులుండరు... అక్కడ నాకేదన్నా అయితాది... ఎందుకయితాది? అయితే... అమ్మా,చెల్లి... పరిస్థితి ఏంది...? నాయన మట్టిలో కలిసిపాయ. నేనూ వుండీ లేకుండా ఐపోతే... లేదు... లేదు... నాయన సాక్షిగా... ఎన్ని కష్టాలన్నా రానీ... అన్నే వుండి సంపాదించుకోనొస్తా... అప్పులన్నీ తీరస్తా... అందర్లో మొనగాడుగా బతుకుతా..." అనుకున్నాడు బాలకృష్ణ.

ఎర్రగొండకు పోయేంత సమయం లేకపోడంతో యింట్లోనే కొబ్బరికాయ కొట్టాడు.

సాయంత్రానికి యిల్లంతా జనమే. వూర్లో వాళ్ళంతా వచ్చారు. ఏజెంట్ దగ్గర నుంచి బాలకృష్ణ కెమెరా తెచ్చాడు. రెండురీళ్ళు తెచ్చాడు. బంధువులందరితో, వూర్లో వాళ్ళతో ఫోటోలు దిగాడు. అమ్మను, అక్కా, చెల్లెలు బావతో ప్రత్యేకంగా ఒక రీలంతా తీశాడు. ఫొటోల కోసం నవ్వుతున్నా, అందరి మనసుల్లోనూ బాధ.

రాత్రి భోజనాలయ్యాక తినుబండారాలు... బట్టలు..., బ్యాగులో సర్దతాండారు. ఆడవాళ్ళు అందిస్తా వుంటే శివరాం, సహదేవనాయుడు బ్యాగులో పెడతాండారు. ప్రయాణం కోసరమనే మెడికల్ చెకప్‌కు పోయినప్పుడు బెంగుళూరు నుంచి నాలుగువందల రూపాయలు పెట్టి ఆ బ్యాగు తీసుకొచ్చాడు బాలకృష్ణ. సర్దడం అయ్యాక బ్యాగును యిద్దరు ముగ్గురు పైకెత్తి చూశారు... నలభై కేజీలకు లోపలే వుంటుందని అన్నేరు. బాలకృష్ణ పేరు,

అడ్రసు రాసి టేపుతో బ్యాగుకు అంటించారు.

అప్పటికే రాత్రి పన్నెండయింది. తెల్లవారు జామున మూడు గంటలకు టాటా సుమోలో బయలుదేరాల... ఎక్కడి వాళ్ళక్కడే పడుకుని నిద్ర పోతాండారు బంధువులంతా. సహదేవ నాయుడు, శివరాం వెళ్ళిపోయారు మూడు గంటలకు వస్తామని చెప్పి.

బాలకృష్ణ, రమణమ్మ, శారద పూజగదిలో పడుకున్నారు.

బాలకృష్ణ బలవంతంగా కళ్ళు మూసుకున్నాడు కానీ నిద్ర రావడం లేదు. ఏవేవో ఆలోచనలు, ఏవేవో రూపాలు, అమ్మా... చెల్లెలు...అక్క....డబ్బు..పొలాలు... అస్పష్టంగా కన్పించి మాయమవుతా వుండాయి. రమణమ్మ ఏడుస్తున్నట్టుంది.... వెక్కిళ్లు విన్పిస్తా వుండాయి. బాలకృష్ణ కళ్ళలో కూడా నీళ్ళు తిరిగాయి. బలవంతాన ఏడుపు ఆపుకున్నాడు.

వుదయం లేచినప్పటినుంచి నిలకడ లేకుండా తిరగడం వల్లనేమో, బాలకృష్ణను మగతనిద్ర కమ్ముకుంది. విజయ లేపడంతో మెలకువ వచ్చింది.

"టైమెంతక్కా" అన్నాడు గబుక్కున లేచి కూర్చుంటూ.

"రెండున్నరయింది. శివరాం చిన్నాయన పచ్చి లేపేసి పాయ"

వస్తున్న ఆవులింతను బలవంతంగా ఆపుకుంటూ "అంతయిందక్కా" అంటా పైకిలేచాడు బాలకృష్ణ. పక్కన చూస్తే రమణమ్మ లేదు.

"అమ్మేదక్కా" అడిగాడు విజయను.

"నీకిష్టమని ఉప్మా చేస్తాండాది... నీళ్ళు కాగిపోయినాయి... పండ్లు తోము... స్నానం చేద్దువు" అంది విజయ.

"సుమో వచ్చిందా?" అంటూ పైకి లేచినాడు.

"మూడు గంటలకు కదా... వస్తాదిలే... ఆయరవకు మీరంతా నీళ్ళు పోసుకొని రెడీగా వుండండి. మీ బావయితే నీళ్ళు పోసుకొనేసినాడు... శారద గూడా పోసుకునేసిండాది..." అంది విజయ.

"ఎంచేపులేక్కా... ఐదు నిముషాల్లో రెడీ కానా..." అంటా స్నానాల గదిలోకి పోయి బ్రష్‌కు పేస్ట్ వేసుకుని వీధిలోకి వచ్చాడు...

వీధంతా నిర్మానుష్యంగా వుంది. విమానం పోతున్న మోర్పు వినపడింది. ఉలికిపాటుగా తల పైకెత్తి చూశాడు. లైట్లు ఆరుతూ వెలుగుతూ విమానం వునికిని తెలుపుతున్నాయి. ఆగ్నేయమూల నుంచి వాయువ్యమూలకు పోతోందది. కన్పించేంతవరకు విమానాన్ని చూస్తూనే వున్నాడు. అది కనుమరుగు

## శివుడా? విష్ణువా?

ఒక ఊళ్లో శివభక్తులు, విష్ణుభక్తులు సరిసమానంగా ఉన్నారు. ఒకరి పొడ ఒకరికి గిట్టదు. అలాంటి ఊళ్లో సభ పెట్టాలని కాంగ్రెస్ నాయకత్వం నిర్ణయించింది. కానీ జనం వచ్చేది ఎలా? వాళ్లని పిలిస్తే వీళ్లు రారు.. వీళ్లని పిలిస్తే వాళ్లు రారు. ఇకనేం? దుగ్గిరాల రంగప్రవేశం చేశారు. ఏడుకొండల వెంకన్న శివుని అవతారమా? విష్ణు అవతారమా అనే అంశంపై సాయంత్రం ఫలానాచోట ఉపన్యాసం ఉందని ఊరంతా చాటింపు వేయించారు. దాంతో అటు శివభక్తులు, ఇటు విష్ణుభక్తులూ అదేంటో తెలుసుకోవాలని ఆసక్తిగా సభకు హాజరయ్యారు. జనం వచ్చాక సంస్కృతాంధ్రాలలో, అష్టాదశ పురాణాల్లో దిట్టయిన దుగ్గిరాల ఏడుకొండలవాడు విష్ణువు అంశ అనడానికి, శివుడు అంశ అనడానికి కొన్ని వందల ఆధారాల్ని పురాణాల్నించి ఉటంకించి అందరినీ ఆకట్టుకున్నారు. అంతే కాదు.. శివకేశవులిద్దరూ ఒకరేనని ఊరందరితో ఒప్పించారు. ఆ తర్వాత కాంగ్రెస్ ప్రచారాన్ని, గాంధీ సందేశాన్ని అందరికీ విన్పించారు.



కాగానే దీర్ఘంగా నిట్టూర్చాడు...

చిన్నప్పుడు విమానాన్ని ఆకాశంలో చూస్తే ఎంత ఆనందమో... మోర్పు వినపడతానే అన్నం తింటాన్నే తినడం ఆపేసి వీధిలోకొచ్చి విమానాన్ని చూసేవాళ్ళం... విమానం ఎక్కతానని ఎప్పుడూ అనుకోలేదు. స్వంత మనుషలను, స్వంత వూరిని వదిలి యింకొన్ని గంటల్లో తాను విమానం ఎక్కుతాడు... కథల్లో చెప్పినట్టు... ఏడేడు సముద్రాల కవతల దేశంలోకి పోతాడు... కాకపోతే తన కోసం అక్కడ రాజకుమారి వుండదు... కోరికలు తీర్చే మంత్రదండమూ వుండదు... తనక్కావలసింది రాజకుమారీ కాదు, మంత్రదండమూ కాదు... అప్పులు తీరేలా సంపాదన... బతుకు భద్రంగా సాగిపోయేంత సంపాదన... ఎంత కష్టమయినా భరిస్తాడు... దుడ్డు రావాలంతే...

"బాలకృష్ణా... స్నానానికి రా" పిలిచింది విజయ.

ఆలోచనల ప్రవాహానికి అడ్డుకట్టవేసి స్నానాల గదిలోకి వెళ్ళాడు. బట్టలు తీసేసి నిక్కరు మీద స్నానం చేస్తున్నాడు.

ప్రతి పని దగ్గరా... ప్రతి స్థలంలోనూ... ఆరోజెందుకో చిన్నప్పటి సంఘటనలన్నీ గుర్తుకు వస్తాండాయి బాలకృష్ణకు.

"ఈపు రుద్దతా కుచ్చో నాయనా..." అంది రమణమ్మ.

మౌనంగా గొంతుక కూర్చున్నాడు. రమణమ్మ రెండు చేతులతో గట్టిగా బాలకృష్ణ వీపు రుద్దుతోంది.

చేతుల స్పర్శ తెలుస్తోంది గానీ శబ్దం లేదు... రామచంద్ర బతికున్న రోజుల్లో ఆమె చేతులకు డజను గాజులకు తక్కువ ఎప్పుడు వున్నింది లేదు. వీపు రుద్దుతుంటే గాజుల చప్పుడు వినిపించేది. అదంతా గుర్తొచ్చి బాల కృష్ణ కళ్ళు తడిబారాయి.

కొడుక్కు వీపు రుద్దుతున్న రమణమ్మలో ఎలాంటి సంఘర్షణ జరుగుతోందోగానీ, కళ్ళ నిండకు నీళ్ళున్నాయి. చెంబుతో నీళ్ళు తీసు కుని కొడుకు వీపు మీద పోసింది. ఆ నీళ్ళతో రమణమ్మ కన్నీళ్ళూ కలిసిపోయాయి. వీపుకు సోపు కూడా రుద్దేసి వెళ్ళిపోయింది రమ ణమ్మ.

బాలకృష్ణ స్నానం చేసేసి వచ్చి కొత్త బట్టలు వేసుకున్నాడు. పూజ గదిలో కడ్డీలు వెలిగించి కొబ్బరి కాయ కొట్టాడు.

సుమో వచ్చేసింది. దాదాపు అందరూ నిద్ర నుంచి మేల్కొన్నారు.

"రెడీనాప్పా..." అంటా వచ్చినారు సహదే వనాయుడు, శివరాం.

"టెంకాయ కొడతాండాడు... టిఫిన్ తినేదే వుండేది మీరూ తినండి" అంది రమణమ్మ.

"యింత పద్దన్నే యాడ తింటం ఒదినా... బయట తినేస్తాంలే" అన్నాడు శివరాం.

"బయటా... చేసినాప్పా..." గొణుగుతున్న ట్టుగా అంది రమణమ్మ.

"బయట తింటాం లేత్తా..." అన్నాడు అల్లుడు.

మౌనంగా వుండిపోయింది రమణమ్మ. ఆమె ముఖంలో బాధ.

బాలకృష్ణ పూజ గదిలోంచి బయటకు వచ్చి "గబగబా కానీమ్మా... పెట్టు ఉప్మా...' ' అన్నాడు.

గిన్నెలో వుప్మా పెట్టుకొని, వేరుశనగపప్పు వూరిమిండి వేసుకోనొచ్చింది రమణమ్మ. గబ గబా తిన్నాడు బాలకృష్ణ. అమ్మ నడిగి యింకా కొంచెం పెట్టించుకుని తిన్నాడు. తింటున్నంతసేపూ మౌనంగా వుండిపో యాడు. నోరు తెరిస్తే కంట్లో నించి నీళ్ళు దుంకేటిగా వుండాయి. ఎంతగా బాధపడ కుండా వుందామని ప్రయత్నిస్తున్నా సాధ్యం కావడం లేదు బాలకృష్ణకు.

"ఎవురన్నా ఒగరు పోయి సుమోకు పూజ చేయిపోండి" అన్నాడు శివరాం.

"శారద పోయింది" విజయ సమాధానం చెప్పింది.

సుమో హార్న్‌కు మెలకువ వచ్చిందేమో వూర్లో వాళ్ళు ఒక్కొక్కరే రావడం మొదలు పెట్టారు. బాలకృష్ణ తినడం పూర్తయింది.

అందరికీ పోయొస్తానని చెప్పాడు బాల కృష్ణ. రమణమ్మ పాదాలకు నమస్కరిం చాడు. పోయి సుమో ఎక్కాడు. బాలకృష్ణతో పాటు ఎనిమిది మంది ఎక్కారు.

"ఏజెంటు పీలేర్లో ఎక్కుతాడా" ఎవరో అడి గారు.

"లేదున్నా... మద్రాస్‌లోనే ఏర్‌పోర్ట్ కాడ వుంటానన్నేడు"డ్రైవర్ సమాధానం యిచ్చాడు.

"పాస్‌పోర్ట్, వీసా, దుడ్డు... అన్నీ పెట్టుకు న్నేవాప్పా" సత్తార్ అడిగాడు.

"అన్నీ వుండాయిలే మామా" అన్నాడు బాలకృష్ణ.

టాటా సుమోకు చుట్టూ చేరి రకరకాల సలహాలు, సూచనలు యిస్తున్నారంతా. టాటా సుమోకు ఎదురుగా ఎవరో ఎర్రనీళ్ళు దిగదీసారు... దిష్టి టెంకాయ కొట్టారు. టాటా సుమో బయలుదేరింది. శారద ఎదురు వచ్చింది.

దాదాపు వూరువూరంతా ఆడే వుంది. టాటాసుమో లైట్లు కన్పించేంత దూరం చూస్తూనే నిల్చున్నారంతా.

అంతవరకు బిగబట్టుకున్న దుఃఖం, యిక ఆపుకోవడం సాధ్యం కాలేదు రమణమ్మకు. బోరున ఏడుస్తా కూర్చునింది.

"బిడ్డను అట్ల అంపిచ్చి, యిట్ల ఏడుస్తారా ఎవరన్నా...? ఏడిస్తే బిడ్డకు మంచిది కాదు. నవ్వుతా వుండాల" అంటున్నారెవరో.

నిజానికి రమణమ్మ ఏడ్పును ఎంతగానో అణచుకుంటా వుంది.

అణచుకునేకొద్దీ ఏడుపు ఆమెలో ఎక్కువ

అవుతావుంది.




గొడ్ల కొట్టంలో జెర్సీ ఆవు "అంబా అంబా" అంటా అరస్తాంది. నవంబర్ నెలాఖరు. చలి వణికిస్తాంది. కోళ్ళు కూతేస్తాండాయి. పాల బెల్లు కొట్టి పావుగంట దాటింది...

లేచి చేసే పనేమీ లేకపోవడంతో మెలకువ వచ్చినా ముసుగు తీయకుండా పడుకునే వుంది రమణమ్మ. తల్లిమీద చేయి వేసుకుని నిశ్చింతగా నిద్ర పోతాంది శారద.

చలికి దుప్పట్లో ముడుక్కోని పడుకోనున్నా రమణమ్మలో ఆలోచన్ల సెగలు రగులుకుంటూనే వున్నాయి.

మగదిక్కు లేని ఆ యింటిలో ఎంత ధైర్యంగా వున్నా ఒక్కోసారి రమణమ్మకు ప్రాణం బిక్కుబిక్కుమంటా వుంటుంది.

సగటు స్త్రీలలాగే ఆమె కూడా పునిస్త్రీగా పోవాలని తలపోసేది. అలానే జరుగుతుందని నమ్మేది. కానీ హఠాత్తుగా బాధ్యతలను తన నెత్తిన విదిలించి భర్త అకాల మరణం చెందడం రమణమ్మను అభద్రతలోకి నెట్టేసింది. కట్టుకున్నవాడు పోయినా, కడుపున పుట్టిన బిడ్డలను చూస్తా గమ్మున వుండలేక పోయింది. వ్యవసాయంలో కొడుక్కు చేదోడుగా వుందామనుకుని లేని వుత్సాహాన్ని తెచ్చుకుని దినచర్య మొదలు పెట్టింది. కానీ కొడుకు కూడా రంగుల కలలు కంటా కొంత కాలంలోనే కష్టాలనుంచి గట్టెక్కిస్తానని కువైట్‌కు పోయినప్పటి నుంచి ఆమెలో అభద్రతా భావం యింకా ఎక్కువయింది. పైకి మాత్రం చాలా తెగింపుగా, అసలు ఏ బాధా లేనిదానిలా వుంటోంది.

ఎప్పుడయినా ఒంటరిగా వున్నప్పుడు గతం కళ్ళ ముందు కదలాడి వర్తమానం నిరాశను మిగిల్చి భవిష్యత్ భయం కల్గించడంతో పెళ్ళి కాని కూతుర్ని తలచుకుని పైట చెంగును నోట కుక్కుకుని కండ్లనీరు పెట్టుకుంటుంది. కొడుకు కువైట్‌కు పోయినప్పటి నుంచి అలా ఎన్నిసార్లు ఏడ్చుకుందో లెక్కలేదు.

బోరింగ్ కాడికి నీళ్ళ కోసం ఒక్కొక్కరే పోతాండారు.

రమణమ్మ వరండాలో వుండే చీపురు తీసుకుని యింటిముందు కసువూడ్చడం మొదలు పెట్టింది. రోజూ కసువుతోపాటు మనసులోని బాధలనూ రాత్రి పడుకునే ముందు ఊడ్చివేస్తాంది. యింక బాధపడనే కూడదని నిర్ణయించుకుంటాంది. తెల్లవారి లేవగానే యింటి ముందు చెత్తవున్నట్టే, ఆమె మనసులో బాధలు మళ్ళీ ప్రత్యక్షమవుతాయి.

బాలకృష్ణ కువైట్‌కు పోతానే క్షేమంగా చేరినట్టు ఉత్తరం రాశాడు. నెలనెలా డబ్బు పంపుతానని, యింక ఏం దిగులు పెట్టుకోవద్దని రాశాడు. అప్పటికి నెల దాటింది బాలకృష్ణ నుంచి ఉత్తరం వచ్చి. రమణమ్మ కొడుకు దగ్గర నుంచి వచ్చే వుత్తరం కోసరం ఆశగా ఎదురుచూస్తాంది.

యింటి ముందు కసువు ఊడ్చేసింది. గొడ్ల కొట్టంలో ఊడ్చేసి గంపలో వేసుకుని దిబ్బలో కుమ్మరించేసి వచ్చింది. అప్పటికి బాగా తెల్లవారిపోయింది. రాత్రి పాత్రలన్నీ ఎత్తి స్నానాల గదిలో వేసింది. అప్పటికింకా శారద పడుకునే వుంది.

శారదను చూస్తాంటే ఒక్కోసారి రమణమ్మకు భయంగా వుంటోంది.

వయసులో వుండే ఆడపిల్ల... మగతోడు లేని యిల్లు... ఏదన్నా జరగరానిది జరిగితే... అనుకుని కూతుర్ని వదలడం లేదు. యిద్దరూ కలిసే చేసుకుంటా వుంటారు అన్ని పనులు. ముందులాగా శారదను ఒంటరిగా ఎక్కడికీ పంపడంలేదు.

సంక్రాంతి పోతానే పెళ్ళి చేయాలి... పొద్దె

క్కిందాంకా పడుకోనుంటే యిదే అలవాటయి తాది. అత్తగారింటికాడ అందరూ నన్నే అంటారు' అనుకుని కూతుర్ని లేపింది రమ ణమ్మ.

'వుండమ్మా... నిద్రొస్తాంది" అంది దుప్ప టిని నిండుకు కప్పుకుంటా శారద.

"పొద్దు పుడతాంది... యింగా వస్తాందా నిద్ర. ఆడబిడ్డ ఈ యరవదాంకా పడుకొంటే ఎట్ల... రేపు అత్తగారింటికి పోయినా యిదే గదా అలవాటయితాది. లెయ్" అంది తెచ్చి పెట్టుకున్న కోపంతో రమణమ్మ.

బద్దకంగా ఒళ్ళంతా విరుచుకుంటా లేచి కూర్చుని "పెండ్లయితే గదా అత్తగారింటికి పోయేదానికి, నేను పెళ్ళే చేసుకోను" అంటా మళ్ళీ పడుకుంది శారద.

"నీతో ఏగలేక సస్తాండే గదామ్మే నేను. ఏండ్లు ముడ్డి కిందికి వస్తాంటే నువ్వింగా చిన్నపిల్లవు అయిపోతాండావే. ఏదన్నా చెప్తే అర్థం చేసుకోవాల" విసురుగా అని పాత్రలు కడిగేదానికి వెళ్ళిపోయింది రమణమ్మ.

తన కోపాన్నంతా పాత్రలమీద చూపిస్తా బడబడా శబ్దం వచ్చేలా తోమసాగింది.

కాసేపట్లోనే శారద వచ్చిందక్కడికి.

తొట్టిలో నీళ్ళు చేత్తో తీసుకుని నోట్లో పోసు కుని పుక్కిలించి వూంచింది. చన్నీళ్ళతో ముఖం కడుక్కుని, చీర చెంగుతో తుడుచు కుంటా "నేను తోమతా లెయ్యమ్మా" అంది.

అప్పటికే రమణమ్మలో కోపమంతా ఎగిరి పోయిండాది.

"నేను తోమతాలే నువ్వు పొయ్యి నాలుగు బిందెల నీళ్ళు తేపో... ఈ పొద్దు కరెంటు పది గంటలకు యిస్తాడుగదా... చెరుకు తోటకు నీళ్ళు కట్టద్దా" అంది రమణమ్మ.

"పది గంటలకు కదా..." అంటా వంటగ దిలోకి పోయి యిత్తడి బిందె తీసుకునింది. దాంట్లో వుండే నీళ్ళను తొట్టిలో కుమ్మరించి బోరింగ్‌కాడికి పోయింది.

వుండేది యిద్దరే కావడంతో అమ్మా కూతుండ్లకు పని చానా తక్కువగా వుంది. రమణమ్మకు చేతినిండా పని లేకపోవడం మరీ ఇబ్బందిగా వుంది. భర్త కాలం చెయ్యా డం, కొడుకు కువైట్‌కు పోవడంతో కూతు రున్నా సరే, ఒంటరితనానికి లోనవుతావుంది. ఏవేవో ఆలోచనలు... దానికి తోడు పని తక్కువ కావడం... అందుకనే ఈమధ్య దాదా పు అన్ని పనులూ తనే చేసుకుంటుంది. వయసులో వున్న కూతురు ఖాళీగా వుంటే సోమరిపోతై పోతుందని భయం. అట్లని యింట్లో పనులు అన్నీ ఆమెకు అప్పగించ లేదు. అప్పటికీ ఆ చెరకు తోటలో గడ్డి పెరి కేయడం, ఆవులకు ప్రతిరోజూ స్నానం చేపిం చడం నియమంగా పెట్టుకుంది. అయినా కూ డా సమయం ఎక్కువ ఖాళీగానే వుంటాంది.

పని చేసీ చేసీ... పనిలేకుండా పోవడం.

పనిలేకుండా పోయి... పని చేయాలనుకో వడం- అనే ఒక విచిత్ర స్థితిలో వుంది రమ ణమ్మ... వంట పని పూర్తయ్యి, స్నానాలు చేసి భోంచేస్తా కూర్చున్నారు అమ్మా, కూతురు.

అప్పటికింకా తొమ్మిది గంటలు కాలేదు.

తినడం అవుతూనే యింటికి తాళం వేసు కుని, ఆవుల తోలుకుని మడి దగ్గరకు పోయారు అమ్మా కూతుండ్లు.

చెరకుతోట బాగా ఏపుగా పెరిగిండాది. రెండెకరాలలో వేసిన చెనిగి చాలావరకు ఎండిపోయిండాది. చెరకుతోట కాలవల్లో అక్కడక్కడా తోట కంది చెట్లు నిలువెత్తు పెరిగి పూతా పిందెలతో వుండాయి.

పైట చెంగుకు ముడేసుకోనుండే తాళం చెవితో స్టార్టర్ వున్న బాక్స్ తెరచింది. స్విచ్ నొక్కడంతో మోటార్ బుర్రుమనే శబ్దం వచ్చింది. ఎగువన కయ్యలో నీళ్ళు పడిన చప్పుడు వినిపించింది. నీళ్ళు కయ్య వద్దకు పోయాయి. ఆగి బుడుక్కుమంటా దుంకతాం డాయి నీళ్ళు. నీళ్ళు పడే చోట నేలంతా గుంతా వుండాది. ఆ కయ్యలో అడ్డేలుడు లోతుండాయి నీళ్ళు.

ఆవులను బీడు జాగాలో తోలి చెట్టు నీడన

కుచ్చోని, వాటిని కాపెట్టుకోనుంది శారద. రమణమ్మ కూడా వచ్చి కూతురి పక్కన కూర్చుంది.

ఎంతయితాదో బెల్లం... గానుగ ఎట్ల ఆడేది... ఎవరిది క్రషర్ తెచ్చేది... కరెంటుకు వేళాపాళా వుండదు... మగమనుషులు లేరు... ఆడోళ్ళు... యాడికని తిరుగులాడతాం... ఎంతకని పోరకలాడతాం... అనుకుంది రమణమ్మ.

"గానుగ ఎట్లాడేనో ఏమో" అంది కూతురితో మెల్లగా.

"ఏముందాడిలేమ్మా కూలోల్లను పెట్టుకుంటే ఆడించేయచ్చులే" అంది శారద, అదేమంత కష్టమయిన విషయం కాదన్నట్టుగా.

"నీకేమ్మా... సులపాగా మాటలు చెప్పేస్తాండావు... ఎంత కష్టమనుకున్నేవు..."

"ఏంది ఒదినా కష్టమంటా వుండావు" అంటూ వచ్చినాడు సహదేవనాయుడు.

"మాకు అన్నీ కష్టమే కదాబ్బా" అంది రమణమ్మ.

"మీకెందుకు ఒదినా కష్టం. కొడుకు కొయ్యేటికి పోయిండాడు. దుడ్డుంపతాడు. నాయట్లావోళ్లకు కష్టం... యిద్దరు బిడ్డలు చదువుకుంటా వుండారు"

"చదివిస్తే ఏమి? కట్నం తీసుకోవా... ఎంత ఎక్కువ చదివితే అంత ఎక్కువ కట్నం వస్తాది గదా... నీకేమన్నా ఆడబిడ్డలా పాడా...?"

"ఆడబిడ్డలే మేలొదినా... ఏదన్నా చెప్తే యింటారు. శారద పది పాసయితానే ఆపేస్తిరి... వుండిపోలా... మొగపిల్లకాయలు అట్ల కాదే... ఆడబిడ్డకు అప్పో సప్పో చేసి పెండ్లి చేసేస్తే ఒగసారితో పోతాది. మొగబిడ్డలకు అట్ట కాదే, కడంతరమూ ఖర్చు చేస్తాండాల్సిందే" అన్నాడు సహదేవనాయుడు సిగరెట్ వెలిగించుకుంటా.

"ఎవరి కష్టం వాళ్ళకు ఎక్కువ లేబ్బా. చెరుకు తోట ఎట్లాడాలో చెప్పు... నాకు యిప్పట్నించే దిగులుగా వుండాది" అంది రమణమ్మ.

"అబ్బా... ఆ కంపు కొట్టే బీడీలు, సిగరెట్లు తాగకుంటేనేం చిన్నాయనా" అంది శారద ముక్కు మూసుకుంటా.

"ఏందోలేమ్మా, అలవాటయిన పాణం. తాక్కుండా వుండలేము. పసల పండగ పోయినాంక గదా ఒదినా గానిగాడేది. యిప్పట్నించే ఎందుకు దిగులు" అన్నాడు సహదేవనాయుడు సిగరెట్ తాగుతూ...

"ఆడాడ ఎన్నిడస్తాండాది చూడు. పసల పండు కన్నా ముందే ఆడాల"

సహదేవనాయుడు తోటనంతా పరిశీలనగా చూశాడు. రెండు మూడు ఎన్నిడ్చిన చెరకులు అతని కంట్లో కూడా పడ్డాయి.

"ఈసారి మేము చెరుకెయ్యలా... శివరాం వాళ్ళేసిండారు. వాళ్ళు గానుగ ఆడేటప్పుడే మీరూ ఆడిచ్చేయండి. ఈన్నే గానుగ ఆడాలంటే కష్టం. ఈడ చెరకులంతా కొట్టుకోని ట్రాక్టర్‌లో ఏసుకోనిపోయి ఆడ ఆడేస్తే యిబ్బంది లేకుండా వుంటాది" సలహా యిచ్చాడు సహదేవనాయుడు.

"అదేదో బాగానే వుందబ్బా. శివరాంవాళ్ళు ఏమంటారో ఏమో అడగాల"

"అనేదేముండాది ఒదినా, వాళ్ళే దెగ్గరుండి ఆడిచ్చిస్తార్లే... నీకేం దిగులొద్దు" ధైర్యం చెప్పాడతను.

"బెల్లం ఎట్లుండాదిబ్బా రేటు? "

"బాగానే వుండాది ఒదినా రేటు. గోనె రెండు వేల దాకా పోతాండాదంట. యింగా రేటు పెరగతాదంతా వుండారు"

"మనకెంతగా వచ్చుబ్బా..."

"ఎకరా గదా... తోట బాగుంది... యిర్వై గోనెల పైన్నే అయితాది ఒదినా"

శారద తోటలోకి పోయి చెరుకు ఒకటి యించుకోని వచ్చింది. తలా ఒక ముక్క యిచ్చింది.

"ఏమోప్పా... ఆ గోనెలు, రేట్లు నాకంతగా తెలీదు.. అన్నీ మీరే మాట్లాడాల"

"మాట్లాడతాంలే ఒదినా, నీకా భయమేం

వద్దు. అబ్బోడు జాబు రాసినాడా? ”

“లేదింగా... పోతానే రాసిందే, మళ్ళ లే”

“రాస్తాడ్లే... క్షేమంగా చేరినా అని రాసినాడు. ఆడికి చేరిపోయినాంక మళ్ళేం బయం లే... బాలకృష్ణగన కుదురుకొన్నేడంటే మావోన్ని గూడా పంపిస్తానొదినా”

“చదువుకుంటాండ్లా చిన్నాయనా...”

‘చదువుతాండామ్మా... చదివిపించే స్తోమత మన దగ్గరుండద్దా? యిప్పుడు చదవతాండే దంతా అప్పుచేసిన దుడ్డుతోనేమ్మా... ఎంత కాలం అప్పు దొరకతాది. ఎంతకాలం వాళ్ళను చదివిపిస్తాం. అదేయిట్ల పంపిచ్చేసినామనుకో, దుడ్డు సంపాదించుకుంటే మళ్ళ వోళ్ళ బతుకు వోళ్ళు బతుక్కుంటారు”

“నిజమేలే... మేం గూడా మావోన్ని ఐదా రేండ్లకు ముందే పంపించ్చింటే బాగుండు. అప్పులు తీరిపోయిండు... ఆయనా వున్నిండు” అంది రమణమ్మ.

“సరేలే ఒదినా, దానికి మనమేం చేస్తాం, రాత ఎట్ల రాసింటే అట్లే జరగతాది. మనమనుకున్నెట్టు యాడయితాది. బాగా వుమ్మగిస్తాండాది. వానేమన్నా వడతాదేమో” అన్నాడు ఆకాశంకల్లా చూస్తా సహదేవనాయుడు.

ఆకాశంలో అక్కడక్కడా మేఘాలు కొన్ని నిశ్చలంగా కన్పిస్తాండాయి. రెండు మూడు పిల్లమబ్బులు దక్షిణం వైపు పోతాండాయి.

“వాన పడనీప్పా.. మా చెనిగి చెట్లయితే ఎండిపోతాండాయి... వాటిని పెరకాల” అంది రమణమ్మ కూడా ఆకాశంవైపు చూస్తా.

“మోడాలు దక్షిణం దిక్కు పోతాండాయి వొదినా. వుత్తరం తిక్కునుంచి దక్షిణం తిక్కు పోయినా, ఎదురెదురుగా మోడాలు నడిసినా వాన గ్యారంటీగా పడతాది... బాయికాడికి పోతాండా వొదినా పనుండాది” అంటా వెళ్ళిపోయాడు సహదేవనాయుడు.

తమ ఆవులు రాజయ్య పొలంవైపు పోతాంటే వాటిని అదిరిస్తా పరుగున అక్కడికి పోయింది శారద. రమణమ్మ ఆకాశంలోని మేఘాలనే చూస్తా వుండిపోయింది చాలాసేపు. తను చూస్తా వుండగానే మేఘాలు గుంపులు గుంపులుగా ఎగబడతాండాయి.

‘వాన వచ్చేటిగానే వుండాది’ అనుకుంటా తోటలో ఒకమూల పెట్టిండే పారను తీసుకొని ఎగువకు నీళ్ళకయ్య వద్దకు పోయింది.

పైపులోనించి బుడుక్కు బుడుక్కుమంటా ఆగి ఆగి నీళ్ళు దుంకుతావుండాయి. అలలు గట్టుదాకా విస్తరిస్తావుండాయి. నీళ్ళలో చేతిని నిలువుగా ముంచి చూసింది రమణమ్మ. మోచేతికి బెత్తెడు కిందకు వుండాయి నీళ్ళు. పైపు దగ్గర మట్టితీసి చెరకు తోటలోకి మళ్ళించింది నీళ్ళను. నీళ్ళతోపాటు నడచుకుంటూ తోటలోకి పోయింది.

ఆకు కూడా కదలడంలేదు. వాతావరణమంతా బాగా ఉక్కపోతగా వుంది. తోటకు నీళ్ళు కడుతున్న రమణమ్మ చెమటతో ముద్దయి పోయింది.




ఆవుల మేపతా వుండే శారద ఏదో సినిమాపాట మెల్లగా పాడతా వుంది.

రెండు గంటలకు కరెంటు సింగిల్ ఫేసులోకి మారింది. మరో అరగంటకంతా కయ్యలోని నీళ్ళన్నీ తోటకు పారగట్టేసింది. కాలవ నీళ్ళలో పారను కడిగి, చేతులు కడుక్కుని ముందున్నచోటే పారను పెట్టేసింది. స్విచ్ ఆఫ్‌చేసి స్టార్టర్ బాక్స్‌కు తాళం వేసింది.

“తోటంతా పారిందామ్మా” అడిగింది శారద.

“యాడ పారింది. మధ్యలో మూడు నాలుగు సార్లు కరెంటు పాయ... అరెకరా పారింటాది. మిగిలింది రాత్రికి వచ్చి పారగ

ట్టాల"

"రోజూ రాత్రుల్లో నీళ్ళు కట్టాలంటే నాకు భయంగా వుంటాదిమ్మా" అంది శారద.

యిద్దరూ చెట్టుకింద కూర్చుని వున్నారు.

"భయమెందుకమ్మా... నువ్వొగదానివే వస్తాండావా... నేనుండాను కదా"

"...."

"పోనీ ఇంటికాన్నేవుండు నువ్వు. నేనొచ్చి కట్టేసివస్తా" అంది రమణమ్మ.

"అమ్మో అసలు వుండలేను. మనం యింగొకరుకు చెప్పేద్దాంమ్మా. రాత్రుల్లో వచ్చి నీళ్ళు కట్టే బాదుండదు"

"ఆపనే చెయ్యాల... యిప్పుడంటే నువ్వున్నా తోడుండావు. పంటొస్తానే నీకు పెండ్లి చేసేస్తాం... మళ్ళ నేనొగదాన్నే కదా వుంటాను. ఒగదాన్నే సేద్దింతో పోరకలాడలేనులేమ్మా"

పెళ్ళి మాటెత్తగానే శారదలో సిగ్గు ముంచుకొచ్చింది. ఈ మధ్యలో కుప్పం అబ్బాయి రెండు మూడుసార్లు సహదేవనాయుడు యింటికి వచ్చినట్టు వచ్చి వీళ్ళను వలకరించి వెళ్ళాడు. సంక్రాంతి అయిపోతానే పెండ్లి చేసేస్తారు అనుకుంటావుంది శారద. అందుకే పెండ్లి మాటెత్తగానే సిగ్గుపడింది.

కూతురి ముఖంలో సిగ్గును చూసి సంతోషించింది రమణమ్మ. యిన్నాళ్ళు షరీఫ్ వెంటపడుతున్నాడని తెలిసి, ఎక్కడ వాడితో చెప్పా పెట్టకుండా వెళ్ళిపోతాదో అని భయపడేది. అలా వెళ్ళిపోతే 'అంత వయసు ముదిరిందాకా పెండ్లి చేయకుండా పెట్టుకోనుంటే, ఆడబిడ్డలు లేచిపోకుండా వుంటారా" అని అందరూ తమ కుటుంబాన్ని ఎగతాళి చేస్తారని దిగులు పడతా వుండేది. కుప్పం సంబంధంతో పెళ్ళి ఎప్పుడెప్పుడా అని వుండటంతో రమణమ్మకూ సంతోషంగా వుంది.

"ఆకలిగా వుండాదిమ్మా" అంది శారద.

రమణమ్మ ఆకాశంవైపు చూసింది. దట్టంగా కమ్ముకోనుండే మేఘాల్లో సూర్యుడి రూపం అస్పష్టంగా కన్పిస్తాంది.

"ఆడుండాది పొద్దు" అంటా చేత్తో చూపించింది శారద.

"వామిలో గడ్డి గూడా అయిపోతాండాది. వానొచ్చి చెనిగి పెరికితేనన్నా గొడ్లకు మేతుంటాది... గొడ్ల తోలుకోని పోదాంపా... వానొచ్చేటిగా వుండాది" అంది రమణమ్మ.

జెర్సీ ఆవుల తోలుకోని యింటికి చేరుకున్నారు అమ్మా కూతుండ్లు.

ఆ రోజు రాత్రి జోరుగా వాన కురిసింది.

వాన మొదలయిన కాసేపటికే వీధిలో ఎవరో పరిగెడతాన్నె చప్పుడయింది.

రమణమ్మ వరండాలో కొచ్చి చూసింది. వీధిలో ఎవరూ కనపట్లా. తిరిగి యింట్లోకి పోయి తలుపేసుకుంది. యిద్దరూ అన్నం తినేసి పడుకుందాం అనుకుంటున్నప్పుడు తలుపు తట్టారెవరో.

"ఎవరు...? " అంది శారద.

"నేను శారదా..." అన్నాడు శివరాం.

శారద వెళ్ళి తలుపు తీసింది. శివరాంతో పాటు చల్లటి గాలి లోపలికి వచ్చింది.

అప్పుడే స్నానం చేసి వచ్చినట్టున్నాడు.

"అబ్బబ్బా.. మా అన్న బళే చాదస్తం మనిషయిపోతాండాడొదినా... యింగా వారం దినాలు వామి తీసేది వద్దులే అంటి. యినలా... ఈ పొద్దే తీసినారా. సందేళ యింటికొస్తా వామిని బాగా కప్పి రావాల్నా లేదా... నేను పీలేరుకు పోయిన్నె... యింటికొస్తానే పరిగెత్తాపోయి బండమింద వామిని బాగా కప్పేసి వస్తాండా..." అన్నాడు కుర్చీలో కూర్చుంటా.

"తడిసినట్టే లేవు గదా చిన్నాయనా..."

"తడసలేదా... ముద్ద ముద్దయి పోయినామ్మా... గొడుగు ఎత్తుకోని పోయినాగానీ లాభం లే. యింటికొచ్చి గుడ్డలు వేరేటియి ఏసుకోనొస్తాండా..." నవ్వతా చెప్పాడు శివరాం.

"చెనిగి వామి తడిసిందంటే ఆకూ కుళ్ళిపోతాది, కాయలూ పాడయిపోతావి. గొడ్లకు మేత లేకుండా పోతాది" అంది రమణమ్మ.

"అందుకే గదా వొదినా పరిగెత్తా పోయింది. బాలకృష్ణ జాబు రాసినాడా వొదినా" అడిగాడు శివరాం.

"లేదుబ్బా.. ఏమో రాయలేదే... యింగో నాలుగురోజులు చూసి రాద్దామనుండాం" బదులిచ్చింది రమణమ్మ.

"ఈసారి జాబు రాసినప్పుడు చెప్పండి వొదినా, నేనూ రాయాల"

"రాద్దువులే... ఏంబ్బా"

"నేను గూడా కొయ్యేటికి పోదామనుండా వొదినా..." అన్నాడు మెల్లగా.

"కొయ్యేటికా...!"

"ఔనొదినా, ఈ పొద్దు పీలేరుకు పోయి న్నింది అందుకే. ఆడ ఏజెంటుతో మాట్లా డినా. మూడువేలు దుడ్డు కట్టేసి వచ్చినా పాస్‌పోర్ట్‌కు. నెల దినాల్లో వచ్చేస్తాదంట" వివరించాడు శివరాం.

"నువ్వెందుకప్పా...ఇంత వయసులో..." అంటా ఆపేసింది రమణమ్మ.

"ఎంత వయసొదినా... నలభై ఐదో నలభై ఆరో వుంటాదంతే. పోకపోతే యింగా అప్పు లపాలయిపోతాం ఒదినా. భారతి పోతా నంటా వుండాది. ఆడమనుషుల పంపేది యిష్టం లేదు. బోర్లో నీళ్ళు తగ్గిపోతాండాయి. సేద్యం చేయాలంటే మళ్ళా బోరేయాల. బోరె య్యాలంటే ఎట్లలేదన్నా ముప్పై నలభై వేలన్నా అయితాది. అంత దుడ్డు ఏసినా మంటే నీళ్లు పడేదాంకా నమ్మకం లేదు... పన్నే వుంటాయనీ లేదు. వున్నే యింట్లో అందరూ కష్టపడితే ఆడికాడికి వస్తాదంతే గదా... అదే యింకొంచెం దుడ్డు ఎగేసుకోని కొయ్యేటికి పోయ్యినామనుకో... ఆడ సంపా దన నికరం గదా, అందుకని పోదామనుకున్నే ఒదినా" అన్నాడు శివరాం.

రమణమ్మ మౌనంగా వుండిపోయింది. తిరిగి శివరాం మాట్లాడసాగాడు.

"నేను ఆడికి పొయ్యినాంక కావాలంటే, భారతిని గూడా పిల్లింపుకుంటా. యిద్దరి సంపాదనుంటే యింగా మేలుగదా! యిద్దరికి కలిసి నెలకు పదివేలొచ్చినా సమచ్చరానికి లక్షపైన్నే వస్తాది. ఈ సేద్యంలో లక్ష సంపా దించాలంటే ఎంత కాలం కష్టపడాల, ఎందరు కష్టపడాల... ఒగేళ కష్టపడదామన్నే నీళ్ళుం డాల గదా..."

"నిజమేబ్బా...మీ అన్నకు చెప్పినావా...?"

"చెప్పినా... సేద్యం నా ఒగన్నింటి కాదుగ దరా అని ముక్కతాండాడు... మా అన్న నా మాదిరిగా కష్టపడలేడులే... వున్నిందాంట్లో అంతా మామిడిచెట్లు నాటేద్దాం అన్నే... చెంచయ్య నాయుడు చూడు... రెండెకరాల్లో మామిడిచెట్లు నాటి ఐదేండ్లు కాలా యింగా.

## ...గారుగారికి

దుగ్గిరాల గోపాలకృష్ణయ్య ప్రభుత్వ గుమాస్తాగా ఉన్న రోజుల్లో జరిగిందీ సంఘటన. ఓ పెద్దమనిషి ప్రభుత్వానికి ఏదో విషయమై దరఖాస్తు పెట్టుకు న్నాడు. అభిజాత్యం, అహంకారంగల అతను అందులో తనపేరు వద్ద తనే 'గారు' అని గౌరవవాచకం రాసుకుని మరీ దరఖాస్తు పంపాడు.

ఆయనకు జవాబు రాస్తూ గోపాలకృ ష్ణయ్య ఫలానా '...గారుగారికి' అని రాశారు. తనను అవమానించడానికే అలా రాశాడని గ్రహించిన ఆ పెద్దమనిషి ఈ విషయం పైఅధికారికి ఫిర్యాదు చేశాడు. వెంటనే పైఅధికారి గోపాలకృష్ణయ్యను సంజాయిషీ అడిగాడు. 'ఏం చేయమం టారు? పేరు పక్కన గారు అనుంటే అదీ పేరులో భాగమే అనుకున్నాను. అంతటి పెద్దమనిషిని గౌరవించకపోతే బాగోదని ఆ గారుకి నేనో గారు తగిలిం చాను తప్పేముంది' అన్నారు గంభీ రంగా. దుగ్గిరాల చిలిపితనానికి ముసిము సిగా నవ్వుకున్న పైఅధికారి ఆ పెద్దమ నిషికి ఏదో సర్దిచెప్పి పంపేశాడు.

ఈసారి ఇరవై వేలకు అమ్మినాడు కాయలు... మామిడిచెట్లకు నీళ్ళు కట్టేదేగదా... మా వొది నయినా కట్టేస్తాదిలే" అన్నాడు వుత్సాహంగా శివరాం.

"ఎవ్వరైనా బాగుపడేదే గదా కావాల్సింది. పోయిరాండిప్పా... జాబు రాద్దాం లే బాలకృష్ణకు" అంది రమణమ్మ.

దాదాపు అరగంటపాటు మాట్లాడి వెళ్ళిపోయాడు శివరాం. అతనటు వెళ్ళ గానే అమ్మా కూతుండ్లు పడుకున్నారు. గంట సేపు జోరుగా కురిసిన వాన,



రాత్రంతా కూడా సన్న చినుకులతో నేలను పలకరిస్తానే వున్నింది.

వాన తెరిపి యిచ్చిందే గానీ, ఆకాశం మొత్తం మబ్బులు కమ్ము కునే వుంది.

అదును తప్పించి గింజలు వేసిన వాళ్ళంతా ఆ రోజే చెనిగిచెట్లు పెరకడం మొదలు పెట్టారు.

రమణమ్మ వాళ్ళది ఐదెకరాల్లో చెనిగిచెట్లు పెరకడం ఒకేరోజులో అయిపోయింది.

పెరికిన చెనిగి చెట్లంతా కొండ్రె మధ్యలో పొడవుకూ వేసిండారు. చెనిగి ఆకు కని పిస్తాందిగానీ కాయలు కన్పించ డమే లేదు. చెట్టుకు ఒకటి రెండుకు మించి లేవు. కొండ్రెల్లో వుండే చెనిగి చెట్లను చూసింది రమ ణమ్మ. ఆకాశంలో మబ్బులను చూసింది. వానొస్తుందేమో అని భయపడింది.

"నాలుగు రోజులు వాన రాగూడదు సామీ... వానొస్తే చెనిగాకు కుళ్ళిపోతాది. గొడ్లకు మేతుండదు" అనుకుంది. చేను దగ్గర

నుంచి యింటికి చేరే లోపలే వాన మొదల యింది. అప్పుడు మొదలయిన వాన మూడు రోజులపాటు ఆగకుండా కురస్తానే వున్నింది. చెరువులు నిండేంత వాన కాదు.

"యిది సావనీదు, బతకనీదు" అని వానను తిట్టుకున్నారు రైతులంతా.

రమణమ్మ వాళ్ళ చెనిగాకంతా కుళ్ళిపో యింది. గొడ్లకు మేపు లేకుండా పాయనే అని రమణమ్మ బాధపడింది. వున్న ఒకటి రెండు చెనిక్కాయలూ చాలావరకు మొలకొచ్చేశాయి. కుళ్ళిపోనూ మిగిలిన చెనిగాకునంతా ట్రాక్ట ర్‌తో తోలించి ఇంటి మీద వామి ఏపించారు. ఆ ఆకులోనించి చెనక్కాయలను విడిపించడా నికి రెండు వారాలు పట్టింది. ఐదెకరాలకు గాను నాలుగు బస్తాల కాయలయ్యాయి.

ఆ పంటను చూసి రమణమ్మ ఏడ్చుకు నింది...

నువ్వు పొయ్యే మంచి పనయింది స్వామీ... బతికున్నింటే ఈ ఘోరమైన పంటను చూసి ఎంతగా ఏడ్చుకోనుందువో...

నేనింగా ఎన్నాళ్లు యిట్లా బతకాల్నో... ఎప్పుడొస్తాదో నాకు చావు అనుకుంది.

శారదను చూస్తేనే బాధ... అందుకే నేను బతికుండేది. ఆ బిడ్డకు పెండ్లి చేసేస్తే చా లు... మొగబిడ్డకేంలే... పుట్టగోసి పెట్టుకోన యినా బతికిపోతాడు అనుకుంది రమణమ్మ.

బాలకృష్ణ దగ్గర నుంచి జాబు రాలేదు.

యింటి దగ్గర పరిస్థితులన్నీ వివరిస్తా జాబు రాసింది కొడుక్కు.

రోజులు భారంగా గడస్తాండాయి.

చెరకుతోట బాగా వుంది...

అప్పులోళ్ళు ఒక్కొక్కరే వచ్చి అడగడం మొదలుపెట్టినారు...

జెర్సీ ఆవు ఒకటి రెండు రోజుల్లో ఈనేటిగా వుండాది...

దబదబామని ఎవరో తలుపు తట్టడంతో ఉలికిపాటుగా లేచింది రమణమ్మ. శారద కూడా లేచి కూర్చుంది.

"వొదినా... వొదినా" అరస్తానే తలుపు తడతావుండాడు శివరాం

ఏదో జరిగిందనుకుంటా గబగబా పోయి తలుపుతీసింది రమణమ్మ. యింకా పూర్తిగా తెల్లవారలా...

"మీ తోటనంతా చంద్రారెడ్డి కొట్టుకోని ఎళ్ళి పోతాండాడు వొదినా" అన్నాడు శివరాం గబ గబా...

అప్పుడే నిద్ర లేచి వచ్చిన రమణమ్మకు శివరాం చెప్పేది అర్థంకాలా.

"చెరుకుతోటంతా కొట్టేసి, చెరుకులు చంద్రా రెడ్డి ఏసుకోని పోతాండాడు" మళ్లీ చెప్పాడు శివరాం.

విషయం అర్థమవుతూనే ఒక్కసారిగా తన కాళ్ళకింది భూమంతా కుంగిపోతాన్నెట్టుగా అనిపించింది రమణమ్మకు. రెండు క్షణాల్లోనే తేరుకున్న ఆమె సంధించి వదలిన బాణంలా తోట దగ్గరకు పరుగు మొదలుపెట్టింది.

యింటికి తాళం వేయడం కూడా మరచి పోయి శారద కూడా అమ్మను అనుసరిం చింది. వాళ్ళతోపాటు శివరాం కూడా పరిగె డుతున్నాడు. వీళ్ళ పరుగులు చూసి ఏదో అయ్యిందనుకుని పల్లెలో వాళ్ళు ఐదారుమంది పరిగెత్తా వుండారు.

"సంతకు కూరగాయలు కోద్దామని బాయి కాడికి పోతాన్నే ఒదినా... మీ తోటకళ్ళా చూస్తే ట్రాక్టరు, మనుషులు కనిపించినారు. అనుమానం వచ్చి ఆడికిపోతే ఏముండాది, చంద్రారెడ్డి దగ్గరుండి చెరుకుతోటంతా కొట్టిం చేసినాడు. ఏందప్పా ఈ అన్యాయం అంటే. నాకు వోళ్ళు బాకీ వుండారు... మూడేండ్లయి తాండాది. ఈలా... అన్నేడు... వాళ్ళ కొడుకు కొయ్యేటికి పోయినాడు... యిస్తార్లే అన్నే... నా మాట యినిపించుకోలా..." శివరాం పరు గులు తీస్తానే చెప్తావుండాడు...

కానీ రమణమ్మ చెవిలో అవేమీ పడటం లేదు.

ఆమె కండ్ల ముందర తోట కనిపిస్తాంది... పెండ్లికాని కూతురు కనిపిస్తాంది...

వీళ్ళంతా తోట దగ్గరకు వెళ్ళేసరికి చంద్రా

రెడ్డి, అతని మనుషులూ లేరు... చెరుకులూ లేవు. తెగిపడిన చెరుకాకు మాత్రమే వుంది.

తోటనాస్థితిలో చూడగానే రమణమ్మ గుండె నీళ్ళయిపోయింది.

గుండెలు బాదుకుంటా నేలమీద పడి విలపించసాగింది.

అమ్మతోపాటు శారద కూడా ఏడుస్తూ కూర్చుంది.

అక్కడికి వచ్చిన వాళ్ళకు అమ్మా కూతుండ్లను ఓదార్చే దానికి మాటలు పెగల్లేదు.


16

"ప్రియమయిన అమ్మకు, మీ కొడుకు బాలకృష్ణ రాయునది.

నేను క్షేమం. మీరంతా క్షేమంగా వుండాలని ఆ భగవంతుని ప్రార్థిస్తున్నాను.

నా జాబు కోసం మీరంతా ఎంతో ఆశగా ఎదురుచూస్తాంటారని నాకు తెలుసు. నేనిక్కడికి వచ్చి రెండు నెలలవుతాంది. ఈడికి చేరతానే మీకు జాబు రాసినా, నెల తర్వాత జాబూ రాస్తాను. దుడ్డూ అంపతాను అన్నేను. నేను రాసే జాబు ఎంత ముఖ్యమో, పంపే దుడ్డూ మీకు అంతే ముఖ్యం అనే సంగతి నాకు తెలుసు. అయినా జాబు రాయలేకపోయాను. నిజానికి మీకు యిప్పుడు కూడా జాబు రాయకూడదనే అనుకున్నాను. నేను జాబు రాయకుండాపోతే నేనేమయ్యానో అనే బాధతో పాటు, దుడ్డు పంపుతాననే ఆశా పెంచుకుంటానే వుంటారు. కానీ యిక్కడి పరిస్థితి అట్లలేదు. యిక్కడి పరిస్థితిని వివరించడం నా కనీస బాధ్యత... యిక్కడి విషయాలను మీకు తెలిపితే నాకు సగం గుండె భారం దిగిపోతాది.

మనం మోసపోయినాముమ్మా... మనం చాలా గుడ్డిగా మోసపోయినాముమ్మా...

యిక్కడికి వచ్చేదాకా నాకా సంగతి తెలీదు. తెలుసుకున్నేంక యింగేం చేస్తాను... యిక్కడ్నించి ఎనికంటీనే యిండియా రాలేను కదా...

నాకు యిచ్చిండే వీసా షాపులో పనికి కాదంటమ్మా... టూరిస్ట్ వీసా అంట. అంటే మనం బయటవూర్లు చూసేదానికి పోతామే, అట్ల కొయ్యేటిని చూసేదానికి యిచ్చిందే వీసా యిది.

ఈడ ఫ్లైట్ దిగతానే ఏజెంట్ కోసరం రెండు మూడు గంటలు చూసినా. రాలా... పీలేరు ఏజెంటు యిచ్చిందే ఫోన్ నెంబర్‌కు చేసినా... ఆ నెంబర్ పనిచెయ్యలా... నాకయితే భయం పట్టుకున్నది... నా దగ్గర మా ఫ్రెండు శ్రీరాములు అడ్రసు వున్నింది. నేరుగా వోని దెగ్గిరికి పోయినా. ఎట్లనో ఆపొద్దు వాడు యింటికాన్నే వున్నేడు. వానిదెగ్గిరికి పోతానే మీకు జాబు రాసినా క్షేమంగా చేరినా అని. మరసటి దినం మేమిద్దరం కొయ్యేటిలో ఏజెంటు అడ్రసు ఎతుక్కుంటా పోయినాం. ఆ డోర్ నెంబర్ అంతా సరిగానే వుండాది. ఏజెంటు మాత్రం ఆడ లేడు.

శ్రీరాములుకు తెలిసిన వేరే ఏజెంటుకు చూపించినాడు. ఆయన చెప్పినాడు యిది టూరిస్టు వీసా అని.

లక్ష రూపాయలు వూరికే వోని నోటికాడ ఏసినాము.

నాకయితే మోసపోయినామని తెలస్తానే సచ్చిపోవాలనిపించింది. శ్రీరాములు రూములో ఏడస్తా కూచ్చొన్నే... మనకాడ ఎంతెంత అప్పులుండాయో, ఎవరెవరు ఎన్నెన్ని మాటలంటా వుండారో నాకు తెలుసు. నాయన సచ్చిపోయింది ఎందుకో తెలుసు... శారద పెండ్లి చేయాల... అన్న దుడ్డుంపతాడు, నా పెండ్లయితాది అని ఆశగా వుంటాది. అయ్యన్నీ తల్చుకుంటే ఏడ్పు ఆగలా...

ఎంతగా ఏడ్చినానో ఎంతసేపు ఏడ్చినానో నాకే తెలీదు.

శ్రీరాములు ధైర్యం చెప్పినాడు. వీసాలో నలభైరోజులు టైముందంట నాకు. నలభైరోజులు కొయ్యేట్లో యాడయినా తిరగచ్చు నల భైరోజులు దాటితే మళ్ళీ తిరిగేదానికి లేదు. మళ్ళ బయట తిరిగితే పోలీసోళ్ళు పట్టక పోయి జైళ్ళో ఏసేస్తారు. ఈ నలభై దినాల్లో యాన్నో ఒగతావన చూద్దాంలే వుద్యోగం, దిగులుపడద్దు అన్నేడు వోడు. దాంతో కొంచెం ధైర్యం వచ్చింది. వాడు గూడా ముందున్నె వుద్యోగం వదిలేసినాడు. యింగో దాని కోసరం తిరగతాండాడు.

నా దగ్గర రెండు నూర్లున్నింది అంతే... ఈడ అన్నీ రేట్లు ఎక్కువ వుండేదానికి వోని రూముండాలి. తిండికి గూడా వాన్నే అడిగితే ఏం బాగుంటాది. మనపక్క మాదిరిగా యిక్కడ ఏదన్నా కూలిపనులు వుండవారా అన్నే ఒకరోజు. వుంటాయన్నేడు. యిక్కడ గూడా యిండ్ల పనులుండాయిమ్మా... ఒగర కంగా చెప్పాలంటే మన తిక్కు మేస్త్రీలకు కలవ అందిస్తాంటారే అట్ల పనులనుకో... అయ్యి గూడా దినమ్మా వుండవు. వున్నా రోజు చేసుకుంటా నా తిండికి నేను సంపా దించుకుంటావున్నే. నలభై దినాలు అయి పాయ. నా వీసా టైమూ అయిపోయింది. నాకేడా వుద్యోగం దొరకలా. వోనికి వుద్యోగం దొరికింది. బయటపోతే మూడు నాలుగు దినాలకు ఒగదినం వస్తాండాడు. అన్నిది నాలు నేను యింట్లోనే వుండాల... బయట తిరిగితే జైలే... చేతిలో దుడ్లులే... కడుపు నిండా తిండిలేదు. ఈడ నా బాధ ఆ పగో నికి కూడా వద్దమ్మా...

రూములో ఒగన్నే వుంటానా... పొద్దునూ కులూ సచ్చిపోవాలనిపిస్తాది... రెండు మూడు తూర్లు సచ్చిపోవాలని చూసినా... ఈడ నేను సచ్చిపోతే... ఆడ మీరు దిక్కులే నేళ్ళు అయిపోతారే అని గమ్మునుండి పోయినా...

నేను అనుకున్నెట్టు అన్నీ సక్రమంగా జరి గింటే మన బతుకు బాగుపడుండేది... అట్ల జరగలా... అప్పుడు నువ్వు చెప్పినట్టు యిని బోరేసింటే బాగుండని యిప్పుడనిపిస్తాంది. బోరేసింటే... నీళ్ళు పడింటే..., సేద్యం చేసు కోని అప్పులు తీర్చుకోనుందుము... యిప్పుడు ఎంతప్పు అయిపోయినామో... అది అయిదు రూపాయల వడ్డీ. ఎప్పటికి తీరుస్తాం అప్పు లన్నీ. తల్చుకుంటాంటేనే బతుకుమింద ఆశ పోతాండాది.

పాపం... శారద... నా మింద ఎన్ని ఆశలు పెట్టుకోనుందో... ఆట్నించి వచ్చేట ప్పుడు చెప్పేసి వచ్చినా 'నేను పోతానే దుడ్డం పిస్తాను. నా కోసరం ఎదురుచూడద్దు... పెండ్లి చేసేసుకో... పెండ్లయినాక ఫోటోలు పంపించు... నీకేమి కావాలన్నే నన్నడుగు' అన్ని చెప్పిన్నే...

శారద నా మాటలు నమ్మే... నేను దుడ్డం పతానని... తొందర్లోనే పెండ్లయిపోతాదని కలలు కంటాంది.

ఏం చేసేదమ్మా... నీ అన్న మోసపోయి నాడు... తిండికి గూడా లేక పస్తులుంటా వుంటాడు... పోలీసులకు కనిపిస్తే పట్టక పోయి జైళ్ళో ఏస్తారని దొంగదొంగగా తిర గతా వుండాను... నా బతుకు యింత ఘోర మైపోతాదని నేనెప్పుడూ అనుకోలేదు... ఆ సేద్యాన్ని నమ్ముకోని వున్నే యింత యిబ్బంది వున్నిండదు...

యింగో సంగతమ్మా... భారతి చిన్నమ్మ కొయ్యేటికి రావాలంటాన్నింది కదా... వద్దని చెప్పమ్మా... ఈడ ఆడోళ్ళ పరిస్థితి ఎంత ఘోరమంటే అంత ఘోరం... నేను చెప్పగూ డని మాటలు... అయినా చెప్పక తప్పడం లేదు... ఈడికి వచ్చినాంక కుక్కబతకే అను కోమ్మా... అంతకన్నా విడమర్చి చెప్పలేను...

నాయన బతికున్నింటే బాగున్నిండుమ్మా... నాకింత బాధున్నిండదు... ఈడ నేనేమయి పోయినా అడిగేవాళ్ళున్నిండరు. యిప్పుడు నేను ఖచ్చితంగా మీ కోసరం బతకాల...

వూర్లో మన కుటుంబం పరువు నిలిపేదాని కోసరం బతకాల... అందుకే ఈడ ఎన్ని బాధలున్నే భరిస్తా వుండేది.

శ్రీరాములు చూస్తా వుండాడు, నాకు వుద్యోగం కోసరం... షాపులో అనే కాదమ్మా... గొర్లు మేపే పనున్నా చూడరా... ముందుగా ఈడ నిలదొక్కుకుంటే మళ్ళీ యింకో మంచి వుద్యోగం చూసుకుందాం అన్నేను. గొర్లు మేపే పని దొరికితే యింటికి ఎక్కువ అంపలేను. నిదానంగా మంచి వుద్యోగం చూసుకుంటాను. నేను దుడ్డు సంపాదించే దాంకా ఈట్నించి రానమ్మా...

ఒగేళ... నాకు ఉద్యోగం, అకామా దొరక్క ముందే నేను గనక పోలీసోళ్ళకు చిక్కితే... అంతే మళ్ళీ... నన్ను మరిచిపోండి...

పోలీసోళ్ళకు చిక్కితే... యిట్ల మోసపోయినా, నాది ఫలానా వూరు అంటే, కొన్నాళ్ళు జైళ్ళో ఏసినాంక - ఫ్లైట్ ఎక్కించేస్తారు యిండియాకు. చేతిలో దుడ్డు లేకుండా యిండియా రావడం నాకు యిష్టం లేదు. అందుకని పోలీసోళ్ళకు చిక్కితే యిండియా అడ్రసు చెప్పను... వాళ్ళు నన్ను ఏమన్నా చేసుకోనీ...

నాకయితే మనూరు రావాలని, అందరితో మాట్లాడాలని, చేన్లంటీ, కయ్యలింటీ తిరగాలనీ వుండాదిమ్మా...నాకా ప్రాప్తం వుందో లేదో...

మీరంతా గుర్తొస్తాంటారుమ్మా... గుర్తొచ్చినప్పుడంతా మీ ఫొటోలు చూస్తాంటాను.. ఆడ సహదేవ చిన్నాయన, శివరాం చిన్నాయన ఎట్లుండారు... విజయక్క, బావ వచ్చిన్నేరా... చెనిక్కాయలు ఎన్నయినాయి... చెరుకుతోట ఎట్లుంది... ఆవు ఈనిందా... ఏం దూడ... వాన పడిందా... బోరులో నీళ్ళు అట్లే వుండాయా...

అన్ని సంగతులతో జాబు రాయండమ్మా. నాకయితే మీ అందరి మాటలు వినాలనుండాది. అందరూ మాట్లాడి క్యాసెట్ పట్టి పంపించండి. అన్నీ అనుకూలిస్తే ఈసారి నా దగ్గరనుంచీ మీకు జాబు వస్తాది. లేకుంటే రాదు.. యిదే కడా అనుకోండి.

నన్ను క్షమించమ్మా...

నన్ను క్షమించు శారదా...

ఇట్లు

మీ బాలకృష్ణ"

ఆ వుత్తరాన్ని అప్పటికి నాలుగోసారి చదివింది రమణమ్మ.

బాలకృష్ణ దగ్గరనుంచి ఆరోజే వచ్చింది.

మొదటిసారి వుత్తరాన్ని చదవగానే వల వలా ఏడ్చేసింది. ఎట్లుండాడో ఏమో అని బాధపడింది. వుత్తరాన్ని చదువుతా వుంటే కొడుకు తనతో మాట్లాడతా వున్నట్లే వుందామెకు. అందుకే మళ్ళీ మళ్ళీ చదివింది. చివరికి ఒక నిర్ణయానికొచ్చింది. ఆ నిర్ణయం తీసుకునేంతవరకు ఆమె మనసు ఆందోళనగానే వున్నింది... వెంటనే కొడుక్కు వుత్తరం రాయడం మొదలుపెట్టింది.

"నాయనా బాలకృష్ణ...

ఎట్లుండావురా... ఈడ అందరం బాగుండాం...

నీ జాబు ఈ పొద్దే చేరింది. విషయాలు తెలిసినాయి... చాలా బాధయింది.. ఎంతగా ఏడ్చుకున్నానో... నువ్వాడ అన్ని బాధలు పడతా వుండద్దురా... మనూరికి వచ్చేయి.. ఈడ బతుక్కోవచ్చు.. ఆడ నువ్వు పడే బాధలు చూసి నేను రాయడం లేదు. ఈడ పరిస్థితులన్నీ చూసి, ఆలోచించినాకే నిన్ను వచ్చేయమని రాస్తాండాను.

ఈడ ఏమేం జరిగిందో ఒగోటి యిలావరిగా రాస్తాను.

మీ నాయన అట్ల కాలం చేసె... నువ్విట్ల పోతివి... మేమిద్దరం ఆడోళ్ళమే కదా యింట్లో వుండేది.. ఒగోసారి ఎందుకో భయమేస్తాది... బాధేస్తాది... ఏడుపొస్తాది... మొండిగా బతకతాండాం.

చెనిగిలో యిత్తనం కాయలు గూడా ఎల్లలా... కడాన వాన పడింది చెనిగి చెట్లన్నీ పెరికి గడ్డనేసినాం... మళ్ళీ మూడు దినాలు పట్టుకున్నింది వాన... చెనిగాకంతా కుళ్ళిపో

యింది. గొడ్లకు మేపు లేకుండా ఐపాయ...

అసలు సంగతంతా చెరుకు తోటదే బాల కృష్ణ...

పద్దినాల ముందర చంద్రారెడ్డి వుండ్లా... మనం ఇర్వై ఐదువేలు యివ్వాల చూడు... ఆయప్ప ఒగ రేత్రి పొద్దున మన చెరుకుతో టంతా కొట్టుకోని ట్రాక్టర్లలో ఏసకపోయి నాడు... యింట్లో పడుకోనున్నేం... మొబ్బు తోనే శివరాం వచ్చి యిట్లా అని చెప్పినాడు... పరిగెత్తా పోతిమి... అప్పటికే తీసుకోని ఎళ్ళి పోయిన్నేడు... ఎంత ఏడుపొచ్చిందనుకు న్నేవు...

ఈసారి తోట బాగున్నింది. యిర్వై గోనె లకు తక్కువ కాకుండా బెల్లం అయితాదని అందరూ అంటాన్నేరు... యిప్పుడు బెల్లం రేటు గూడా బాగుండాది... గోనె రెండువేలు పోతాండాది. యింకా రేటు పెరగతాది అంటాండారంతా. చెరుకులో నలభై వేలొ స్తాది... నువ్వు అంతో ఇంతో పంపిస్తావు కదా... శారద పెండ్లి చేసేయచ్చు అనుకో నుంటి. అన్ని ఆశలు పెట్టుకోనున్న తోటను కొట్టకపోతే బాధవదా...

రెండుసార్లు యింటికొచ్చి అడిగిన్నేడు... దుడ్డు యిమ్మని.

'మా పరిస్థితి చూస్తాండావు గదప్పా... మావోడు కొయ్యేటికి పోయిండాడు. బిడ్డ పెండ్లి చేయాలనుకోనుండాం యింగో అరేడు నెల్లు ఓపికపట్టు' అన్నే... నేను చెప్పినబ్బు డంతా గమ్మున యిని, యిట్లా పనిచేస్తాడా... అప్పట్లో నువ్వునింటే గాన ఆయన్ను నరికేసిం దువేమో... నువ్వు లేందే మంచిదయింది... నాగ్గూడా అంత కోపమే వచ్చింది. ఆడ మని షిని ఏం చెయ్యలేనుగదా... అందుకే ఏడ్చు కున్నే...

వూర్లో వాళ్లు కొందరు తోడు వచ్చినారు... పోయి అడుక్కున్నే... చెరుకులు యిచ్చేయ మని... ఏడ్చినా... కాళ్ళు పట్టుకోందొగటే... అంతగా అడుక్కొన్నే ఆయప్పలో కనికరం రాలా... మన చెరుకులు ఈలా... కమ్మొరప ల్లెకు పోయి పోలీసులకు చెప్పినా... నా గోడు పట్టించుకోలా...

నాలుగు దినాలాయ...

రోజూ చంద్రారెడ్డిని అడుక్కొంటాన్నే గుణంలే...

మన చెరుకులంతా వాళ్లే గానిగాడేసి నారు... బెల్లం తయారు చేసుకున్నేరు.

ఎట్ల తెలిసిందో ఏమో... పేపరోళ్ళకు... తెలిసిపోయింది.

పేపర్లో మీ నాయన కాలం చేసిన కాన్నించీ, నువ్వు కొయ్యేటికి పోయిం డేది, శారదకు పెండ్లి కావ ల్సింది అంతా రాస కస్తా.. చెరకు తోట




చంద్రారెడ్డి కొట్టకపోయిండేది గూడా రాసినారు... పోలీసోళ్ళు పట్టించుకోలా గదా... అది గూడా రాసినారు.

అప్పుడొచ్చినారు పోలీసోళ్ళు, ఎమ్మార్వో అంతా మనూరికి.

మధ్దిస్తం చేసినారు.

పోలీసోళ్ళు కేసుపెట్టి జైళ్ళో ఏస్తామనేలకు చంద్రారెడ్డి భయపన్నేడు.

వడ్డీ గూడ వద్దు అసలు యిస్తే చాల న్నేడు. మన పరిస్థితి అంతా చెప్పుకున్నే... మా కొడుకు కొయ్యేటికి పోయిండాడు. యింగో సమచ్చరానికి బాకీ తీరస్తాం... ఈ చెరుకు ఫలసాయం మాత్రం కావాలన్నే. "పజ్జెనిమిది గోనెలు అయ్యింది. కూలీలకు, ట్రాక్టర్ బాడుగులకు రెండు గోనెలు పెట్టు కొంటా... మిగిలిందానికి దుడ్డు యిమ్మన్నే యిస్తా... బెల్లం కావాలన్నే యిస్తా' అన్నేడు చంద్రారెడ్డి. దుడ్డే యిమ్మన్నే... గోనె రెండు

వేల లెక్కల ముప్పై రెండువేలు యిస్తాన న్నేడు... నిన్ననే దుడ్డు చేతికి వచ్చిండాది.

వూర్లో అందరూ రమణమ్మ అసాధ్యురాలు, మొగోనికన్నా ఎక్కువగా పోరకలాడతాంది అంటాండారు. అవసరం వచ్చినప్పుడు పోరక లాడకపోతే ఎట్ల

ఈడ నాకొగ సంగతి అర్థమయింది బాల కృష్ణా...

పరువు పరువు అనుకుంటే బతకలేము... మీ నాయన అట్ల పరువు పరువు అనుకొనే గదా పోయింది. రెండు మూడుసార్లు పోలీస్ స్టేషన్‌కు తిరిగి, మద్దిస్తంలో ఒగసారి కుచ్చి నేలకు బాగా ధైర్నం వచ్చేసింది. తెగించినోన్ని ఎవురూ ఏం చెయ్యలేరని అర్థమయింది.

మనూర్లో ఏమయిందో తెలుసా...యిద్దురు ఐపి పెట్టిండారు... మన గొడవ అయినాం కనే... వాళ్ళలో ఒకరు సహదేవనాయుడు... అదే మేలు గదా...

సేద్యాన్ని నమ్ముకోని అప్పులపాల యినాం...ఎవరికీ దుడ్డు ఎగ్గొట్టాలని లేదు... కానీ చేతిలో అణాపైసా గూడా లేదు.

అప్పులిచ్చినోళ్ళు, ఏ పొద్దు ఎవురు యింటి మిందికొస్తారో, ఏం మాట్లాడతారో అని దినమ్మూ గిలిగిలిగానే వుంటాది. అట్ల ఎంత కాలం వుంటారు. నాకిప్పుడు అనిపిస్తాంది. 'మీ నాయన కూడా దినమ్మూ అప్పులు గురించి బాధపడి బాధపడి గుండె ఆగి కాలం చేసినాడేమో'

అదే ఐపి పెట్టేసినారనుకో... ఎవురూ యింటికొచ్చి అడిగేదుండదు... ఏమున్నే కోర్టుకు పోవల్సిందే.. తెగించినోన్ని ఎవురూ ఏం చేసుకోలేరులే...

శారద బాగుండాది... నీ జాబు చదివి ఏడస్తా పడుకునింది.

"ఏంమ్మా... పెండ్లి కాదని బాధా" అన్నేను. ఆ మాటలకు యింగా ఎక్కువ ఏడ్చింది. ఏడస్తానే చెప్పింది. "పెండ్లి కాలేదని, కావా లని ఏ పొద్దూ అనుకోలా నేను... ఆడ మా అన్న మనకోసరం పడతాండే బాధలు తల్చు కునేలకు బాధ ఎక్కువయిండాది. ఏడుపు ఆగలా... నాకేం పెండ్లవసరం లేదు. రాత వుంటే అదే అయితాది. ముందుగా అన్నను యింటికి వచ్చేయమని చెప్పమ్మా" అనింది.

విజయ రెండు వారాలముందు ఒగరోజు వచ్చి పోయింది. బాగుండారంట వాళ్ళు

ఈడ శివరాం వాళ్ళు బాగుండారు...

ఆడోళ్ల గురించి నువ్వు రాసింది చూపిం చినా... భారతి కొయ్యేటికి రాదటలే...

పీలేర్లో ఏజెంటు మీద కేసు పెడదామ న్నేడు శివరాం... లక్ష రూపాయలు వూరికే వస్తాదా... మనల్ను ఎందుకు మోసం చేయా ల... నాకు ధైర్నం వచ్చిందన్నే గదా... రేపు శివరాంను పిల్చుకోని పీలేరుకు పోతా... శివరాం రాకపోయినా నేనొగదాన్నే పోతా... నీ జాబు చూపిస్తా... సొక్కాయి పట్టుకోని నిలదీస్తా... మన దుడ్డు కక్కమంటా... దుడ్డు ఈనుగొను అన్నేడనుకో, నేరుగా పోలీస్‌స్టేషన్‌కు పోయి కేసు పెడతా...

ఎందుకీడు దుడ్డు... అదేమన్నా వానబ్బ సొత్తా...

కనీసం డెబ్బై వేలన్నా లాక్కోవచ్చు అంటాండారంతా...

ఎంతో గొంత, వాని దగ్గర్నించి దుడ్డు వసూలు చేసిందాకా నిద్రపోను...

ఈడ పోలీసులు కేసు రాసుకోలేదనుకో, నేరుగా చిత్తూరుకు పోయి ఎస్పీకి చెప్తా. అప్పుడు చెరుకుతోట కొట్టకపోయిండేది గూడా పేపర్లో వచ్చి ఎస్పీ చెబితేనే గదా... ఈడుండే పోలీసోళ్ళు పట్టించుకున్నింది. ఏజెంటు దగ్గిర్నించి దుడ్డు ఎట్లోగట్ల వసూలు చేసేస్తా... వాని దెగ్గర్నించి దుడ్డు వసూలు చేపించేదే గాదు. జైళ్ళో ఏపించాల... లేద నుకో మనట్లావోళ్లను వాడు యింగా ఎందర్ని మోసం చేస్తాడో. వాన్ని వదలనులే...

శివరాం వేరే ఏజెంటుతో మాట్లాడినాడంట, కొయ్యేటికి వచ్చేదానికి. రెండు మూడు నెలల్లో ఆడికి వస్తాడేమో...

నువ్వు మాత్రం వచ్చేసెయ్.. ఈడ బతు

క్కోవచ్చు..

నీకు వచ్చేదానికి ప్లైటు టిక్కెట్‌కు దుడ్డు ఎంతగావాల్నో రాసినావంటే,నేను పంపతా... యింగ మన బతుకు బాగుంటాది...

వర్సగా అన్నీ మంచియే జరగతాండాయి...

రెండు దినాల ముందు పడమర కొర్రె డ్డింది.

'పడమర కొర్రెడ్డితే పందిటిమింద రాజనాలు పండతాయంట' అని మీ నాయన చెప్పేటోడు. పందిటిమిందనే రాజనాలు పండితే పొలాల్లో ఎట్లపండాల. ఈ సమచ్చరం పంటలు బాగా వస్తాయిలే. నాకయితే నమ్మకంగా వుండాది.

యింట్లో ముప్పై రెండు వేలుండాది.

ఏజెంటు దెగ్గర్నించి డెబ్బై వేలు లాక్కుంటాం. లక్ష దాటతాది.

యాభై అరవై వేలల్లో శారద పెండ్లి చేసేద్దాం...నిదానంగా కావాలంటే ఇద్దరికీ గూడా ఏమన్నా చేపిద్దాంలే...మిగిలిందాంతో బోరేద్దాం.. ఈసారి నీళ్ళు బాగా పడతాయని నాకు చానా నమ్మకంగా వుండాది. నీకు మన బతుకు గురించి భయం వద్దు. అప్పులు గురించి దిగులు వద్దు. నువ్వీడికి వచ్చేయ్ అంతే...

యింత ధైర్నంగా ఎందుకు చెప్తాండానే తెలుసా...

మన జెర్సీ ఆవు ఈ పొద్దే, పద్దనే ఈనింది.

మంచి పెయి దూడ పుట్టింది. జెర్సీదే. ఆవు పలమయినప్పుడు నువ్వే గద' నూతన కాలవ గొడ్లాసుపత్రికి పోయి సూది ఏపించుకోని వచ్చింది. దూడ ఎంత బాగుందో తెలుసా...ఎంత జంపుగా, ఎత్తుగా వుందో, రెండు నెల్ల దూడ మాదిరిగా వుండాది... పుల్లరంగుది గినీ.. నష్టన తెల్ల చుక్క వుండాది. వూర్లో అందరూ అన్నేరు 'మీ యింట్లో లక్ష్మి పుట్టింది' అని.

మనకు అన్నీ మంచే జరగతాండాయి... నువ్వాడ బాధలు పడతా వుండద్దు... యింటికి వచ్చేయ్... బోరేద్దాం... నీళ్ళు పడతాయి... పంటలు పెడదాం... యింతకంటే నీకు ఎక్కువ చెప్పాల్సిన అవసరం లేదు. అంతా అర్ధమయ్యిందనుకుంటా... నీ కోసరం ఎదురు చూస్తా వుంటాం.

యిట్లు
మీ అమ్మ
రమణమ్మ"

* * *

'మొత్తం మూడు లక్షల యాభై ఎనిమిది వేలు' అని మనసులో చదువుకుని "అంతే గదా" అంది పైకి రమణమ్మ.

ఆ రోజు జనవరి ఒకటి.

పాత క్యాలెండర్‌లోని అప్పుల లెక్కలన్నీ, కొత్త పాకెట్ క్యాలెండర్‌లో రాసుకుంది. యిత్తనం వడ్లు నానేసేదానికి లేచింది రమణమ్మ. ✦



# కబురు

## వాణిశ్రీ

గుడ్‌లక్ లాడ్జీలో పొద్దుపోయేవరకు పేకాడ్డం, ఆనక రెండు పెగ్గులు విస్కీతో గొంతు తడుపుకుని ఇంటికి చేరుకోవడం పర్వతరావుకి మామూలే. రోజుకో పదివేలు పోగొట్టుకోవడం లేదా వెయ్యో, రెండువేలో గెల్చుకోవడం అతగాడికి అలవాటు.

ఆ రోజు రాత్రి లాడ్జి కారిడార్‌లో నడుస్తూ వుండగా అతడిని కొందరు అదోలా చూడ్డం, కొందరు ఏదో గుసగుసలాడ్డం, నవ్వుకోడం గమనించి చిరచిరలాడిపోయాడు పర్వతరావు. 'తను పేకాడి డబ్బు పోగొట్టుకుంటాడని అందరికీ అలుసు. ఐనా వీళ్ళ సొమ్మేం పోయింది? తన కూతురు సంపాదిస్తోంది. తను దర్జాగా ఎంజాయ్ చేస్తున్నాడు. పేకాటలో వుండే మజా వీళ్ళకేం తెలుసు? మొద్దు వెధవలు' అని తిట్టుకుంటూ కారెక్కాడు.

పర్వతరావు కూతురు వనజ వర్ధమాన తార. ఎప్పుడోగాని ఇంట్లో వుండదు. ఎప్పుడూ షూటింగ్‌లే. భార్య గూడా కూతురుతో పాటు షూటింగులకు తోడుగా వెళ్తుంది. డబ్బు లావాదేవీలు ఆమె చేతిమీదనే నడుస్తుంటాయి. పర్వతరావు ఎంత లేదన్నా నెలకు రెండు లక్షలు తగలేస్తుంటాడు. 'దీపం వున్నప్పుడే ఇల్లు చక్కపెట్టు



కోవాలనీ, అమ్మాయికి వేషాలున్నప్పుడే నాలుగు రాళ్ళు వెనకేసుకోవాలనీ, భార్య రుక్మిణి పోరుతూ వుంటుంది. కాని పర్వత రావు తన ఫాకెట్ మనీ తగ్గించుకోవడం లేదు.

పర్వతరావు స్నానం చేసి వచ్చేటప్పటికి హాల్లో పాట వినిపిస్తోంది.

# చతుర కథ

'ఏ నిమిషానికి ఏమి జరుగునో ఎవరూహించెదరూ? '

రుక్మిణి సోఫాలో కూర్చుని వుంది. ఎందుకో ఆమె ముఖం వాడిపోయివుంది. దీర్ఘాలోచనలో మునిగిపోయింది.

"రుక్కూ! ఎప్పుడొచ్చావ్? సింగపూర్‌లో షూటింగ్ అయిపోయిందా? " అని పలకరించాడు.

రుక్మిణి తల వూపింది.

"ఏమిటి సాడ్‌ఫుల్ సాంగ్ పెట్టావ్? " అన్నాడు వెగటుగా ముఖం చిట్లించి.

"అందులో ఏడుపేం వుంది? వేదాంతం వుంది" అన్నది రుక్మిణి.

"అవును గదూ! మనకి ఏడుపుకి, వేదాంతానికీ తేడా తెలీదులే" అని పక పక నవ్వాడు.

"పర్వతం..." పిలిచింది రుక్మిణి.

"వూc..." అన్నాడు పర్వతరావు.



"మీనాకుమారి, సావిత్రి, శ్రీదేవి, జయంతి... ఇంకా చాలా మంది పెళ్ళయిన వాడిని, పిల్లలున్న వాళ్ళనీ పెళ్లి చేసుకున్నారెందుకు? అసలు సినిమా స్టార్లు పెళ్ళయిన వాడిని లవ్ చేయడం ఏమిటి? " అన్నది రుక్మిణి.

పర్వతరావు సిగరెట్ వెలిగించి రింగు, రింగులుగా పొగ వదుల్తూ విలాసంగా నవ్వాడు.

"ఇందులో అంత తెలియంది ఏవుందే పిచ్చిమొఖమా? హీరోయిన్లకి ముప్ఫై ఏళ్ళొచ్చే వరకూ మంచి డిమాండ్ వుంటుంది. మంచి మంచి వేషాలు, వరదలా వచ్చిపడే డబ్బుతో కాలం గిర్రున తిరుగుతుంది. నెమ్మదిగా వేషాలు తగ్గుతాయి. తీరిక దొరుకుతుంది. పెళ్లి చేసుకుందామంటే నలభై ఏళ్ళ పెళ్ళిగాని సన్నాసి ఎక్కడ దొరుకుతాడు? అంతా పెళ్ళయిన వాళ్ళేవుంటారు. ఐనా పేరు ప్రఖ్యాతులున్న నటీమణులు ఎవడో ఒకడ్ని, అనామకుడిని పెళ్ళి చేసుకోలేరు గదా? స్టేటస్ మెయింటైన్ చేయాలంటే రెండో పెళ్ళి వాడైనా స్టేటస్ వున్నవాడిని చేసుకోవాల్సిందే" పర్వతవారు వివరణ ఇచ్చాడు.

"మరి వనజకేం వయసు వచ్చిందనీ, నిండా పాతికేళ్ళు లేవు. పెళ్ళాం పిల్లలున్న కృష్ణారావుని పెళ్ళి చేసుకుని పోయిందేం? " అన్నది రుక్మిణి.

పర్వతరావు అదిరి పడ్డాడు. నెత్తిన పిడుగు పడింది. తాగిన మత్తు దిగిపోయింది.

"ఏంటీ అమ్మాయి రెండో పెళ్ళి వాడిని చేసుకుందా? ఆ సంగతి తీరిగ్గా చెప్తున్నావా? " అని మండిపడ్డాడు.

"సడన్‌గా చెప్తే నీ గుండె ఆగిపోతుందని ఇలా చెప్పాల్సి వచ్చింది. అసలే నీకు ఒకసారి స్ట్రోక్ వచ్చిందాయెను" అంది రుక్మిణి. ✦



కాళీపట్నం రామారావు

గ్రామ వ్యవస్థా రాక్షసాన్ని కళ్లకు కట్టిన

# యజ్ఞం

జీవితానుభవం, సమాజ పరిశీలనం- ఈ రెండూ కాళీపట్నం రామారావు రచనల్లో కలగలసి ఉంటాయి. ఏ కథాంశం తీసుకున్నా చిత్తశుద్ధితో నడిపించే స్వభావం. 'పాత తరం అనుభూతులే నాకు తెలుసు. తెలియని విషయం ఎందుకు రాయాలి చెప్పండి? తెలుసుకున్నాకే మళ్లీ రాస్తా' అనేంతటి నిర్మొహమాటి. అంతటి ప్రత్యేకి కాబట్టే అప్పట్లో ఆయన కలంనుంచి జాలువారిన 'యజ్ఞం' కలకలం సృష్టించింది. తెలుగు సాహితీవనంలో నేటికీ గుబాళిస్తున్న **'యజ్ఞం'** కథ వెనుక కథను కారా మాస్టారుతో చర్చించిన శరత్‌బాబు అందజేస్తున్నారు.

## కథ వెనుక కథ

కాళీపట్నం 'యజ్ఞం' నాటి చదువరుల్నే కాదు.. రచయితల్ని అమితంగా ప్రభావితం చేసింది. స్వాతంత్ర్యం తర్వాత పల్లెల్లోని స్థితిగతుల్ని విడమరిచి చెప్పిన కథ ఇది. శ్రీకాకుళం మాండలిక విస్తరణతోపాటు గ్రామీణుల కడగండ్ల పల్లవీ విన్పిస్తుంది. శిల్పమంటారా? అతి నిరాడంబరం... నాటకీయత మాత్రం చివరివరకూ సమర్థంగా నిర్వహించారు. వీటన్నిటినీ మించింది ఆయన లోతైన అవగాహన.

సాదా తెల్లదుస్తులు, ఆకుజోళ్లు, కళ్లద్దాలు, బుగ్గన కారాకిళ్లీతో కన్పించే కాళీపట్నం రామారావు రచనల్లోనూ ఇదే నీటు, ఘాటు కన్పిస్తాయి.

### పాత్రలన్నీ మంచివే

ఈ కథలోని పాత్రలన్నీ తప్పుపట్టలేనివిగా కన్పిస్తుంటాయి. ఇందులోని చివరి మాటలు ఆయనవే. 'ధర్మ పన్నాలెంతవరకు? నువ్వే చెప్పినట్లు అంతా వినేవరకు. ఆ తర్వాత..?' ఈ వాక్యాలు చాలు రచయిత నిశిత దృష్టిని ఆవిష్కరించడానికి. తండ్రి కరణం కావడంతో, సొంత ఊళ్లోని అన్ని తరగతుల జనం సంగతీ ఈయన కూడా తెలుసుకున్నారు. వర్గ వైవిధ్యం గమనించే తత్వమూ అలవడింది. ఆ అనుభవాలు, ఆ పరిశీలనే 'యజ్ఞం' కథారచనకు పురికొల్పాయంటారు కా.రా. ఇప్పటికి నాలుగు దశాబ్దాల కిందట వెలువడిన ఈ కథతో మొత్తం రచనా జీవితమే మలుపు తిరిగింది. అట్టడుగు బతుకుల గురించిన సంవేదన ప్రతీ అక్షరంలోనూ ప్రతిఫలిస్తుంది. స్థూలదృష్టికి ఇందులో ఓ పల్లెకు చెందిన రాక్షసాన్ని అక్షరీకరించినట్లు కన్పించినా నాటి సామాజిక స్థితిగతులు కట్టెదుట నిలిపారు రచయిత.

కలానికి కొంతకాలం విరామమిచ్చారు కారా. ఆ మధ్యరోజుల్లో మానవ జీవితాల్ని మరెంతో

సాలోచనగా చూశారు. అంతేకాక - అభిమాన రచయిత రావిశాస్త్రి ప్రభావమూ ఉండనే ఉంది. బతుకుల్ని సంఘర్షణలోనుంచే చూడాలనే భావం మనసుకు విస్తరించింది. వీటన్నిటి కలబోతలతో యజ్ఞం కథను రాసి 1964తొలి అర్థభాగంలోనే పూర్తి చేశారు. ఇందులోని పాత్రలు, వాటి ఆలోచనలు, వాదనలు... అన్నిటిమీదా విభిన్న ప్రభావాల ముద్ర కన్పిస్తుంది. దీన్ని నవలగా రాయాలని అనుకున్నా చివరికి కథగానే రూపుదిద్దుకుంది. ఇది అసంకల్పితమే అంటారాయన. స్వాతంత్ర్యం తరువాత పల్లెల రీతుల్ని వెల్లడించడమే ఈ రచన అంతరార్థం. సామాజిక న్యాయం ఎలా ఉందనేది అంతటా ప్రతిఫలిస్తూ ఉంటుంది. పల్లెవాసుల భుజాన పడుతున్న అప్పుల భారాన్ని ఇందులో అంతర్లీనంగా విశ్లేషించారు.

### ఇదీ కథాంశం

సుందరపాలెంలోని సాధారణ రైతు అప్పలరాముడు. నిలకడలేని ధరల వల్ల చితికి పోయిన ప్రాణి. మరోవ్యక్తి షావుకారు గోపన్న.. వ్యాపారంలో నష్టపోయిన జీవి. వీరి నడుమ అప్పు వివాదం. పరిష్కరించాల్సిన బాధ్యత గాంధేయవాది శ్రీరాములునాయుడిపై పడుతుంది. గ్రామీణ రాజకీయ, ఆర్థిక పరిణామక్రమంలో న్యాయపరంగా ఊగిసలాట.. చివరికి ఊరి పంచాయితీ మండపానికి అప్పలరాముడు తలొగ్గుతాడు. ఉన్నదంతా అమ్మి రుణం తీర్చాలని తయారవుతాడు.



ఆ సమయంలో అతని కుమారుడు సీతారాముడు చేసినపని అందరినీ నిశ్చేష్టులను చేస్తుంది. 'బానిస బతుకు నా కొడుక్కి వద్దు' అంటూ అతగాడు చంపింది వర్గ శత్రువును కాదు.. కన్నకొడుకునే! అంటే గ్రామం లోని కొందరి రాక్షస తీర్పుకి సీతారాముడు తనకొడుకునే యజ్ఞంలో బలిపశువును చేస్తాడు. ఎందరి జడత్వాన్నో ఒక్క కలంపోటుతో కదిలించిన సందర్భమిది.

యజ్ఞం కథకి ముందు దశాబ్దంపైగా మాస్టారు ఏదీ రాయలేదు. దీన్ని మొదట్లో నవలగా చేయాలని అనుకున్నారు. తదుపరి పరిణామాల్లో అది కథగా మారింది. ఆసాంతం సొంత ముద్రే. ఎత్తుగడ, ముగింపులో కూడా మెలికలే. పాత్రల్ని ప్రవేశింపచేసే విధానంలోనూ విశేషమే. సంఘర్షణ సరేసరి. గోపన్నకి అప్పలరాముడు బాకీ అవు నా కాదా అనేదే మొత్తం ఇతివృత్తం. రచయిత ఆశించిన విప్లవం మరేదో కాదు. చదివిన తర్వాత జనంలో కలిగే ఆలోచనే!! తను చూసిన గ్రామీణ వ్యవస్థ పునాదుల్ని ఆయన ప్రదర్శించారు.. పంచాయతీ, గాంధేయవాదం, మతం, న్యాయం.. ఇలా మరెన్నింటినో స్పర్శించారు. కనుమరుగవుతున్న మానవతా విలువలను చిత్రించారు.

### విమర్శలూ తప్పలేదు

కథపైన విమర్శలూ ఉన్నాయి. క్లుప్తత

మరీ ఎక్కువైందని, విరుద్ధ వైఖరులు చూపారని, అంశాలు పెరిగి అస్పష్టత కలిగిందని. అయితే శ్రీకాకుళం ప్రాంతవాసుల జీవనవిధానం తెలిసిన వారికి రచనలో ఎక్కడా అసహజత్వం గోచరించదు.

ఒక పాత్రతో ఇలా అన్పించారు కారా. 'మాక్కావలసింది ముప్పూటలా గంజి మెతుకులు, ఇంత అంబలి, గంటి జావ, జొన్నన్నం, ఉండే కసిన్ని మజ్జిగ నీళ్లు, లేకపోతే పులుసు. దానికి నంజుడు ఉల్లిపాయ ముక్క, ఊరిబిండి ఒడియం. అవీ లేకపోతే మిరపకాయ కాల్చుకు తింటాం.' ఈ మాటల్ని చదువుతుంటే, కంటనీరు రానిదెవరికి?

చివర్లో రాసింది మనల్ని మరింత దిగ్భ్రాంతి పరుస్తుంది, ఆదేమంటే-.. పాదాలముందు దబ్‌మని ఒక తల, చిన్నదేహం నేలమీదరాలాయి. రక్తసిక్తమైన మట్టిలో పొర్లిందా చిన్నతల. దిగంబరమై నల్లనిదై రెండుచేతులా నేలను కరచుకొని రక్తం చిమ్ముతున్నదా దేహం. (సీతారాముడు తన కొడుకును నరికి గోతాంలో వేసి తెచ్చిన దృశ్యవర్ణనే ఇదంతా). ఎక్కడా ఆసహజ ధోరణి కన్పించదు. పరిస్థితి తీవ్రతను కళ్ల ముందు నిలిపే అక్షర బలమే చదువరుల ముందు సాక్షాత్కరిస్తుంది. ఆర్థిక విధానంలోని విభిన్నతల సంఘర్షణను అంత పదునుగా చిత్రీకరించిన రచయిత మరొకరు లేరు. విలువలకు ప్రాముఖ్యం ఇవ్వలేదని ఎక్కడా అన్పించదు. 'ఏ కంటికీ కనపడకుండా నువ్వేం సేస్తన్నావో.. అదేపని అందరి కంటికీ కనపడేట్లు నానూ సేసేను' అని అదే సీతారావుడుతో అన్పించారాయన. అందులో తర్కంతో పాటు చేదు నిజం కలగలసి పాఠకుడిని కథకి మరెంతో చేరువ చేస్తుంది. వస్తువు, శిల్పం ఆడుగడుగునా బలోపేతంగా కన్పిస్తుంటాయి.

తనకు తెలిసిందనుకున్న విషయాన్ని ప్రపంచానికి చెప్పాలనుకున్నారు. చెప్పడం ఎలాగో కూడా తెలుసుకున్నారు. అందుకే అక్షరాల్లో అంతటి పటిమ. రచనలమీద శ్రద్ధను అమ్మ కలిగిస్తే, అది సంఘానికి దగ్గరయ్యేలా చేసింది నాన్నే. ఇప్పటికీ మాస్టారు ఏ కొత్తపుస్తకం కన్పించినా చదివికానీ నిద్రపోరు. ఆయన యజ్ఞంలోనూ అందరికీ గోచరించేది అవిశ్రాంత తపనే. కొడవటిగంటి ఒక సందర్భంలో చూపిన పోలికను ఇప్పుడు గుర్తుచేసుకోవాల్సి ఉంది. గ్రామంలోని మూఢత్వాన్ని గురజాడ 'మీపేరేమిటి' కథలో రాశారు, అలాగే ఊళ్లోని వ్యవస్థా రాక్షసాన్ని కాళీపట్నం 'యజ్ఞం' ద్వారా వెల్లడించారు. అందుకే అది మొత్తం తెలుగు కథారచనల్లోనే విప్లవాన్ని ఆవిష్కరించింది.

కథలోనే ఒక చోట కారా అన్నట్లు- శానా కాలానికి పని తగిలింది! అవును. ఆయనలాంటి కథాశిల్పి రచనలు ఎన్ని కాలాలు గడచినా మన మెదడుకు పని కలిగిస్తూనే ఉంటాయి.

**– శరత్‌బాబు**

**చతుర సమీక్ష** | **సెప్టెంబరు 'చతుర' నవల నీరు నేల మనిషి**

సమీక్షకుని/సమీక్షకురాలి పేరు: ______________________

చిరునామా: ______________________

______________________

______________________




నాటి చతుర

నాటి నవల

ఫ్లాష్‌బ్యాక్

# ప్రేమాగ్ని

-నండూరి రామకృష్ణ

సంపుటి : 2 సంచిక : 8 సెప్టెంబర్ 1979

ఇది కాలాన్ని నెమరు వేసుకునే శీర్షిక. పాఠకుల కోసం చతుర తొలినాళ్ళను పరిచయం చేసే శీర్షిక. కాలగమనంలో మొన్న నిన్నటి పొరల్లో ఒదిగిపోయిన నవలాహారాల్ని ఒక్కటొక్కటిగా ఇతివృత్తం, కథనం వగైరా అంశాలతో రేఖా మాత్రంగా పరిచయం చేయడం ఈ శీర్షిక లక్ష్యం. 1979వ సంవత్సరం సెప్టెంబరు నెల **'చతుర'**లో ప్రచురించిన నండూరి రామకృష్ణ నవల **'ప్రేమాగ్ని'** పరిచయాన్ని ఈ సంచికలో ఇస్తున్నాం.

ప్రేమ నిచ్చిన ప్రేమ వచ్చును' అన్నారో కవిగారు. ప్రేమ నివ్వటమే తప్ప తిరిగి పొందలేని సందర్భాలూ కొన్నిసార్లు ఎదురవుతుంటాయి. అలాంటప్పుడే మనిషి మనసు కల్లోల కడలి అవుతుంది. నిరాశా నిస్పృహలు ఆవహిస్తాయి. జీవితం తిమిరమయమనిపిస్తుంది. ఇద్దరు యువతీ యువకుల మధ్య పరస్పరం ప్రేమ ఉద్భవిస్తే బతుకు ఆనందమయమవుతుంది. కానీ అది ఏ వన్‌సైడ్ లవ్వో, ట్రయాంగిల్ లవ్వో అయితే... ఆ ప్రేమే గరళాన్ని చిందిస్తుంది. ఆ "ప్రేమాగ్ని"లో పడి యువతీ యువకులు శలభాల వలె దహించుకుపోగా బంధుమిత్రులకు ఆక్రందనలే మిగులుతాయని చాటిన నవల నండూరి రామకృష్ణ ప్రేమాగ్ని.

**ఇతివృత్తం:** రమణ విశాఖలో రైలు దిగి తన ఇంటికి వెళ్తాడు. ఆ తరువాత ఆఫీసుకి వెళ్ళగానే అతని ప్రాణస్నేహితుడు మూర్తి హైద్రాబాద్ నుండి పంపిన పార్సిల్ అందుతుంది. విప్పి చూస్తే మూర్తి ఉత్తరం, ఓ డైరీ కన్పిస్తాయి. ఆ డైరీ చదవమనీ, అదే తన చివరి ఉత్తరమనీ రాస్తాడు మూర్తి. అది చదివిన మరుక్షణమే ఆఫీసుకు ఎనిమిది రోజులు శలవు పెట్టి హైద్రాబాద్‌కు మూర్తి దగ్గరకు ప్రయాణమవుతాడు రమణ. రైల్లో డైరీ తిరగేస్తాడు. "ఈ డైరీ ఎంతమంది చదివినా ఫరవాలేదు. చదివిన మనిషి నేననుభవించిన చిత్రహింసను అర్థం చేసుకుని నేను చేసిన తప్పులూ, వేసిన తప్పటడుగులూ తన జీవితంలో పునరావృతం కాకుండా చూసుకుంటే అంతే చాలు" అన్న వాక్యాలు మొదటి పేజీలో కన్పిస్తాయి. కడుపులోంచి బాధ ఉప్పెనలా ముంచుకొస్తుంది రమణకు.

రమణ వైజాగ్ వెళ్ళాక తను ఒంటరితనం ఫీలయ్యానని మూర్తి డైరీలో రాసుకున్నాడు. ఓ రోజు తను రవీంద్రభారతికి ఓ ప్రోగ్రాం చూడడానికి వెళ్ళాననీ, తన ముందరి సీట్లో కూర్చుని ఉన్న జ్యోతినీ, ఆమె మిత్రురాలినీ చూశాననీ, ఆ ఇద్దరిలో సాదాసీదాగా చామన ఛాయలో ఉన్నా జ్యోతి తనను విపరీతంగా ఆకర్షించిందనీ రాసుకున్నాడు. ఆ క్షణం నుండే ఆమెను ప్రేమించటం ప్రారంభిస్తాడు మూర్తి.

రవీంద్రభారతి ప్రోగాం ముగియగానే బయల్దేరబోతున్న మూర్తికి ఓ స్నేహితుడు కనిపించి ఆమె పేరూ, చిరునామా చెప్పి, తెలుగు ఎమ్మే చదువుతోందనీ చెబుతాడు. మూర్తికి పరిచయం ఉన్న శకుంతల గారికీ, జ్యోతి కుటుంబానికీ స్నేహం ఉందనీ శకుంతలగారిని అడిగితే మరిన్ని వివరాలు తెలుసుకోవచ్చనీ సలహా ఇస్తాడు.

ఇంటికి వెళ్ళగానే తండ్రితో "పెద్ద అందమైంది కాదు. ఎర్రగా బుర్రగా ఉండదు. కానీ నాకు నచ్చింది. పెళ్ళి చేసుకోవాలనుంది. మనవాళ్ళే. మీ కభ్యంతరం ఉండదు. ఎంతో హోమ్లీగా ఉంటుంది. మీకు తప్పకుండా నచ్చుతుంది"అని చెబుతాడు మూర్తి. "ఇక చాల్లే చెప్పకు. రేపు నాకు అడ్రసు తెచ్చిపెట్టు" అని ఆయన అనగానే పట్టరాని సంతోషం కలుగుతుంది మూర్తికి. ఎందుకంటే తన తండ్రి ఎంత పనైనా సాధిస్తాడు.

తన బాబాయి మురళికి ఈ వివరాలు చెబుతాడు మూర్తి. "కాస్త కళ్ళెం వెయ్యి. ముందా పిల్లను కలుసుకో. ఆమె అభిప్రాయం తెలుసుకోకుండా పరిగెడితే ఎలా? " అంటాడతను. ఆమె ఇంటి దగ్గర్లో ఉన్న పార్కులో నుండి మురళీ, మూర్తీ బయటపడతారు. మురళి వెళ్ళిపోతాడు. మూర్తి నడుస్తూండగా జ్యోతి కనిపిస్తుంది. మూర్తి గుండె దడదడా కొట్టుకోవటం మొదలు పెడుతుంది. ఆమెతో "ఏమనుకోకండి. మీతో కాస్త మాట్లాడాలి. వీలుంటుందా? రేపు సాయంకాలం కలుసుకుందాం" అంటాడు. ఎలా చెప్పాలో, ఎలా మొదలు పెట్టాలో మూర్తికి అర్థం కాదు. మర్నాడు ఉదయం గుడికి వెళ్తాడు మూర్తి. తన ప్రేమను ఆమె అంగీకరించేలా చేయమని దేవుడికి మొక్కుకుంటాడు. వేణు అనే స్నేహితుని దగ్గరకి వెళ్ళి తన ప్రేమ గురించి చెబుతాడు. సాయంకాలం వరకు ఎదురుచూసి రవీంద్రభారతికి వెళ్తాడు. అక్కడికి జ్యోతి వస్తానంది మరి! అక్కడే లాన్‌లో కూర్చుని జ్యోతి వచ్చాక, "మా పెద్దవాళ్ళను మీ నాన్నగారి దగ్గరకు పంపిస్తాను" అంటాడు. "దేనికి" అంటుందామె. తెల్లబోయి "పెళ్ళి విషయం మాట్లాడడానికి..." అంటాడు. "నాకా ఆలోచన లేదండీ" అంటుందామె. "మా నాన్నగారికి చాలా పలుకుబడి ఉంది. మీరు నన్ను ఉద్యోగంలో చేరమంటే మా నాన్నగారితో చెప్పించుకుని నెల రోజుల్లో ఉద్యోగం వేయించుకుంటాను. మీరు ఎమ్మే చదువుతున్నారు. నేను బి.యస్సీ. గనుక మీకు చిన్నతనంగా ఉంటే నేనూ ఎమ్మెస్సీ చేస్తాను. తర్వాత రీసెర్చి చేస్తాను" అంటాడు. "మీకెలా చెప్పాలో నాకర్థం కావటం లేదు" అంటుంది జ్యోతి.

"మీ నిర్ణయం పాజిటివ్‌గా ఉంటే నాకు ఎంతో బలాన్నిస్తుంది. నా అంత అదృష్టవంతుడు లేడనుకుంటాను" అంటాడు మూర్తి.

మర్నాడు ఆమెను చూడాలనే కోరికనణచుకోలేక యూనివర్సిటీకి వెళ్తాడు. ఫరూక్ అనే మిత్రుడు కలుస్తాడు. అతడికి తన ప్రేమ విషయం చెబుతాడు మూర్తి. "ఎం.ఏ.లో చేరిపో, రోజూ ఆమెను చూడొచ్చు" అని సలహా ఇస్తాడు ఫరూక్. నిజంగానే యూనివర్సిటీలో ఎం.ఏ.లో చేరతాడు మూర్తి. "నాకు మిమ్మల్ని చూడకుండా ఉండటం కష్టంగా ఉంది. మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకున్నాను. వారానికి ఓ గంట నాతో గడపండి. నాకది టానిక్‌లా పని చేస్తుంది. ఈ చిత్రహింస ఉండదు. మీరెక్కడికి రమ్మన్నా వస్తాను" అంటాడు ఆమెతో. ఆమె నవ్వాపుకుంటుంది. ఆమె సీరియస్‌గా ఆలోచించటం లేదని అర్థమవుతుంది మూర్తికి.

"నేనెంత గట్టి నిర్ణయం తీసుకున్నానో మీకు తెలియడానికి వేలు ఒకటి కోసుకుంటాను. రేపు చూపిస్తాను మొండివేలు" అంటాడు. ఆమె షాక్ తిన్నట్లు చూసి బస్సెక్కి వెళ్ళిపోతుంది. మూర్తి నిజంగానే బ్లేడుతో చిటికెన వేలు సగం వరకు కోసుకుంటాడు. నొప్పి భరించలేక డాక్టర్ దగ్గరికి వెళ్ళగా ఆయన కుట్లు వేస్తాడు. శకుంతల ఇంటికి వెళ్ళి విషయం చెబుతాడు మూర్తి. ఆమె జ్యోతిని మరచిపొమ్మని సలహా ఇస్తుంది.

యూనివర్సిటీలో జ్యోతి సుధాకర్ అనే యువకుడితో సన్నిహితంగా ఉండటం, కలిసి తిరగటం చూస్తాడు మూర్తి. అయినా ఆమె తనను పెళ్ళి చేసుకుంటుందనే నమ్ముతాడు. తను ఆమె కోసం పడే విరహవేదనను తెలుపుతూ రోజుకో ఉత్తరం రాస్తుంటాడు. ఆమె వాటిని సుధాకర్‌కు చూపించి నవ్వుకుంటుందే తప్ప ఒక్కదానికీ సమాధానం రాయదు. దూరంగా ఉంటేనైనా తనులేని వెలితిని ఆమె అనుభవిస్తుందేమోననుకుని చదువు మానేసి ఉద్యోగంలో చేరతాడు మూర్తి. వచ్చిన జీతం డబ్బుతో ఆమె కోసం చీరలు కొంటాడు. తండ్రికి ఢిల్లీకి బదిలీ అయి కుటుంబమంతా వెళ్ళిపోగా ఓ గది అద్దెకు తీసుకుని వస్తువులు అమరుస్తుంటాడు. ఆఫీసులో సహోద్యోగి ఎలిజబెత్ సోదర ప్రేమతో అతడిని ఊరడిస్తుంటుంది. సలహాల నిస్తుంటుంది. వేణు ప్రేమించినమ్మాయినే పెళ్ళాడటం చూస్తాడు మూర్తి. మూర్తి కోసం కలకత్తాలో ఆఫీసర్ ర్యాంక్ ఉద్యోగం వెదికి పెడతాడు తండ్రి. తండ్రి ఆజ్ఞ మేరకు వారం రోజుల పాటు ఢిల్లీకి తల్లిదండ్రుల దగ్గరకు వెళ్తాడు.

పాత ఉద్యోగానికి రాజీనామా చేసి కొత్త ఉద్యోగంలో చేరడానికి ముందు జ్యోతిని తిరుపతిలో పెళ్ళాడాలని నిర్ణయించుకుంటాడు మూర్తి. తండ్రి ఓ ఫోటో చూపించి "జ్యోతి కాదంటే ఈ అమ్మాయినే చేసుకోవాల్సి ఉంటుంది" అని చెబుతాడు. హైద్రాబాద్‌కు వచ్చేస్తాడు మూర్తి.

చివరిసారిగా ఏ సంగతీ తేల్చుకోవాలని జ్యోతి ఇంటికి వెళ్తాడు మూర్తి. అతడిని వాకిట్లోనే నిలబెట్టిన వాళ్ళక్క తిరిగి వచ్చి జ్యోతి అతనితో మాట్లాడదలచుకోవటం లేదని చెబుతుంది. ఒక్కసారి ఆమెను పిలవమని వేడుకుంటాడు. "రానంటోందని చెప్పాగా! మీరు వెళ్ళిపోవటం అన్ని విధాలా మంచిది" అంటుంది వాళ్ళక్క. మూర్తి స్థాణువులా నిలిచిపోయి తేరుకుని వెనక్కి తిరుగుతాడు. వెంటనే చావాలనుకుంటాడు. తననలా బాధపెట్టి పంపించేసిందంటే ఆవగింజంత ప్రేమ కూడా లేదన్నమాటేగా అనుకుంటాడు. ఇంటికి వచ్చి నిద్రమాత్రలు మింగుతాడు. ఆ సమయంలోనే ప్రాణమిత్రుడు రమణకు ఉత్తరం రాసి, డైరీ పంపిస్తాడు.

రైల్లో రమణ డైరీ సాంతం చదువుతాడు. హైద్రాబాద్ చేరగానే హుటాహుటిన ఆటో ఎక్కి వేణు ఇంటికి వెళ్తాడు. "మూర్తి చచ్చిపోయాడు రమణా!" అని చెబుతాడు వేణు బాధగా. జ్యోతి దగ్గరకు వెళ్ళగా తనూ, సుధాకర్ రెండేళ్ళ నుండే ప్రేమించుకున్నామనీ, పెళ్ళాడబోతున్నామనీ చెబుతుంది. "మూర్తంటే కొద్దిగానైనా ప్రేమ లేదా?" అని రమణ



అడిగినప్పుడు "అతడంటే నాకు జాలి" అంటుంది.

"మీరు మూర్తితో నిజం చెప్పి ఉండాల్సింది. అదే మీరు చేసిన పాపం" అంటూ వెళ్ళిపోతాడు రమణ. దాంతో నవల ముగుస్తుంది. తనను ఆమె కన్నెత్తి చూడకపోయినా, పన్నెత్తి పలకరించకపోయినా, ఆమెతో తన భవిష్యత్తును గురించి సౌధాలు నిర్మించుకుని, అణువణువునా ఆమెనే నింపుకుని ఆరాధించి, ఆమె కోసం తన భవిష్యత్తునే పణంపెట్టి చివరికి ఆమె కాదన్నదని ప్రాణాలనే త్యాగం చేసిన యువకుడు ఈ నవలలోని నాయకుడు. తాను ప్రేమించిన అమ్మాయి దక్కనంతమాత్రాన ప్రాణం తీసుకోవలసిన అవసరం లేదనీ, గుడ్డిగా ఒకవైపు నుండే ప్రేమిస్తే ఆ ప్రేమ పండదనే సత్యాన్ని ఈ నవల ద్వారా వివరించారు రచయిత.

# రెండక్షరాల అనంతం



'కన్నా! ఏడవకు నాన్నా! ఏడిస్తే నీ కళ్లు నీలాలు కారు, నీలాలు కారితే నే చూడలేను. హాయిగా నిదురించి కలలలో విహరించు' - ఓ అమ్మ ప్రేమలాలి.

'మా బాబు కలెక్టర్ కావాలి. అందరూ 'ఫలానా వారి అబ్బాయి' అని చెప్పుకోవాలి. ఎంత కష్టమైనా ఆనందంగా భరిస్తాం' - ఓ కన్న తండ్రి పేమ వెల్లువ.

'త్వరగా వస్తావు కదూ' అంటే తీయగా నవ్వింది కానీ, ఇంతవరకూ కరుణించలేదు. క్షణాలు యుగాలుగా ఉన్నాయి. అబ్బా! ఈ సెల్ కూడా చెలిని చేరువ చేయటంలేదు. రానీ చెపుతా, ప్రేమ దండన విధిస్తా'- ఓ ప్రేమికుడి తహతహ తలపులు.

'పొద్దుననగా వెళ్లారు. ఊరంతా మాటుమణిగినా ఇంకా రాలేదు. ఒకవేళ ఆయనకేమీ కాలేదు కదా, ఏమిటిలా ఆలోచిస్తున్నాను. నాకేమైంది? ఆయనకేమైనా అయితే నేను... ఉహూఁ! ఆ ఊహే భరించరానిదిగా ఉంది. భగవాన్! ఆయనకేమీ కాకూడదు' ఓ అర్ధాంగి ప్రేమైక స్వగతం.

ఇలాగే అక్క, చెల్లి, అన్న, తమ్ముడు, తాత, నానమ్మ, అమ్మమ్మ-ఎన్నెన్నో బంధాలు, ఎన్నెన్నో సందర్భాలు, ఎన్నెన్నో ప్రేమలు. ప్రేమను అక్షరాల్లో కొలిస్తే రెండుగానే అనిపించినా అది అనంతమైంది. అద్వితీయమైంది.




ప్రేమ అనిర్వచనీయమైనది. నిర్వచనం చెప్పే ప్రయత్నం చేయగలగేమే కానీ, అదే అని తీర్మానించలేం. నా దృష్టిలో ప్రేమంటే గాఢాతిగాఢమైన ఇష్టం. అటువంటి ఇష్టం ఏర్పడినప్పుడు వారి ఆనందమే మన ఆనందంగా, వారి బాధే మన భాధగా తోస్తుంది. వారి కళ్లు చెమ్మగిల్లితే మన గుండె చెమ్మగిల్లుతుంది. ఎదుట ఉన్నా లేకున్నా కళ్లనిండా వారి మదినిండా వారిధ్యాసే. మనిషిని నడిపించేది, బతికించేది ప్రేమ. మృత్యువుతో జరిగే పోరాటంలో వైద్యం ప్రధాన పాత్ర వహించిన వ్యక్తికి జీవితంపై ఉండే అపార ప్రేమే అతణ్ణి చిరంజీవిని చేస్తోంది. తీయని మాటలే ప్రేమని వ్యక్తీకరిస్తాయనుకుంటే పొరపాటు. వ్యక్తుల స్వభావాన్ని బట్టి ప్రేమను తిట్లలోను పొంగి పొరలింప చేస్తారు.

చాలామంది ప్రేమను అర్థం చేసుకోవడంలో పొరబడి, సంకుచితత్వంతో దాన్ని కుదిస్తున్నారు. ప్రేమ అనగానే యువతీ, యువకుల మధ్య జనించేది అన్నది ఒక సాధారణ అభిప్రాయం. సినిమాల ప్రభా

వమే దీనికి కారణం కావచ్చు. ప్రేమించుకునే వ్యవహారం లేని సినిమాలు అరుదు. ప్రేమలో కూడా తీవ్రతలకు సంబంధించిన తేడాలుంటాయి.

ప్రేమను సఫలం చేసుకోవడంలోనే కష్టాలెన్నో ఎదురవుతాయి. ధైర్యం లేకుంటే ఏ ప్రేమా ఫలించదు. అలాగే ఆర్థికంగా సొంత కాళ్లపై నిలబడలేకుంటే ప్రేమ నౌక తుఫానుకు గురికాక తప్పదు. ప్రేమ స్వచ్ఛమైందిగా, నిస్వార్థమైందిగా ఉండాలి. సంపన్నుడి ఏకైక కుమార్తెను ఒక పథకం ప్రకారం తనవైపు ఆకర్షితురాలయ్యేలా చేయడం, వలలో వేసుకోవడం కాదు ప్రేమంటే.

అలాగే సహచరిపై ప్రేమను ఒలకబోస్తూనే ఆధిక్య భావనతో, అహంతో ప్రవర్తించే వారెంతో మంది ఉన్నారు. ఆమెనూ ఓ వ్యక్తిగా, తనతో సమంగా గుర్తించగలగాలి. ప్రేమలో ఎక్కువ, తక్కువ భావనలు ఉండకూడదు. అంతేకాదు తాను ప్రేమించగానే, అవతలి వ్యక్తి ప్రేమించి తీరాలి అనుకోవడం, నాకేం తక్కువ, నన్నెందుకు తిరస్కరించాలి. ఎలాగైనా సరే ఆమె నాకే దక్కాలి అనుకోవడం చాలా పొరపాటు. అవతలి వ్యక్తి మనసుకు సంబంధించిన అభిప్రాయాన్ని తప్పనిసరిగా గౌరవించాలి. బలప్రయోగంతో ప్రేమను పొందాలనుకోవడం మూర్ఖత్వం తప్ప మరేమీ కాదు. విరియని మొగ్గను బలవంతంగా రెక్కలు లాగితే అది విచ్చుకోదు సరికదా, జీవకళనే కోల్పోతుంది. ప్రేమ కూడా అంతే. మన ప్రేమ ఎదుటి వ్యక్తిని బాధించేది కాకూడదు. ప్రేమించిన వ్యక్తి సుఖసంతోషాలను కోరుకోకపోతే ఇక ఆ ప్రేమకు అర్థమేముంది? ప్రేమ దక్కని సందర్భాల్లో హత్యకు పాల్పడటం వంటి సంఘటనలు ఇటీవలి కాలంలో పెరిగిపోతున్నాయి. ఇది చాలా శోచనీయం. మరికొంతమంది క్షణికావేశంలో ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. పాఠశాల దశ నుంచే ప్రేమను పెంచి, పోషిస్తున్నాయి మన సినిమాలు. వాటి ప్రభావంతో టీనేజ్ పిల్లలెంతో మంది తప్పుదారి పడుతున్నారు. ఆకర్షణకు, ప్రేమకు మధ్య ఉండే సన్నని పొరను గుర్తించలేక, సతమతమై విలువైన కాలాన్ని వ్యర్థం చేసుకుంటూ, భవితను నాశనం చేసుకుంటూ, అజ్ఞానంతో వేధింపులకు, బ్లాక్‌మెయిల్‌కు పాల్పడుతున్నారు, ప్రేమను వికృతం చేస్తున్నారు.

పిల్లలకు ముందుగా పరిచయం చేయవలసింది మానవీయ ప్రేమ. అప్పుడే చుట్టూ ఉన్న అనేకానేక బాధితుల, పీడితుల కన్నీళ్లను వారు ప్రేమతో తుడిచేయగలుగుతారు. మానవ కళ్యాణానికి పాటు పడగలుగుతారు. జీవితం ఎంతో చిన్నది, ఎంతో విలువైంది. ఇది అనేకానేక ప్రేమబంధాలతో కూడుకొన్నది. కేవలం తాను ప్రేమించిన అమ్మాయి/ అబ్బాయి దక్కనంత మాత్రాన నిండు జీవితాన్ని నిండుసున్నా చేసుకోవటం అవివేకం. విస్తారమైన ప్రేమను ఇతర కోణాల్లో పొందవచ్చు. ఇవ్వవచ్చు. కాసింత ప్రేమ పంచి ఎందరి కన్నీళ్లో తుడవగల శక్తి ఉండీ, జీవితాన్ని నిష్ఫలం చేసుకోవడం అర్థరహితం.

శ్రవణకుమారుడు అంధులైన తల్లిదండ్రులపై చూపిన ప్రేమను స్మరించుకోవాలి. దేశాన్ని ప్రేమిస్తూ, దేశ రక్షణకే అహరహం జీవితాన్ని అంకితం చేసే సైనిక సోదరులను స్ఫూర్తిగా తీసుకోవాలి. వికలాంగులు, రోగులు, వృద్ధుల సేవలో నిమగ్నమైన ఎందరో సేవామూర్తులు మనకు ఆదర్శం కావాలి. ప్రేమ నిత్యమైంది, సత్యమైంది. ప్రేమ సంతోషాన్నే కాంక్షిస్తుంది కానీ సంతాపాన్ని కాదు. జగమంతా ప్రేమమయం, దానిని గుర్తించగలిగితే జీవితమే ఆనందమయం.

– జె.శ్యామల



జూలై 2006 'చతుర' నవల

# సంసార సాగరాలు పై సమీక్షలు



## సాగరంలో మునిగిపోకుండా...

(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

సంసార నావని, సాగరంలో మునిగిపోకుండా జాగ్రత్తగా ఒడ్డుకు చేర్చిన ఘనత కాత్యాయనికే దక్కుతుంది. ఏ ఇల్లాలయినా తన సంసారం, తన పిల్లలు అనుకుని ప్రవర్తించినపుడే, ఆటుపోట్లు ఎదురైనా ఎదుర్కొని నిలబడగలుగుతుంది. సమర్థవంతంగా నడిపిస్తుంది. హుకుం జారీ చేసినా, అలక పాన్పునాశ్రయించినా, అదీ తన సంసారం కోసం పడే తాపత్రయమే.

పిల్లలకు తల్లి దగ్గరే చనువెక్కువ. స్వయం నిర్ణయాలు తీసుకున్నా ఎక్కడా తప్పటడుగు వేయకుండా నడుచుకోవటాని క్కారణం కచ్చితంగా ఆమె వేసిన పునాదే. అయినా ఆమె గుర్తింపు కోసం పాకులాడలేదు. ఇది అర్థం చేసుకోని పిల్లలు తనను విమర్శించినా, కాసేపు అలిగి ఊరుకుందేగాని తన మాట చెల్లలేదని సాధించలేదు. తన పెంపకంలో పెరిగిన పిల్లలు తప్పు చెయ్యరన్న నమ్మకంతోనే, భార్గవి తన పెళ్ళి విషయంలో అంత నాటకమాడినా నిబ్బరంగా వుందే గాని సహనం కోల్పోలేదు. సంసారమే లోకంగా మసలుకున్నా, పెద్ద చదువులు లేకపోయినా కుటుంబాన్ని ఈదటంలో మాత్రం ఆమెదే పైచేయి. ఆమె హృదయం లోతు తెల్సుకోవటం ఎవరికీ సాధ్యం కాదు.

ఎంత జాగ్రత్తగా పెంచినా ఒక్కోసారి జీన్స్ కారణంగా కొన్ని లక్షణాలు అనుకోకుండా బయటపడుతుంటాయి. మేనత్త పోలిక రావటంతో భార్గవి విషయంలోను అదే జరిగింది.

వేదవల్లి విషయానికొస్తే రేచల్ గురించి తెలిసిన తర్వాతనే భర్త మీద అయిష్టాన్ని పెంచుకుందిగాని అంతకు ముందువరకు తన సంసారం సాఫీగానే సాగిపోయింది. విడాకులు తీసుకుంటే తనకూ, పిల్లలకు అన్యాయం జరుగుతుందని తెలివైన నిర్ణయం తీసుకుంది. పరాయి దేశపు స్త్రీ అయినా రేచల్ స్వార్థాన్ని చూపించకుండా మసలుకున్న తీరు హర్షదాయకంగా వుంది.

కథ చాలా సాదాసీదాగా సాగిపోయింది. స్త్రీ ఔన్నత్యాన్ని, సేవా గుణాన్ని లోకానికి మరోసారి గుర్తు చేశారు రచయిత్రి.

**– విజయలక్ష్మి**, మిర్యాలగూడ.

## మంచి ముగింపు *(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

వి.ఎస్. రమాదేవి గారి 'సంసార సాగరాలు' నవల ఓ చక్కటి ప్రయత్నం. సమకాలీన సామాజిక పరిస్థితులను అక్షరబద్ధం చేస్తూ ఆధునిక కుటుంబంలోని సంఘర్షణలను మన కళ్ళ ముందు సాక్షాత్కరించేలా చక్కనైన ఇతివృత్తంతో, మనసులను హత్తుకునే శైలితో నవల ఆసాంతం రంజింపచేసింది.

తన భర్త కుటుంబీకులు తను అందంగా లేనని ఆరడి పెట్టిన మాటలకు న్యూనతపడి తన జీవితాన్నే నరకప్రాయం చేసుకుంది కాత్యాయని. ఇంటి వాళ్లందరికి సేవ చేసింది కాని, ఆనందాన్ని అందించలేకపోయింది. తన

ను పెళ్ళి చేసుకున్న ఇన్నాళ్ళలో భర్త ఏనాడూ తను అందగత్తె కాదని అనలేదు. అసలు ఆయన మనసులో అలాంటి భావన ఉన్నట్లు ఏనాడూ కనపడలేదు. తమ పిల్లలు తమంతట తాము నిర్ణయాలు తీసుకోవడం, భర్త కూడా వారిని సమర్ధించడం లాంటి పరిణామాలకు తను తల్లడిల్లడం, కుమిలిపోవడం, చివరకు భర్త బుజ్జగింపులతో అలక వీడటం ఇలాంటి న్యూనతా భావంలో పాతుకుపోయిన భార్యలకు కాత్యాయని పాత్ర ఓ కనువిప్పులాంటిది. కాత్యాయని, వేదవల్లి పాత్రలను రచయిత్రి అద్భుతంగా మలిచారు. ఒకరు అర్ధరహితమైన ఆలోచనల మధ్య న్యూనతాభావంతో బతుకుతుంటే, మరొకరు తన భర్త వేరొకరిని ఇష్టపడ్డాడని తెలిసి కూడా రాజీపడి సంసారంలో కలతలు లేకుండా సర్దుకుపోయే మనస్తత్వం. ఇక భార్గవి విషయానికొస్తే ఈ తరం మహిళ అనిపించుకుంది. ముగింపుకొచ్చేసరికి కాత్యాయనిలో మార్పు వచ్చేలా చేసి నవలకు మంచి ముగింపు నివ్వడంలో రచయిత్రి సఫలీకృతులయ్యారు.

–'సుందరి', గొల్లల వలస.

## మారితే బాగుండు (మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)

వి.యస్. రమాదేవి గారి నవల 'సంసార సాగరాలు' పేరు చూడగానే వెనుకటి తరం రాజమన్నారు నవల 'సంసార సాగరం' గుర్తొస్తుంది. మధ్యతరగతి సంసారాలలో వుండే కష్టాలు, కన్నీళ్ళు వున్నాయేమో అనిపిస్తుంది. కానీ ఈ నవల ఎగువ మధ్యతరగతి సంసార సాగరాలు గనుక అటువంటివి లేకుండా సున్నితమైన సెంటిమెంట్‌తో ఆహ్లాదకరంగా సాగింది. ఈ నవలలో కాత్యాయని పాత్ర చిత్రణే హైలైట్. తను కన్నబిడ్డలు తన మాట జవదాటరనే నమ్మకంతో ప్రవర్తిస్తుంది. పిల్లలు పెద్దవాళ్ళయిన తర్వాత ఆమె నమ్మకం వమ్మయినప్పుడు షాక్ తింటుంది. భర్త గూడా పిల్లల్ని వెనుకేసుకుని రావడంతో నిరాశకు గురవుతుంది. తనను ఎవరూ లెక్క చెయ్యడం లేదని గింజుకుంటుంది. కాపురానికి వచ్చినప్పటి నుంచి తను అందగత్తె కాననీ, పెద్ద చదువులు చదువుకోలేదనే ఆత్మన్యూనతా భావం ఆమెకు వుంది. తన మాటే చెల్లాలనే మంకు పట్టుదలతో వుంటుంది. ఇటువంటి కాత్యాయనులు చాలా కుటుంబాలలో తారసపడతారు. కుటుంబంలో ఘర్షణ వాతావరణానికి ఇటువంటి మనస్తత్వం గలవారే కారణం. ఐతే తర్వాత పరిస్థితులను అర్థం చేసుకుని ఇష్టం లేకపోయినా తను పూర్తిగా మారిపోయింది. నిజ జీవితంలో గూడా ఇలాంటి వారు పిల్లల్ని అర్థం చేసుకుని మారితే ఎంత బాగుండును అనిపిస్తుంది.

– ప్రసాద్, హైదరాబాద్.

## ఎలా ఉండాలో... (నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)

పెళ్లి చేసుకొని సంతానం పొందిన తల్లి దండ్రులందరూ చదవవలసిన అంశాలతో కూడిన నవల వి.యస్. రమాదేవి గారి 'సంసార సాగరాలు'. అవసరమైతే తప్పనిసరిగా పిల్లల కోసం కొన్నింటిని త్యాగం చేసైనా వారి భవిష్యత్తు తీర్చిదిద్దడం తల్లిదండ్రుల బాధ్యత అని 'గోపాలరావు', 'వేదవల్లి' పాత్రలు తెలియచెప్పాయి.

అమ్మ, అక్కల నసకు విసిగిపోయి వారి పట్ల పంతంతో తన పెళ్లి పట్ల నిర్ణయం తీసుకున్న గోపాలకృష్ణ తరువాత జీవితంలో ఎంతో హుందాగా వ్యవహరించిన తీరు మనసు నాకట్టుకుంది. భర్త, పిల్లలే లోకంగా బతుకుతూ, వారు తనలాగే ఉండాలని ఆశిస్తూ ఒకవైపు, మరోవైపు తన పట్ల తనే లేనిపోని అపోహలతో బాధపడ్తూ, భార్య కాత్యాయని, ఎంత విసిగించినా సతాయించినా, ఆమె అమాయకత్వాన్ని అర్థం చేసు

కొని, ఆమెని పసిపాపలా బుజ్జగిస్తూ, తమ జీవితాలు, పిల్లల జీవితాలు అర్థవంతంగా సాగి పిల్లలంతా మంచి స్థితిలో స్థిరపడటానికి భార్యలో మార్పు రావటానికి, మూల కారణ మయ్యాడు గోపాలకృష్ణ.

అలాగే జీవితంలో ఎదురయిన చేదు నిజాన్ని, మార్చే అవకాశం లేదు కాబట్టి, రాద్ధాంతాలతో తన మనశ్శాంతిని దూరం చేసుకొని, ఇంటిని నాశనమవకుండా నిబ్బరంగా వ్యవహరించింది వేదవల్లి.

చిన్నా చితకా సమస్యలకే తమ జీవితాలను, పిల్లల జీవితాలను నరకప్రాయం చేసుకొనే కొందరు దంపతులకు కనువిప్పు కలగటానికి, ఇద్దరు వ్యక్తుల జీవితాల్లో తటస్థపడిన పెద్ద సమస్యలను ఇతివృత్తంగా చేసుకొని సాగిన ఈ రచన ఉపయోగపడుతుందనిపించింది.

– సింగస్వామి స్వర్ణమాల, తిరుపతి.

## క్షమయా ధరిత్రీ (ఐదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)

"ఊరు అందం గోడలు చెబుతాయి" అన్నట్లు వి. ఎస్. రమాదేవిగారి నవల "సంసార సాగరాలు" ప్రారంభ సంభాషణల లోనే కథాగమనం పాఠకుల్ని ఆకర్షించింది.

ఉద్యోగాలు చేసే వాళ్లంతా ఫస్టు క్లాసులోనే పాసయి ఉండనక్కరలేదు. అంకిత భావంతో, శ్రమశీలతతో పనిచేస్తే, ఓర్పు, నేర్పు చూపిస్తే, సెకండు క్లాసులో పాసయినవాళ్లైనా, సమర్థులుగా అనుభవజ్ఞానంతో పైకొస్తారు. అనే సందేశాన్ని ఈ నవల అందిస్తుంది.

మధ్యతరగతి కుటుంబంలోని వాళ్లు ఎలా పరస్పరం సహకరించుకొంటూ కలసి మెలిసి ఉండాలో గోపాలకృష్ణ కుటుంబాన్ని ఉదాహరణగా రచయిత్రి చక్కగా చిత్రీకరించారు.

గోపాలకృష్ణ, అతని భార్య కాత్యాయని, శ్రమశీలత, వారిపిల్లలు హరి, భార్గవి, ప్రమీల, తల్లిదండ్రుల అదుపు ఆజ్ఞలు మీరని విధేయత,గౌరవం, ఇతర కుటుంబాలకు ఆదర్శం.

కలిగినదానితో సంతృప్తిపడి సంతోషంగా వుండగలిగినవారే అసలైన ఐశ్వర్యవంతులు!

భర్త తనను ఎంతగా ప్రేమిస్తున్నా, ప్రవర్తనలో అతడు శ్రీరామచంద్రుని వంటి శీలవంతుడైనా, బయట కొత్తగా పరిచయమైన స్త్రీలతో బంధంఏర్పడుతుందేమోనన్న భయం అడుగడుగునా కొందరు సాధారణ గృహిణులను పెను భూతంలాగా పీడిస్తుంది. ఆ తత్వాన్ని కాత్యాయనిలో ఆమె సహజ గుణంగా రచయిత్రి రమాదేవిగారు చూపిన తీరు ప్రశంసనీయం!

"రాత్రి, పగలు, అనక టూర్లలో వెంట వుండి, కంపెనీ ఆంతరంగిక విషయాలు చూసుకుంటూ వుండే స్త్రీలతో అందులో రేచల్ లాంటి భావుకురాలి ఆకర్షణలో పడి సంబంధం పెట్టుకోకపోతే ఆశ్చర్యపడాలి కానీ, దగ్గరైతే ఆశ్చర్యపడనక్కర్లేదు" అనుకునే వేదవల్లి విజ్ఞత, సహనం, అనుపమానం! "క్షమయాధరిత్రీ" అనే నీతిశాస్త్ర వాక్యం వేదవల్లి వంటి మహిళకే వర్తిస్తుంది. ఈ నవలలో జరిగిన మంచి పనులన్నింటికీ సూత్రధారి వేదవల్లి! గోపాలకృష్ణ కుటుంబం పాలిటి కల్పవల్లి!

- సూర్యదేవర శారద, హైదరాబాద్.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 277438; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net




వలయాకార పర్వతాల మధ్య ఈ సువిశాల అఖాతం తోకచుక్క సృష్టించిన బీభత్సానికి నిదర్శనం. 13 కోట్ల ఏళ్ల క్రితం ఒక తోకచుక్క భూమిని ఢీకొన్నప్పుడు సంభవించిన బృహత్ విస్ఫోటానికి భూగోళమంతా నిలువెల్లా వణికిపోయింది. డైనోసార్లు వంటి అతిపెద్ద జంతువులు కూడా అంతరించిపోయాయి. అఖాతం చుట్టూ ఉన్న పర్వతాలు విస్ఫోటపు సృజనే. ఆస్ట్రేలియాలోని ఈ అఖాతాన్ని 1873లో ఎడ్మండ్ గొసే కనుగొన్నాడు. ఉపగ్రహ ఛాయా చిత్రాల్లో ఇది భారీ వేలిముద్రలాగ కన్పిస్తుంది.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2006-2008 RN1/32186/78